# చతుర

జూలై 2006

రూ. 7/-



వి.ఎస్.రమాదేవి నవల

## సంసార సాగరాలు

## నీటి పేలుడు

ఐస్‌ల్యాండ్‌లోని
వేడినీటి జలాశయాల్లో
కనిపించే నయనానంద
కరమైన దృశ్యమిది.
ఈ జలాశయాలు
అడుగుభాగాన అత్యధిక
ఉష్ణోగ్రతతో కుతకుత
ఉడుకుతూ ఒత్తిడి
అమితంగా పెరిగినప్పుడు
పేలుడు జరిగినట్లుగా
వేడి నీరు ఇలా వందల
అడుగుల ఎత్తు వరకు
విరజిమ్మబడుతుంటుంది



నవ నవలా వేదిక

# చతుర

సంపుటి : 29 | సంచిక : 6
జూలై : 2006 | 342 వ సంచిక

## ఈ నెల నవల

ఎగువ మధ్య తరగతి జీవన చిత్రం

# సంసార సాగరాలు

వి.ఎస్ రమాదేవి 10వ పేజీలో





బొమ్మలు: భాస్కర్



రచయితలకు ప్రత్యేకం

కథలు-కబుర్లు - 20

# కావలిసిందల్లా కదలిక మాత్రమే

'కథలు రాయటమెలా?' అంటూ నియమాలు చెప్పటం వట్టి నాన్సెన్స్ అనే అభిప్రాయం ఉంది. ఈ నియమాలు' పెట్టిందెవరు? బహుశా ఒక చాత కాని కథకుడు లేదా తన పద్ధతులు అందరికీ వర్తిస్తాయని భ్రమపడ్డ మరో రచయిత. 'ఎవరి అలవాట్లు వాళ్ళకు ముద్దు' అని ఇంగిత జ్ఞానం ఉన్న వాళ్లందరికీ తెలుసు. ఒకడు మొత్తం ప్లాటు, అధ్యాయాల విభజన, విస్తృతంగా నోట్స్ వగైరా తీసుకుని ప్రారంభిస్తాడు. మరొకడికి డికెన్స్ లాగ, ఒక పాత్ర పేరు తట్టినా చాలు. అందరికీ వర్తించే నియమం ఒక్కటే. రచయిత కావాలనుకున్న వాడికి రాయటం తప్ప గత్యంతరం లేదు. రాయని భాస్కరుల గొప్ప కథలు పాఠకులకు చేరవు.

పాత్రలు, ఇతివృత్తం వగైరాల గురించి మాట్లాడుకున్నాం. కాని రాయటానికి కూర్చున్నప్పుడు ఇవి వేర్వేరుగా మనకు కన్పిస్తాయా? అన్నీ కలగలిసిన- వీటన్నింటినీ మించిన ప్రేరణ ఏదో మనచేత రాయిస్తుందని రచయితలకు తెలుసు. అంతా ఊహే అనుకున్నప్పటికీ, రాసే క్రమంలో దాన్ని వాస్తవంగానే అనుభవిస్తాం. చెట్ల పొదల్లో, కొండ గుహల్లో రాక్షసులు దాగుంటారని పిల్లలు నిజంగా నమ్ముతారు. ప్రసిద్ధ కథకుడు రొనాల్డ్ డాల్డ్ రాసిన "విష్" దీన్ని గురించే. తెల్ల, నల్ల గళ్ళు గీసుకుని గెంతుతుంటాడో కుర్రాడు. ఆటలో భాగంగా నల్లగళ్లలో తాచు పాములున్నాయని ఊహించుకుంటాడు. అందువల్ల తెల్ల గళ్లలో మాత్రమే పాదం మోపాలి. పొరబాటున ఒకసారి నల్ల గడిలో కాలు పడుతుంది. అంతే. పాము కరచినట్టుగానే నోట్లోంచి నురగ వస్తుంది కుర్రాడికి. కథకుడికి కావలసింది ఇలాంటి నమ్మకమే.



యూడోరా వెల్టీ

నియమాలు, నిబంధనల వల్ల మనకు నష్టమే ఎక్కువ అనటానికి మరో కారణం కూడా ఉంది. మనలాగే అవి నేర్చుకుని రాసే వాళ్ళు మరో వంద మంది ఉంటారు. మూస కథల్ని ఎవరు మాత్రం ఇష్టపడతారు!

మీకు నచ్చిన ప్రసిద్ధ కథల్ని, నవలల్ని చదవండి. రాయాలనే కోరిక ఉన్న వాళ్లకు వాటి వల్ల లోపల కదలిక వస్తుంది. క్రమంగా అదే రచనగా ప్రాణం పోసుకోవచ్చు సహజంగా చెయ్యటమే నిజమైన నేర్పు. నిజానికి ప్రయత్నించినా మరోలా చెయ్యలేం. ఈత నేర్చుకున్నట్టే ఇది కూడ ట్రెయినింగు టెక్నిక్కుల సంగతి దేముడెరుగు. నీళ్లలో పడినప్పుడు మొదట మునగ

కుండా ఉండటానికి ప్రయత్నిస్తాం.

కథా సాహిత్య విమర్శలు చదవడం వల్ల రచయితలకు ప్రయోజనం ఉండదంటుంది రచయిత్రి యూడోరా వెల్టీ. "రచనా ప్రక్రియను గాక, అచ్చయిన రచన ఎలా ఉందో విశ్లేషిస్తాయవి. నా కథల్ని గురించి రాసింది చదివి ఆశ్చర్యమేసింది. అన్ని విషయాలు నేనెప్పుడూ ఆలోచించలేదు. వాళ్ళు నా రచనల్ని ముక్కలు చేసి మాట్లాడుతుంటే, 'అయ్యో, బోసినవ్వుల పాపాయి లాంటి కథల్ని డిసెక్ట్ చెయ్యటానికి వీళ్ళకు మనసెలా వొప్పింది" అంటూ గిలగిలలాడాను. వాళ్ళు రాసింది నూటికి నూరు పాళ్లు నిజమే కావచ్చు కాని రచనా ప్రక్రియకూ దానికీ ఏమాత్రం సంబంధం లేదు. విమర్శ అంటే కథను దుర్భిణీకి అటువైపునుంచి చూడటం. రచనా క్రమం ఏక దిశలో ఎప్పుడూ ముందుకే సాగుతుంది. కథను ఆనందించే క్షణంలో మాత్రమే మనం రచయితతో మమేకం కాగలం.


విలియం సారోయన్

మనుషులకున్నట్టే కథలకూ వ్యక్తిత్వం ఉంటుంది. అందువల్ల ఏ రెండు కథలకూ పూర్తి సారూప్యం ఉండదు. కథను పోలిన కథ ఉంటుంది. అది వేరే విషయం. కథల్ని అర్థం చేసుకోవటమంటే మనుషుల్ని అర్థం చేసుకోవటమే.

పుంఖానుపుంఖాలుగా కథలు రాసిన సారోయన్ కథంటే ఏమిటో తను నిర్వచించలేనన్నాడు ఓ ఇంటర్వ్యూలో. అసలు అదేమిటో తెలుసుకోవటానికి చేసే ప్రయత్నమే కథ.

కథ ఒక కళారూపం. మనిషి లాగ ఇది కూడా ప్రకృతిలో భాగమే అయినప్పటికీ, వ్యక్తి తన చైతన్య స్థాయినిబట్టి, అభిరుచులకు అనుగుణంగా సృష్టిస్తాడు. ఎల్లలు లేని ఊహాలోకంలో విహరించిన వాళ్ళు కూడా చివరన నేల మీదికి దిగక తప్పదు. స్థల కాలాలకు వ్యాపించిన పంచభూతాలే కళా సృష్టికి కూడా మూలం. అందువల్ల మనిషిలాగ, అన్ని కళా రూపాలు కూడా ఒక నాడు కనుమరుగు కాక తప్పదు.

అయితే కళ స్థూల శరీరానికి సంబంధించిన విషయం మాత్రం కాదు. మనసు, ఆత్మ లేదా అలాంటిదేదో దీనికి కారణం.

కళా సృష్టి జరిగే క్షణంలో వ్యక్తి చేతన ఇలా ఉంటుంది కాబోలు.

– ముక్తవరం పార్థసారథి

(వచ్చే నెలలో మరిన్ని విశేషాలు) ✦

# యుద్ధము - శాంతి

1861

ప్రపంచ ప్రసిద్ధ నవలల
పరిచయ వేదిక

కౌముదీతం

లియో టాల్‌స్టాయ్ రచనల్లో అత్యంత ప్రసిద్ధమైన నవల యుద్ధము- శాంతి.

1812లో నెపోలియన్ బోనాపార్ట్ రష్యాను ఆక్రమించుకోవటం ఇందులోని కథాంశం.

రచనలోని అన్ని అందాలకన్నా ఉత్తమమైనదీ అభిలషణీయమైనదీ 'స్పష్టత' అని నిరూపిస్తుంది 'యుద్ధము-శాంతి' నవల. ఇందులో కథనమూ, వాక్యాలూ కవితాత్మకంగా ఉండవు. కొన్ని పొడిగానూ, కొన్ని మరీ పొడుగ్గానూ ఉంటాయి. కాని చదివిస్తాయి. విశాలమైన జీవిత సంక్లిష్టతను అన్ని పార్శ్వాల నుండీ పట్టుకోవటానికి అలాంటి శైలి అవసరమైంది. ఇది చదివిన పాఠకులు జీవితాన్ని చూసే పద్ధతి మారిపోయింది. అంటే అంతగా ప్రభావితం చేస్తుంది.

ఇందులో గాని, టాల్‌స్టాయ్ ఇతర రచనల్లో గాని పాఠకుడికి అర్థం కానిదేదీ ఉండదు. హై బ్రో కాదు. పాండిత్య ప్రకర్ష ఉండదు. అతి సామాన్య వ్యక్తి కూడా చూడగలిగిన విషయాలనే చూస్తాడు. అందువల్ల, పాఠకుడికి అంతా తనకు తెలిసిందే రాస్తున్నాడనే నమ్మకం కలుగుతుంది. 'తనకు, తెలిసిందే' కాని చదివిందాకా అది తనకు తెలుసనే విషయం పాఠకుడికి తెలియదు. అది టాల్‌స్టాయ్ పరిశీలన, స్పందన తీవ్రత. పాఠకుడిలోని సుప్త చైతన్యాన్ని జాగృతం చెయ్యగలిగిన రచనలు తప్పక గొప్పవి.

ఈ పుస్తకం మీద విమర్శలకూ కొదవ లేదు. ఇందులో నెపోలియన్ పోషించిన పాత్రనూ, టాల్‌స్టాయ్ చరిత్ర గురించి వెలిబుచ్చిన అభిప్రాయాలనూ తప్పు పడతారు చరిత్రకారులు. యుద్ధ వ్యూహాలను అధ్యయనం చేసిన వాళ్లు యుద్ధ వర్ణనలు అసహజంగా ఉన్నాయంటారు. రష్యన్లకు తప్ప మరెవ్వరికీ ఇందులోని పాత్రల పేర్లూ, వాళ్ల ఆర్థిక, వర్గ స్థితిగతులను గురించిన విశేషాలూ గుర్తు పెట్టుకునే అవకాశం లేదని ప్రపంచ పాఠకులు కనుబొమలు చిట్లిస్తారు. ఇది కథ లాగ కాక, అనేక ఉప కథల సమాహారంగా సాగుతుందంటారు విమర్శకులు. ఇన్ని పరిమితులున్నప్పటికీ పాఠకులను ముంచెత్తే పెను తుఫాను లాంటి నవల యుద్ధము- శాంతి!

**ఇతివృత్తం:**

1805-1820ల మధ్య పరిణామం చెందిన రష్యా సామాజిక, రాజకీయ పరిస్థితులకు నిలువుటద్దం యుద్ధము- శాంతి. చక్రవర్తులు, మంత్రులు, అనేక హోదాలలో ఉన్న సైనికాధికారులు, ఇతర ఉద్యోగులు, మామూలు సైనికులు, సంపన్నులు, రైతులు, రైతు కూలీలు- అందరూ ఉంటారిందులో.

మాస్కోలో జరిగే విందుతో






"చరిత్ర గతినెవ్వరూ మార్చలేరు. మనుషులు కేవలం నిమిత్తమాత్రులు" అని నమ్మాడు టాల్‌స్టాయ్. ఈ రోజుల్లో ఈ అభిప్రాయాలను ఎవరూ అంగీకరించరు గాని రచయిత ప్రతిభంతా ఒక విశాలమైన కాన్వాస్ మీద రష్యన్ జీవితాన్ని చిత్రించటంలోనూ, 540కి పైగా పాత్రలున్న కథలో ప్రతి వ్యక్తినీ సజీవంగా పాఠకుడి ముందు నిలబెట్టడంలోనూ దర్శనమిస్తుంది. పెళ్లి కాకముందే టాల్‌స్టాయ్‌కి నవల రాయాలనే ఊహ కలిగింది. చారిత్రక నవల గనక, రష్యా అంతటా తిరిగి అవసరమైన సమాచారం సేకరించాడు. అనేక భోషాణాలు కేవలం ఈ 'ముడిసరుకు'తో నింపాడట. 1856 నుండి 1861 దాకా సాగింది రచన. సోన్యాకు భర్తంటే ఆరాధన. ఆమె సహాయం లేకుండా ఈ నవల వెలుగు చూసేది కాదేమోనంటే అది అబద్ధం కాకపోవచ్చు. చీమ కాళ్ల లాంటి భర్త దస్తూరితో ఉన్న రెండువేల పేజీలను ఏడుసార్లు తిరగరాసిందా యిల్లాలు. ఆ తర్వాత ఏడేళ్ల పత్రికలో సీరియల్‌గానూ, చిన్న చిన్న సంపుటాలుగానూ వచ్చింది. ఈ మహాకావ్యానికి మొదట 'ఇయర్ 1805' అనీ, తరువాత 'ఆల్ ఈజ్ వెల్ దట్ ఎండ్స్ వెల్' అనీ పేరు పెట్టాలనుకున్నాడట. రచయితా, రచయిత భార్య, వృత్తి నిపుణులైన ప్రూఫ్ రీడర్లూ అనేకసార్లు దుర్భిణీలోంచి చూసి అచ్చేసిన ఈ పుస్తకం తొలి ముద్రణలో అనేక howlers దొర్లాయి. ఉదాహరణకు. ప్రిన్సెస్ మార్యా యుద్ధానికెళుతున్న తన అన్న ఆంద్రెకి వెండి లాకెట్ మెళ్లో వేస్తే గాయపడిన ఆంద్రె వద్ద ఫ్రెంచి సైనికులకు బంగారు లాకెట్ కనిపిస్తుంది. కథానాయిక నటాషాకి 1805లో 13 ఏళ్లు. 1806లో 15. 1809లో 16. డిసెంబరులో జూదమాడి డబ్బు పోగొట్టుకున్న నికొలస్ రోస్టోవ్ అదే సంవత్సరం నవంబర్‌లో మాస్కో విడిచి వెళ్లిపోతాడు. పియెర్ బజురోవ్ 1812లో వచ్చిన తోకచుక్కను 1811లో చూస్తాడు. ఇంక చిన్న పాత్రల పేర్లు తరుచుగా మారిపోతూ ఉంటాయి.

కాని ఈ నవల పాఠకుల్ని ఎంతగా మంత్ర ముగ్ధుల్ని చేసిందంటే, ఈ లోపాలు చాలా కాలం పాఠకుల, విమర్శకుల దృష్టికే రాలేదు.

ప్రారంభమవుతుంది కథ. నెపోలియన్‌ను చక్రవర్తిగా ప్రకటించటం గురించి చర్చ జరుగుతుంది. క్రమంగా ప్రధాన పాత్రలు నటాషా రోస్టోవ్, ప్రిన్స్ ఆంద్రూ బోల్కోన్స్కీ, పియెర్ బెజుకోవ్ వగైరా రంగప్రవేశం చేస్తారు. తొలి పేజీలో కనిపించిన ఈ యువతీ యువకులు ఎదిగి, వ్యక్తిగతంగానూ, సామాజిక, రాజకీయంగానూ అనేక ఒడుదుడుకులను ఎదుర్కొని జీవిత పరిపూర్ణతను అర్థం చేసుకుంటారు.

చారిత్రక ఘటనల నేపథ్యంలో సాగుతాయి పాత్రల జీవితాలు. 'ఇదీ కథ' అంటూ ఇదమిద్ధంగా చెప్పటం అసాధ్యం. వ్యక్తికీ, సమాజానికీ ఉన్న సంబంధమేమిటి? మనిషి తన జీవిత పథాన్ని, గమ్యాన్ని నిర్దేశించుకోవటం సాధ్యమా? లేదా అనుకోని పరిస్థితులు సుడిగుండంలో చిక్కుకున్న కాగితం పడవలేనా జీవితాలన్నీ? - ఇలాంటి అనేక తాత్వికాంశాల కలనేతగా కనిపిస్తుంది ఇతివృత్తం.

ఇందులో ప్రధాన పాత్రలనేకం. అందువల్ల ఏ ఒక్కర్నో హీరో అనుకోలేం. అంత

## టాల్‌స్టాయ్ (1828-1910)

మూడు నాలుగు పేజీల్లో టాల్‌స్టాయ్ గురించి చెప్పుకోవటమంటే సముద్రాన్ని దోసిలిలో పట్టినట్టే. తను రాసిన నవలల్లాగే ఆయనది సుదీర్ఘమైన జీవితం. అనూహ్యమైన మలుపులు తిరిగింది. సంపన్నుడు సన్యాసిగా మరణించాడు. పద్దెనిమిదవ శతాబ్దిలో టాల్‌స్టాయ్ ముత్తాతను పీటర్ ది గ్రేట్ 'కౌంట్' బిరుదుతో సత్కరించాడు. ఆ విధంగా టాల్‌స్టాయ్ వంశీకులకు జార్ చక్రవర్తి దర్బారుతో సన్నిహిత సంబంధాలేర్పడ్డాయి. లెవ్ నికొలాయెవిచ్ టాల్‌స్టాయ్ తులా (రష్యా)లో జన్మించాడు. తండ్రి పదిహేను వేల ఎకరాల భూస్వామి.

బాల్యంలోనే తల్లిదండ్రులు మరణించినప్పటికీ టాల్‌స్టాయ్‌కి సుఖ విలాసాలకేమీ లోటు రాలేదు. ప్రైవేటు ట్యూటర్ల వద్ద విద్యాభ్యాసం జరిగింది. తరువాత కజాన్, పీటర్స్‌బర్గ్ విశ్వవిద్యాలయాల్లో చదివినా అతడికి చదువు మీద శ్రద్ధ లేదు. అందుకే ఎక్కడా డిగ్రీ రాలేదు. యవ్వన ప్రావిర్భావంతో హై సొసైటీలో ప్రవేశించాడు. పెద్ద అందగాడేమీ కాదు. కాని ఫ్యాషనబుల్ దుస్తుల మీద మోజు. (టాల్‌స్టాయ్ తనకు తాను ఆత్మ నింద చేసుకున్నప్పటికీ అతడి మొహంలో ఒక ఆధ్యాత్మిక తేజం ప్రకాశించేదంటారు సమకాలికులు). మనిషి కోపిష్టి. అకారణంగా అందరితో పోట్లాటలకు దిగేవాడు. ధనవంతులకు కాలక్షేపమంటే తాగుడు, జూదం, స్త్రీ లాలసత. ఎప్పటికప్పుడు జేబులు ఖాళీ అయ్యేవి. అయితేనేం డబ్బులక్కొదవలేదు.

ఇరవై మూడో ఏట అన్న ప్రోత్సాహంతో సైన్యంలో చేరాడు. దృఢ శరీరం, రోజంతా నడవగలిగినంత శక్తి ఉండేదట. తొలిరోజుల్లో, తోటి సైనికాధికారులతో వ్యసనాలు కొనసాగించాడు. జూదంలో చేసిన అప్పు తీర్చటానికి ఒకసారి తన ఎస్టేట్ 'యాస్నాయా పొల్యానా'లోని ఒక ఇంటిని అమ్మేశాడు. విశృంఖల శృంగార జీవితం అతడికి సిఫిలిస్‌ను కానుకగా ఇచ్చింది.

"ఈ విలాసాలు నా వ్యక్తిగత బలహీనత కాదు. మా వంటి ధనికుల కిదొక స్టేటస్ సింబల్ కూడా" అని రాసుకున్నాడు డైరీలో. మానుకోలేని అలవాట్లతో పశ్చాత్తాపం, ఆత్మ విమర్శ కూడా పెరిగింది. 1854లో క్రిమియన్ యుద్ధం జరిగింది. సైన్యంలో లెఫ్టినెంట్ పదవికి ప్రమోషన్ వచ్చింది. కాని ఆ

ప్రాముఖ్యత ఉన్న వాళ్ళు కనీసం అరడజను మందుంటారు. ధీరోదాత్తుడు డోలోకోవ్. విలాస పురుషుడు ఆనటోల్ కురాగిన్, స్వప్రయోజనం తప్ప మరో నైతికత ఎరుగని ప్రిన్స్ బోలాన్స్కీ జీవిత విషాదాన్ని అక్కున చేర్చుకోగల అతడి కుమారుడు ఆండ్రె- బొరోడినో యుద్ధంలో సాహసోపేతంగా పోరాడి మరణిస్తాడు. నిరంతర ప్రతిద్వంద్వులు నికొలాయ్ రోస్తోవ్, పియెర్ బజుకావ్. నికొలాయ్ సుఖ లాలసుడు. సంపన్నురాలు ప్రిన్సెస్ మాల్యాను వివాహమాడి తన ఎస్టేట్‌లో సుఖంగా గడుపుతాడు. పియెర్- ప్రిన్స్ బజుకోవ్ కామ్ కుమారుడు- అంతర్ముఖుడు. గొప్ప సంపదకు వారసుడు. అయినా పేదవాళ్ళతో చెట్టా పట్టాలేసుకుని తిరుగుతాడు. చివరకు ప్రేమించిన నటాషా రోస్తోవ్‌ను చేసుకుని డబ్బుకన్నా ఆత్మ గౌరవం మిన్న అని తెలుసుకుంటాడు.

నెపోలియన్ లాంటి యుద్ధ పిపాసులెందరో! రాజ్యాలు, ఉద్యమాలు ఏవీ శాశ్వతం కాదు. ప్రతి మనిషి గుండెలో వెలిగే చిరు దివ్వెలాంటి ప్రేమ మాత్రమే ఈ లోకం మనుగడకు ఆధారం. ఎవరెన్ని గొప్ప పనులు చేయనీ, చివరికి ఇంటికి వచ్చి భార్యా బిడ్డలతో సేద తీరటంలోనే నిజమైన ఆనందముంది" అన్న సందేశం అంతర్లీనంగా ఉంటుంది.

జీవితం మొహం మొత్తింది. రిటైర్మెంట్ తీసుకుని యూరోపులో పర్యటించాడు. అప్పటి దాకా రాసిన స్కెచెస్, కోసక్కులు అనే కథా సంకలనం ప్రచురించాడు. రచయితగా గుర్తింపు వచ్చింది. కోపం ఎక్కువ కావడంతో ఒక విమర్శకుడు పుస్తకం నచ్చలేదంటే డ్యూయెల్ (కత్తియుద్ధం)కు రమ్మని ఛాలెంజి చేస్తూ ఉత్తరం రాశాడు.

ఉద్యోగ విరమణ తర్వాత, యాస్నాయా పొల్యానాకు తిరిగి వచ్చాడు. 34 ఏళ్లు వచ్చాయి. విచ్చలవిడితనం విసుగు తెప్పించింది. పెళ్లి చేసుకుని స్థిరపడాలని కోరిక కలిగింది. అనేకమంది యువతుల్ని చూసి, చివరికి డాక్టర్ బెర్స్ అనే ప్రముఖ వైద్యుడి కుమార్తె పద్దెనిమిదేళ్ల సోన్యాని ఇష్టపడ్డాడు. ఆమె పొదుపరి. సంసారం చాలా కాలం సుఖంగానే గడిచింది. మొత్తం పదముగ్గురు పిల్లల్ని కన్నారు. ఎస్టేట్ మరో వెయ్యెకరాలు పెరిగింది.

మనకెంత వింతగా కనిపించినా ఆనాటి బడా భూస్వాములందరి జీవిత సరళి ఇలాగే ఉండేది. కాని "యుద్ధము - శాంతి", "అన్నా కరెనినా" లాంటి మహోత్కృష్టమైన నవలలు రాయగలిగింది మాత్రం టాల్‌స్టాయ్ ఒక్కడే.

అనేక కుటుంబాలలో, అనేక ప్రదేశాలలో ఏక కాలంలో జరిగిన వివిధ సంఘటనలను, పరిణామాలను కథగా మలిచాడు గనక మొదట రెండు పాత్రలతో ప్రారంభిద్దాం. కౌంట్ రాస్టోవ్ చిన్న కూతురు నటాషా. ఎప్పుడూ నవ్వుతూ, తుళ్ళుతూ, అల్లరి చేస్తూ అందరి మనసులు దోచే అందమైన పిల్ల. పియెర్, ప్రిన్స్ ఆండ్రూ ఇద్దరూ ఆమెను ప్రేమిస్తారు. (చిన్న పిల్లలు చూడడానికి ముద్దొస్తారు. కాని వాళ్లను కథల్లో ఆసక్తికరమైన పాత్రలు చెయ్యటం అసాధ్యం. 'వానిటీ ఫెయిర్', మేన్స్ ఫీల్డ్ పార్క్,'ది ఈగోయిస్ట్', 'డేవిడ్ కాపర్ ఫీల్డ్'లలోనూ ఈ వయసు పిల్లలున్నారు. కాని వాళ్లతో పోల్చితే 'నటాషా' అద్భుత సృష్టి!" అంటూ టాల్‌స్టాయ్ ప్రతిభకు జోహార్లర్పిస్తాడు సామర్ సెట్ మాం.

ఈ పాత్రకు ప్రేరణ రచయిత మరదలు టాన్యా బెర్స్. ప్రిన్స్ ఆండ్రూ పెద్ద భూస్వామి. అందగాడు. వందలాది మంది సెర్ఫ్‌లకు యజమాని. లౌక్యం తెలిసినవాడు.

పియెర్ కురూపి. దృష్టి మాంద్యం ఉంది. సోడాబుడ్డి కళ్లద్దాలు పెట్టుకుంటాడు. తాగుడు బలహీనత బాగా ఉంది. తిండిపోతు. స్త్రీలాలసుడు. పెద్దగా తెలివి తేటలు లేవు. కాని స్వభావ రీత్యా మంచివాడు. ఇతడూ సంపన్నుడే. కాని మిత్ర బృందం అతడి మంచితనాన్ని అలుసుగా తీసుకుంటారు. జూదంలో అందరూ అతణ్ణి మోసం చేస్తారు. వివాహితుడే. కాని భార్యకు మరొకరితో సంబంధముంటుంది. ఒకసారి చర్చలో "దేవుడు లేడు" అంటాడు. "లేని వాడి గురించి ఎలా మాట్లాడగలం?" అని ప్రశ్నిస్తాడు విశ్వాసి. ఆ తర్వాత దేవుడి గురించి సుదీర్ఘమైన చర్చ కొనసాగుతుంది. చివరికి పియెర్ కూడా దేవుణ్ణి విశ్వసిస్తాడు. (ఇదంతా టాల్‌స్టాయ్ జీవితంలో జరిగిన పరిణామమే) సైన్యంలో చేరాడు. కాని తన గుర్రబ్బండిలో బొరొడినో యుద్ధ రంగంలో ప్రవేశిస్తాడు. చివరికి భయపడి పరుగెత్తి పోతాడు. ఫ్రెంచి సైనికుల రాకతో మాస్కో నగరమంతా ఖాళీ అవుతుంది. కాని తనొక్కడు మాత్రం కదలడు. శత్రువుల చేతికి చిక్కుతాడు. మరణ శిక్ష విధిస్తారు. చివరి క్షణంలో శిక్ష తగ్గించి జైల్లో వేస్తారు. పరాజితులైన ఫ్రెంచి సైనికులు మాస్కో వదిలి వెళ్ళిన తర్వాత గెరిల్లాలు అతణ్ణి రక్షిస్తారు.

స్థిరమైన వ్యక్తిత్వం లేని ఇలాంటి మనుషుల్ని గురించి వాస్తవికంగా రాయటం ఎంత కష్ట సాధ్యమో రచయితలందరికీ తెలుసు.

(ఇంకా ఉంది)

- ఎం. వసంత

అందం చందం లేదు, కట్నం తేలేదన్న కోపంతో అత్త, ఆడబిడ్డ సాధింపులకు గాయపడిన ఆమె మనసు కుంచించుకుపోయింది. సంసారమనే గూటిలో కూరుకుపోయి భర్త, పిల్లల ఆలనా పాలనా తప్ప మరో లోకమెరుగకుండా గిరి గీసుకుని గడిపేసింది. ఎదిగిన పిల్లలు ఉద్యోగస్తులై తమంతట తాము నిర్ణయాలు తీసుకుంటుంటే కుటుంబం చుట్టూ తను కట్టుకున్న కోట బీటలు వారి పోతోందని తల్లడిల్లింది. భర్త కూడా బిడ్డల నిర్ణయాల్ని సమర్థించడంతో తనకు విలువ లేకుండా పోతోందని కుమిలిపోయింది. తన సంప్రదాయకతను బద్దలు చేస్తూ కుటుంబంలో చోటు చేసుకుంటున్న ప్రతి విప్లవానికీ అనివార్యంగా తలొగ్గింది. అలాంటి ఆమెలో చివరికెలాంటి మార్పొచ్చింది? ఎలాంటి అవగాహనతో తన దృక్కోణాన్ని ఎలా విస్తరించుకుంది?... కాలం... ఆధునికత కుటుంబంలో కొత్తగా కల్పించే అవసరాల్ని, తెచ్చే విప్లవాల్ని, మార్పుల్ని ఆద్యంతం ఆసక్తికరంగా చిత్రించిన వి.యస్. రమాదేవి నవల 'సంసార సాగరాలు' ఈ నెల 'చతుర'లో.



వి.ఎస్. రమాదేవి

గోపాలకృష్ణ మాదాపూర్ చివర్లలో కారు నింపాదిగా పోనిస్తూ భవనాల పేర్లను చూస్తున్నాడు. 'ఇదే... మిత్ర, మైత్రా సాఫ్ట్‌వేర్ కంపెనీ' అని ఆ పేరు చదివి తెల్లటి పెద్ద భవనం ముందు కారాపాడు.

వాచ్‌మన్ లేచి నుంచుని తేరిపార చూశాడు. సెల్యూట్ కొట్టకుండా "ఎవర్ని కల వాలి ఎపాయింట్‌మెంట్ వుందా?" అని అడిగాడు.

కారులో వచ్చిన తనలాంటి వ్యక్తికి కూడా సెల్యూట్ చేయాలనే సభ్యత చూపని వాచ్‌మెన్ తీరుకు గోపాలకృష్ణ ఒకింత ఆశ్చర్య పోయాడు. అయినా పట్టించుకోనట్లు "ఉంది... పదకొండు గంటలకు టైమిచ్చారు మీ అయ్యగారు" అన్నాడు.

కారు బయటే పార్కు చేసి భవనం ఆవర ణలోకి అడుగు పెట్టాడు.

పక్కపక్కనే రెండు బిల్డింగులు ఒకే మాది రిగా వున్నాయి. ఏది ఆఫీసో, ఏది ఇల్లో అర్థం కాక కాసేపు తటపటాయించి ఏదయితే అదయిందని మొదటి బిల్డింగ్ దగ్గర ఆగాడు. గుమ్మం లోపల ఒకతను నిలబడి వున్నాడు. ప్యూన్ అయుంటాడు అనుకుని, తలుపు తెరి చేవున్నా కాల్‌బెల్ నొక్కాడు. తన ఊహ నిజమే. గుమ్మంలోకి వచ్చి "గోపాలకృష్ణగారు మీరేనా?" అని అడిగాడతను. అవునన్నట్టుగా తలూపాడు గోపాలకృష్ణ.

"మీ కోసం అయ్యగారు పావుగంట నుంచీ ఎదురుచూస్తున్నారు" అనగానే అతను చేతి వాచీ చూసుకున్నాడు. పదకొండుంబావు అయింది. ఇంతలో ఒకాయన- చామన ఛాయగా ఆరడుగుల ఎత్తులో చూడగానే ఆక ట్టుకొనే విగ్రహంతో ఉన్న వ్యక్తి - బయటకొ చ్చాడు.

"మీరు గోపాలకృష్ణగారే అయివుంటారు. నేను అర్జంటుగా ఒక మీటింగుకు వెళ్లాలి. బహుశా ట్రాఫిక్ జామ్‌లో చిక్కుకొని వుంటారు. అందుకే లేటయి వుంటుంది" అన్నాడాయన.

తను చెబుదామనుకుంటున్న కారణం ఆయనే చెప్పేశాడు... నిజానికి తనకి మాదా పూర్ కాస్త కొత్త. నెమ్మది నెమ్మదిగా ఆఫీసు వెతుక్కుంటూ రావడంతో ఆలస్యమయింది. తను ఒక అరగంట ముందు బయలుదేరితే సరిపోయేది. అయినా మరీ ఆయనంత ఠంచ నుగా పదకొండు గంటలకే తనని పిలుస్తాడ నుకోలేదు. తను ఎవర్నికైనా టైమిస్తే ఒక అర గంట అటూ ఇటూగా కలుస్తాడు ఆ వచ్చిన వాళ్ళని అనుకుంటూ తలదించుకు నిలబడి పోయాడు అపరాధిలా అతను.

అది గమనించినట్టుగా "బాధపడకండి... నాకే మీటింగ్ లేకపోతే మీరు అరగంట ఆల స్యంగా వచ్చినా నాకిబ్బంది వుండేది కాదు... చూడు రామూ! అయ్యగారిని మనమ్మగారి దగ్గరకు తీసుకువెళ్ళు..." అని పురమాయించి వెళ్లిపోయాడాయన.

'ఎంత సంస్కారవంతుడు' అనుకుంటూ రాము వెంట నడిచాడు. ఇరవై అడుగులు వేశాడో లేదో "అమ్మగారి ఆఫీసు ఇదే" అంటూ తలుపు తట్టాడు రాము.

లోపలి నుంచి 'కమిన్' అన్న పిలుపు విని నెమ్మదిగా అతను లోపలకు అడుగుపెట్టాడు. ఒక్క క్షణం నిలబడిపోయాడు ఆవిడ్ని చూస్తూ, "మీరు... మీరు" అంటూ.

"కూర్చోండి. మీరు గోపాలకృష్ణగారు. సిమెంట్ కంపెనీలో మేనేజర్‌గా ఉన్నారు" అంది ఆవిడ.

మీకెలా తెలుసు అన్నట్టు చూశాడు గోపా లకృష్ణ.

"ఆయన చెప్పారు. మీరు నిన్న ఫోను చేసి ఆయనతో మాట్లాడారు కదా. ఒకవేళ మీరు వచ్చేలోగా ఆయన మీటింగుకు వెళ్లిపోవలసి వస్తే మీతో నన్ను మాట్లాడమన్నారు" అందా విడ చిన్నగా నవ్వుతూ.

గోపాలకృష్ణ తెల్లబోవడం తప్పితే వచ్చిన ప్పటి నుంచీ నోరు తెరవవలసిన పని లేకపో యింది.

అతనింకా తనని తెల్లబోయి చూడడం

గమనించి, "మీరే పని మీద వచ్చారు?" అందావిడ.

అప్పటికొక గుటక మింగి, తేరుకొని "ఎమ్.కామ్ కంప్యూటర్స్ చేసిన వ్యక్తి కావాలని మీరీ మధ్య ఒక ప్రకటన ఇచ్చారు..." అని ఆగాడతను.

"అవును. అయితే? మాకు ముప్ఫయ్ ఏళ్ల

"ఆ విషయాలు అప్లికేషన్‌లో తెలియజేశారా?"

"అవును. మీరు తనని అసలు ఇంటర్వ్యూకే పిలవరేమోనని భయం"

"ఎవరికి భయం. మీకా, మీ అబ్బాయికా?"

"మా ఆవిడకు" అనుకోకుండా అతని నోటి నుండి అయాచితంగా నిజం బయటపడింది.

## పరిచయం

వి.యస్. రమాదేవి అనేక విశిష్టతలున్న రచయిత్రి. ఎం.ఎ., ఎల్.ఎల్.ఎం చేశారు. ఆంధ్రప్రదేశ్ హైకోర్టులో లాయర్‌గా చేశారు. గ్రూప్-ఎ అధికారిగా కేంద్ర ప్రభుత్వ ఉద్యోగంలో చేరారు. అంచలంచెలుగా ఎదుగుతూ న్యాయశాఖలో ఎన్నో ఉన్నత పదవులనలంకరించారు. కొద్ది కాలంపాటు ప్రధాన ఎన్నికల కమిషనర్‌గా పనిచేశారు. అనేక జాతీయ, అంతర్జాతీయ సంస్థలలో సభ్యురాలిగా, జాతీయ మహిళా సంఘానికి సలహాదారుగా, రాజ్యసభ సెక్రటరీ జనరల్‌గా, హిమాచల్‌ప్రదేశ్, కర్ణాటక రాష్ట్రాల గవర్నర్‌గా పనిచేశారు. వివిధ సంస్థలు, విశ్వవిద్యాలయాలు, ప్రభుత్వం నుంచి రమాదేవి అందుకున్న సత్కారాలు, పొందిన పురస్కారాలు ఎన్నో. కేంద్ర ప్రభుత్వ సర్వీసులో అత్యున్నత పదవిని అధిష్టించిన తొలి ఆంధ్ర మహిళ ఆమె.

'రాజ్యసభ ఎట్ వర్క్', 'హౌ ఇండియా వోట్స్', 'ఎలక్షన్ లాస్', 'ప్రాక్టీస్ అండ్ ప్రొసీజర్' గ్రంథాలకు సహరచయిత. తెలుగులో 13 నవలలు ప్రచురించారు. అనేక కథలు రాశారు. ఆంధ్రభూమి దిన పత్రికలో ఒక కాలమ్ రాస్తున్నారు. పుస్తక పఠనం, ప్రకృతి ఆరాధన ఆమె ఇష్టమైన వ్యాపకాలు.

చిరునామా:
**వి. యస్. రమాదేవి,**
219/ఎ/ఎ, ఎం.ఎల్.ఎ. కాలనీ,
రోడ్‌నంబర్ 12, బంజారాహిల్స్,
హైదరాబాద్ - 500 034.

లోపు వ్యక్తే కావాలి" అందావిడ, చెంపల దగ్గర నెరిసిన అతని జుట్టును చూస్తూ.

ఆవిడ నవ్వాపుకుంటున్నట్టు పసిగట్టాడ తను.

"నా కోసం కాదండీ. మా అబ్బాయి కోసం"

"మేం త్వరలోనే ఇంటర్వ్యూ తేదీ తెలియజేస్తాం. అప్పుడు మీ అబ్బాయిని పంపండి"

"అట్లాగే. నేనొక వివరణ ఇవ్వాలి. మీరు అభ్యర్థులు ఎమ్.కామ్ కాని, కనీసం బి.కామ్ ఫస్ట్ క్లాస్ కానీ అయి ఉండాలని ప్రకటనలో పేర్కొన్నారు"

"అవును. మాకో తెలివైన వ్యక్తి కావాలి"

"నిజమేననుకోండి. మా అబ్బాయి బి.కామ్, ఎమ్.కామ్ కూడా కొద్ది మార్కులతోనే ఫస్టు క్లాస్ మిస్ అయ్యాడు"

ఆవిడ వస్తున్న నవ్వును ఆపుకుంటూ "అయితే మీ యింటిలో అన్ని నిర్ణయాలు మీ ఆవిడ తీసుకుంటారన్నమాట. ఆవిడేం చేస్తూ వుంటారు?"

"ఆవిడ ఉత్త గృహిణి మాత్రమే. మీలాగా బాగా చదువుకున్నది కాదు"

"పెద్ద చదువులకీ, ఇంటిలో నిర్ణయాలు తీసుకోవడానికి అంత పెద్ద సంబంధం వుండక్కర్లేదేమో"

"ఏమయినా ఆవిడ నేను ఇంటి విషయంలో సమయానికి తగిన నిర్ణయాలు తీసుకోనని, నా ఆఫీసు పని గొడవల్లోనే పడివుంటానని అనుకుంటుంది"

"అది నిజమేనేమో"

"కొంతవరకు. ఇతరులు ఏదయినా

సాయం చేయమంటే వాళ్ళకీ వాళ్ళకీ సిఫార్సులు చేసి సాయం చేస్తానట. మా పిల్లల దగ్గరకు వచ్చేటప్పటికి మాత్రం పట్టనట్టు ఊరుకుంటానట"

"అదీ నిజమేనేమో! లేకపోతే ఆవిడలా నెపం ఎందుకు వేస్తారు? "

"మీరూ ఆవిణ్ణే సమర్థిస్తున్నారు. మా అబ్బాయి ఇంటర్వ్యూ విషయంలో ఇలా ఆఫీసుకు సెలవు పెట్టి మీ దగ్గరకు రావడానికి నాకెంత చిన్నతనంగా వుందో మీరు ఊహించగలరా? "





"ఊహిం చనక్కర్లేదు. మిమ్మల్ని చూస్తోంటే మీ ఇబ్బంది, మీ మొహమాటం తెలిసిపోతూనే ఉంది. అయినా నేను కూడా ఆఫీసులో లేకపోతే 'నేను వెళ్ళాను. ఇద్దరూ లేరు ఆఫీసులో' అని హాయిగా తప్పించుకునేవారు. అవునా కాదా? "

ఆ మాటలకి గోపాలకృష్ణ తలెత్తి ఆవిడ ముఖంలోకి తేరిపార చూసి,

"ఎలా ఊహించారు మీరు. సరిగ్గా అలాగే అని వుండేవాణ్ణి" అన్నాడు.

"మరోసారి కలుసుకుందాం. ఇవాళ అర్జెంటు పనిమీద వెళ్ళిపోతున్నానని మిమ్మల్ని మా వారు అలాగే పంపించేస్తే సంతోషించేవారు కదూ!"

ఆవిడ మాటలకు గోపాలకృష్ణకు ఆశ్చర్యమేసి "ఇలా నా ఊహల్ని చదవగలుగుతున్నారు మీరు. మీకేమయినా ముఖం చూసి మనిషెలాంటివాడో తెలుసుకోగల పరిజ్ఞానం వుందా? " అన్నాడు.

"అందరి విషయంలో ఏమోగాని, మీ విషయంలో కాస్త పసిగట్టగలను" అందావిడ, అప్పటికైనా అతను తనను గుర్తిస్తాడేమోనని చూస్తూ.

"మిమ్మల్నెక్కడో చూశాను. మీరు కొంపదీసి వేద... వేదవల్లిగారు కాదు కదా"




"గోపాలకృష్ణ గారూ, నేనెవరి కొంపా తీయలేదు. ముఖ్యంగా మీ కొంప అసలు తీయలేదు. అసలలాంటి సందర్భమే వస్తే మీకు సాయంగా నేనుండి మీ కొంప నిలబెడతాను" అంది భరోసా ఇస్తున్నట్టుగా బింకంగా ముఖం పెట్టి.

"ఇంతకూ చెప్పనేలేదు. మీరు వేదవల్లే కదూ!" అన్నాడు విడవకుండా.

"అవును గోపాల్ నేను వేదనే. ముప్ఫయ్యేళ్ళ తర్వాత కలుసుకుంటే గుర్తుపట్టడం కష్టమే"

"మరి మీరు నన్ను ఎలా గుర్తుపట్టారు? "

"మీ పేరులో మార్పు లేదుకదా! మీలోనూ అంత మార్పులేదు. చెంపలు కొంచెం నెరిశాయంతే"

"నాకెంతో ఆనందంగా వుంది! ఇవాళ మిమ్మల్ని కలుసుకోవడం. మా ఆవిడకు, మీ ఆయనకు ధన్యవాదాలర్పించాలి, నాకీ అవకాశం కల్పించినందుకు"

"ఏమని ధన్యవాదాలు చెబుతారు. ఒకప్పటి నా కాలేజీమేట్ ని కలుసుకోగలిగాననా? "

"అలా అనే చెప్పాలి మరి" అని లేచాడు వెళ్ళడానికి.

"కాసేపు కూర్చోండి గోపాల్ గారూ! ఆ రోజుల్లో మిమ్మల్ని 'గోపాల్' అని పిలిచే వాళ్ళం కదా! మాకు మర్యాద అసలు తెలియదనా మీ ఉద్దేశ్యం? కాఫీ వస్తోంది"

"నాకు కాఫీ ఇష్టమని ఇంకా గుర్తుందా? మీ ఇంట్లో కాఫీ బాగా చేసేవారు. ఎప్పుడొచ్చినా కాఫీ తాగందే వెళ్ళనిచ్చేవారు కాదు"

"మామూలుగా ఎవరైనా వస్తే ఫ్రిజ్ లో వున్న కూల్ డ్రింక్ ఇస్తారు. మీకు కాఫీ ఇష్టమని, అది తెమ్మని చెప్పాను రాముతో. మీరేమో ఏమిటో కంగారు కంగారుగా బిత్తర చూపులతో నిలబడిపోయారాయె"

"నిజమే వేదా. సారీ మిమ్మల్నిలా సంబోధించకూడదు. మీ స్థాయి ముందు నేనెంత? "

"అది సరే గోపాల్. మనిద్దరం ఒకప్పుడు ఒకే కాలేజీలో చదివాం. స్నేహంగా వుండేవాళ్ళం. నోటు పుస్తకాలు ఇచ్చిపుచ్చుకునే వాళ్ళం. ఆ రోజుల్లో నువ్వు 'వేదా' అంటే నేను 'గోపాల్' అనేదానిని. క్లాసులో అందరం మీరు మీరు అనుకునేవాళ్ళం కాదు. ఏ స్థాయి విద్యార్థినయినా నువ్వు అనీ, పేరు పెట్టి పిలిచేవాళ్ళం కదా"

"నిజమే. ఆ రోజుల్లో కూడా మీ స్థాయి చాలా పెద్దది. కలెక్టర్ గారి చెల్లెలివి. నేను స్కూలు మాస్టరు కొడుకుని. మీరన్నట్టు మిమ్మల్ని 'వేదా' అని పిలిచేవాణ్ణి. స్థాయి గొడవ లేకుండా. కానీ ముప్ఫయ్యేళ్ళ తర్వాత ఆకాశమంతగా ఎదిగిపోయిన మిమ్మల్ని వేదా అని

పిలవలేను, 'నిన్ను' అనలేను"

"మనం ఏకవచనంలోనే సంభోదించుకోవచ్చు. అయినా నువ్వు స్కూల్ మాస్టరు కొడుకుగానే ఉండిపోలేదుగా! ఏదో కంపెనీలో మేనేజర్‌వయ్యావు. నీకూ ఒక హోదా అంటూ ఉంది. అలా ఎందుకు నిన్ను నీవు కించపరచుకుంటావ్"

"లేదు వేదా! నీ ముందు అలా అనిపిస్తుంది. మిగతా ఎవరి ముందూ అలా అనిపించదు. వాళ్ళందరికంటే చాలా విషయాలలో నేను ఎక్కువే అనిపిస్తుంది"

"అదే నీతో వచ్చిన చిక్కు. తక్కువగానన్నా ఊహించుకుంటావ్ లేదా ఎక్కువగానన్నా ఊహించుకుంటావ్. ఈ హెచ్చు తగ్గుల పరిధి నుంచి బయటపడలేవా? "

"ఒక్కసారిగా ఎలా బయటపడగలను? పుట్టిన ఇంటి వాతావరణాన్నుంచి ఒక్కసారిగా విడుదల కాలేం"

"ముప్పయ్యేళ్ళ క్రితం కూడా నువ్విలాగే మాట్లాడేవాడివి, 'నువ్వు కలెక్టర్ చెల్లివి. నేను స్కూలు మాష్టారి కొడుకుని' అంటూ, మా అన్నయ్యని చూస్తే చాలు చివాలున లేచి నుంచునేవాడివి. అన్నయ్య నవ్వుతూ మందలించేవాడు నిన్ను- 'నువ్వు మా యింట్లో ఒక వ్యక్తివే' అంటూ"

"అది ఆయన గొప్పతనం. నేను మీ ఊరి కరణంగారి మనవడినని అలా ఆపేక్ష చూపేవారు. మీ తాతగారు కూడా మా తాతగారిని ఎంతో ఆదరంగా చూసేవారట. ఆ ఇంటిలో పుట్టి, ఆ వాతావరణంలో పెరిగిన మీకు హెచ్చు తగ్గులు ఆలోచనలోకి కూడా రావు? "

"కొంతవరకూ నువ్వు చెప్పింది నిజమే కాని, మన ప్రవర్తనని మనం కూడా కొంతవరకు మలుచుకోవాలి. కనీసం ప్రయత్నమన్నా చేయాలి"

"వేదా, నిజంగా నాకివాళెంతో ఆనందంగా ఉంది. ముప్ఫయ్యేళ్ళ క్రితానికి వెళ్ళిపోయినట్టుంది. భార్యామణి కొడుకు ఇంటర్వ్యూ విషయం ఏమైందోనని ఎదురుచూస్తూ వుంటుంది. నేను మీ ఆఫీసుకు వచ్చానని చెబితే కూడా నమ్ముతుందో లేదో. నేనుత్త చవటనని ఆవిడ అభిప్రాయం" అన్నాడతను నవ్వుతూ.

"నా కొడుకుని ఇంటర్వ్యూకి పిలవండి అని అడగటం కొంచెం కష్టమే, ముఖ్యంగా నీ లాంటి మొహమాటస్థులకు. ఆవిడతో చెప్పు మీ అబ్బాయిని ఇంటర్వ్యూకి పిలుస్తామని. అయితే ఇంటర్వ్యూలో బాగా సమాధానాలు చెప్పాలి. నీలాగా ఉంటే చూడగానే ఆకట్టుకుంటాడు. మరి తెలివితేటల సంగతి కొస్తే మీ ఆవిడ కొంచెం తెలివైనదానిలాగానే అనిపిస్తోంది. ఆవిడ తెలివి వస్తే ఇంటర్వ్యూలో బాగానే చేస్తాడనుకుంటున్నాను"

"పొరపాటు పడుతున్నారు. ఆవిడ అందం, నా తెలివి వచ్చాయి. అందుకే సెకండ్ క్లాస్ తోనే గట్టెక్కాడు"

"చూస్తాగా. ఇంటర్వ్యూకి వచ్చినప్పుడు" అని వేదవల్లి గది గుమ్మం వరకు వచ్చి సాగనంపింది గోపాలకృష్ణని.

* * *

కారులో కూర్చున్న గోపాలకృష్ణకి తన బుల్లి కారుకి, కాంపౌండులో వున్న క్రైమె కారుకి ఎంత వ్యత్యాసముందో తన స్థాయికి, వేద స్థాయికి అంత అంతరం ఉందనిపించింది. తనలో పెద్దగా వయసు తెచ్చిన మార్పు లేదంది వేద. తనకి మాత్రం ఆవిడలో చాలా మార్పు కనపడింది. కాస్త ఒళ్లు చేసినట్టుంది. అంతేకాదు ఏదో తమాషాగా ఉంది. ఎంతో ధైర్యంగా ఎలాంటి నదురు బెదురూ లేకుండా మాట్లాడింది. తామిద్దరూ అలా కూర్చుని కాలేజీ సంగతులు మాట్లాడుకుంటుంటే భర్త మీటింగు నుంచి వచ్చి చూసి ఏమనుకుంటాడో అన్న బెదురు కూడా లేదు. ఎంత హాయిగా మాట్లాడింది! అలా అరమరికలు లేకుండా కూర్చుని మాట్లాడుతుంటే తనకి జైలునుంచి బయటపడినట్లుగా హాయిగా అనిపించింది. ఎన్నో ఏళ్ళ తర్వాత తనకు స్వేచ్ఛ లభించినట్లుగా అనిపించింది. అయితే దేని





నుంచి స్వేచ్ఛ లభించినట్టు? తన పిరికితనం నుంచా? లేక ఇల్లు, భార్య, వాతావరణం నుంచా? లేక సిమెంట్ కంపెనీ మేనేజర్‌గిరి నుంచా? అది ఏదైనా... దేనినుంచో తనకు కాస్త విముక్తి కలిగినట్టనిపించింది...

ఇలా ఆలోచనల్లో ఉక్కిరి బిక్కిరవుతూ ఇరవై కిలోమీటర్ల దూరంలో ఉన్న తన అగ్గిపెట్టె లాంటి ఇంటికి చేరుకున్నాడు గోపాలకృష్ణ.

కాల్ బెల్ కొట్టీ కొట్టకముందే తలుపు తీసి "ఏమయిందండీ. పండా, కాయా" అంది భార్య కాత్యాయని ఆతృతతో.

"ఏమీ చెప్పలేం అప్పుడే. నేనయితే నువ్వు వేడుకోమన్నట్లు అహం చంపుకుని వేడుకుని



వచ్చాను. ఆ తర్వాత వారి దయ" అన్నాడు బూట్లు విప్పుకుంటూ.

"ఈ కోపం అంతా నేను కాస్త మన అబ్బాయి విషయం కనుక్కోమన్నాననే కదా! ఈ సంసారం నా ఒక్కదానిదేనా? వాడు దిగులుగా ఇంట్లో కూర్చుంటే కడుపు తరుక్కుపోతోంది. వాడు కూడా ఉద్యోగంలో చేరితే వేడినీళ్లకు చన్నీళ్ళు లాగా మిగతా ఇద్దరి పిల్లల చదువులకైనా డబ్బు సరిపడుతుందని నా ఆశ"

"నా సంపాదన సరిపోవడం లేదా? "

"ఆ... ఆ. బాగానే సరిపోతోంది. పనిమనిషిని కూడా పెట్టుకోకుండా కుడితిలోపడ్డ ఎలుకలాగ ఇంటి చాకిరీ తప్పితే మరో ప్రపంచాన్ని చూడకుండా సర్దుకుంటూ పోతుంటే మీకెవ్వరికీ ఏమీ తెలియడంలేదు. నేను పోతే అప్పుడు తెలిసొస్తుంది మీకు"

"అంతలేసి మాటలెందుకే కాత్యాయనీ, ఇప్పుడు నేనేమన్నాను? పనిమనిషిని పెట్టుకోమని ఎంత చెప్పినా పెట్టుకోవు. 'ఇంత పెద్ద ఇంటికి పనిమనిషి కూడా ఎందుకు దండగ. ఈ రెండున్నర గదులూ నేను ఊడ్చుకోలేనా అంటావ్. నీకసలు కష్టపడందే తోచదే కాత్యాయనీ"

"మీరు మాత్రం కష్టపడటంలా. ప్రొద్దుటిపూట పోతే రాత్రికొస్తారు. అదేమి కంపెనీ ఉద్యోగమో కాని సరైన తిండా పాడా నాకదే దిగులు"

"లేనిపోని దిగులు దేనికి? నేనమయినా పాపాయినా. ఆకలేస్తే చుట్టుపక్కల చిన్నా, పెద్దా బోలెడు హోటళ్ళున్నాయి. ఏదో ఒకటి తెప్పించుకు తింటున్నానుగా. ఊరికే హైరాన పడకు"

"మీకేం అలాగే చెబుతారు. ప్లేటులో ఉప్మా పెసరట్టు పెడితే పెసరట్టొక్కటి తుంచుకు తింటారు, ఎటో ఆలోచిస్తూ. ఉప్మా ముట్టనే ముట్టరు, నేను చెప్పేవరకూ. అన్నీ నేను దగ్గరుండి చూసుకోకపోతే సబ్బుబిళ్ళ

ఉందో లేదో చూసుకోకుండా ఒట్టినీళ్ళు ఒంటి మీద పోసుకు వచ్చేస్తారు. మీకంటే పాపా యిలే నయం"

"నీమీద అంతగా ఆధారపడిపోయేటట్టుగా చేస్తున్నావు. తప్పు నాది కాదు నీది. నువ్వు ఒక్కరోజు లేకపోతే నా పని హుళ్ళక్కే."

'ఏం మాటలవి?' అని పైకి అన్నా భార్యామణి లోలోపల తన మొగుడు ప్రతిదానికీ తనమీద అంతగా ఆధారపడివున్నాడు అని మురుసుకుంటూనే ఉంటుంది' అనుకున్నాడు గోపాలకృష్ణ.

## 2

ఇంటర్వ్యూకి పిలుపు వచ్చింది హరికి. గోపాలకృష్ణకి ఫోన్‌చేసి కాత్యాయని ఆనందంగా ఆ కబురందజేసింది- అతడు ఆఫీసు పనిలో తలమునకలుగా ఉండగా. 'హమ్మయ్య' ఒక గొడవ తీరిందనుకున్నాడతను.

ఇంటర్వ్యూకి వెళ్ళేటప్పుడు కొడుకుతో "జాగ్రత్తగా చేసి రా. మెరిట్ లేకపోతే ఈ రోజుల్లో ఉద్యోగాలు దొరకవు" అన్నాడు గోపాలకృష్ణ.

"ఎంత పెద్ద జోక్ వేశారండీ. మెరిటా పాడా? సిఫారసు లేందే ఉద్యోగాలు దొరకవు ఈ రోజుల్లో. అందుకనేకదా మిమ్మల్నంత పోరింది నేను" అంది కాత్యాయిని.

"మీ అమ్మ మాట పట్టించుకోకు. సమాధానాలవీ ఆలోచించి మరీ ఇవ్వు. తెలియనిదానికి తెలియదని నిజం చెప్పేయ్. అంతేగాని బొంకకు" అని హితవు చెప్పి పంపాడు తండ్రిగా.

ఇంటర్వ్యూ నుంచి వచ్చాక కొడుకు ముఖం చూసి తల్లి కాస్త ఆదుర్దా పడింది. పైకి అది కనపరచకుండా "ఇంటర్వ్యూ బాగా జరగకపోతే ముంచుకుపోయిందేమీ లేదు. ఇది కాకపోతే మరొకటి. కాస్త మీ నాన్నగారితో చెప్పి ఎవరైనా పెద్దాయనతో సిఫారసు చేయించుకోరా, మీ నాన్నగారి సిఫారసాక్కటే పనిచేసినట్టు లేదు" అంది.

"అదేమిటమ్మా, నాన్నగారు చెప్పబట్టే కదా సెకండ్ క్లాసు వచ్చినా నన్ను ఇంటర్వ్యూకి పిలిచారు. అక్కడకు ఎలాంటివాళ్ళొచ్చారో తెలుసా? అందరూ ఫస్టుక్లాసు, డిస్టింక్షన్‌లో వచ్చినవాళ్ళే. వాళ్ళందర్నీ చూశాక ఇక నాకు ఆ ఉద్యోగం రాదని అనిపించింది."

"అలా ముందే ఊహించుకుని ఇంటర్వ్యూ బాగా చేసి వుండవు"

"ఇక మర్చిపో. అమ్మా దానిని గురించి, ఊరికే నాన్నగారిని సిఫారసు సిఫారసు అని వెంటపడకు. నాకు తగిన ఉద్యోగం నాకూ దొరక్కపోదు. కొంచెం ఓపిక పట్టు" అని తల్లిని ఓదార్చినంత పనిచేశాడు కొడుకు.

వారం రోజుల వరకూ ఏ సమాధానమూ రాలేదు. ఇక ఆ ఉద్యోగం పోయినట్టే అని నిర్ధారణ చేసుకున్నారు ఇంట్లో అందరూ. "పోనీ ఫోన్ అయినా చేసి ఏమయిందో కనుక్కుంటే" అని భార్య పోరినా గోపాలకృష్ణ ససేమిరా అన్నాడు.

వారం రోజుల తర్వాత ఇంటికి రాగానే "ఎవరో వేదవల్లట, మీరున్నారా అని అడిగింది. రాత్రి ఎనిమిది వరకూ రారని చెప్పాను"అని చెప్పింది కాత్యాయనీ గోపాలకృష్ణతో.

ఆ రోజున వేదవల్లికి తన కార్డు ఇచ్చిన గుర్తులేదు. అసలెప్పుడూ కార్డు జేబులో పెట్టుకుపోడతను. మరి ఫోన్ నెంబరు, అందులోనూ ఇంటి ఫోన్ నెంబరు ఎలా తెలుసుకుంది అనుకుంటూ మల్లగుల్లాలు పడుతూ ఉండగా వేదవల్లి దగ్గర నుంచి మళ్ళీ ఫోన్ వచ్చింది.

"గోపాల్, నీ నెంబరు మీ అబ్బాయి అప్లికేషన్ ఫారమ్‌లో చూసి చేస్తున్నాను. మీ అబ్బాయి నీలాగే మొహమాటస్థుడు. నువ్వే మీ అనుకోకపోతే ఒక మాట చెప్పాలి. మీ అబ్బాయి కంటే మెరికల్లాంటి కుర్రవాళ్లు వచ్చారు. వాళ్లల్లో ఇద్దర్ని తీసుకున్నాం. 'ప్రకటించిన దానికంటే చిన్నపోస్టు ఒకటుంది. దానికి ఒప్పుకుంటారా?' అని అడిగితే ఆ వచ్చిన వాళ్లల్లో ఎవరూ వద్దన్నారు. మీ అబ్బాయినడిగాం. తనకభ్యంతరం లేదన్నాడు. 'జీతం మరీ ఎక్కువగా వుండదు. నువ్వు

ఎంతైతే చేరగలవు' అని అడిగాం. మొహమాట పడకుండా 'అడుగు' అన్నాం. 'నిజంగా నాకు తెలియదు ఎంతడగాలో' అన్నాడు. అందుచేత మేము ఆలోచించి పది వేలకు నిర్ధారించాం. రేపు 'ఆఫర్' పంపుతాం. తర్వాత మీ యిష్టం" అంది.

భార్య ఏదో పనున్నట్లు అక్కడే తచ్చాడుతోందని గోపాలకృష్ణకు తెలుసు. ఎవరైనా ఆడవాళ్ల దగ్గర నుంచి ఫోన్ వొస్తే ఎలా పసిగడుతుందో ఏమో ఇక ఒక చెవి ఆ ఫోను సంభాషణ మీదే నిలుపుతుంది.

"ఇష్టం ఏమిటి? అసలు వాడికి పదివేల ఉద్యోగం వస్తుందంటేనే నాకు ఆశ్చర్యంగా వుంది" అన్నాడు గోపాలకృష్ణ.

"అలా కాదు. మిగతా ఆ ఇద్దరికీ ఇరవై వేల చొప్పున నిర్ధారించాం. మేం ప్రకటన ఇచ్చినప్పుడే మెరిట్ ని బట్టి జీతం నిర్ధారిస్తాం అని ఇచ్చాం కదా? అందుచేత వాళ్లకి ఇరవై వేలు, నాకు పదా అని చిన్నబుచ్చుకోవచ్చుకదా!"

"మీరిచ్చే తర్ఫీదులో వాడు పుంజుకుంటాడన్న నమ్మకం నాకుంది. థాంక్స్ వేదా" అని ఫోన్ పెట్టేశాడు.

"ఎవరావిడ? వేదా అంటూ అంత చనువుగా మాట్లాడేస్తున్నారు అంతసేపు" అంది కాత్యాయని నిష్ఠూరంగా.

"నీతో వచ్చిన చిక్కే అది. ఆవిడ పేరు వేదవల్లి. మేమిద్దరం కాలేజీలో కలిసి చదువుకున్నాం. మా యింటికి ఎదురుగా పెద్ద భవనంలో ఉండేవారు వాళ్లు. ఇప్పుడు మన అబ్బాయి ఇంటర్వ్యూకి వెళ్ళింది వాళ్ళ కంపెనీకే" అన్నాడు.

"ఆ మాట నాతో మీరింతవరకూ చెప్పనే లేదేం? అన్నీ నా దగ్గర దాస్తారు. నాకు పెద్ద చదువులు లేవని మీ గొప్ప గొప్ప స్నేహితుల్ని గురించి చెప్పరు. మీకసలు అంత పెద్ద స్నేహితులున్నారంటే నమ్మడం కష్టమే అనుకోండి. ఇంతకీ ఏమిటంటారావిడ? "

"ఏముందనడానికి, మీ సుపుత్రుడికి పది వేల రూపాయల జీతంతో ఉద్యోగం ఇస్తున్నామ"ని చెప్పింది.

కాత్యాయని ముఖం ఒక్కసారిగా వెలిగింది. "హరీ, రారా నాన్నా ఇటు. అందరి నోళ్ళల్లో కాస్త పంచదారన్నా పోయాలి" అంటూ హడావిడిగా వంటింట్లోకి వెళ్ళింది.




తల్లి కేకకు హరి అక్కడికి వచ్చాడు "ఏరా హరీ 'ఎంత కావాలి నీకు జీతం' అని అడిగితే 'నిజంగా నాకు తెలియదు ఎంత అడగాలో' అన్నావట. పిచ్చిసన్యాసీ ఇప్పుడెంత నిర్ణయించారో తెలుసా? పది వేలు" అన్నాడు తండ్రి.

"నిజమా నాన్నా!... గట్టిగా చెప్పమంటే 'ఏడెనిమిదివేలు' అని ఉండేవాణ్ణి" అన్నాడు ఎంతో నిజాయితీగా కొడుకు.

అతడి నిజాయితీ చూసే తండ్రికి ఎంతో సంతోషం వేసింది. కొడుకు మాటలు విన్న తల్లి మాత్రం బాధపడిపోయింది- 'ఈ పిచ్చి వెధవ ఎలా బతుకుతాడో' అనుకుంటూ. కొడుకు పదివేల సంపాదనపరుడయ్యాడంటే ఆవిడెంతో ఆనందపడిపోయింది. తన భర్తకి ఉద్యోగంలో చేరిన పదేళ్ళకు వచ్చిందా పదివేల జీతం అనుకుంది. అయితే అప్పటి పదివేలకున్న విలువ గొప్పదన్న మాట ఆవిడకు స్ఫురించలేదు.

ఆ రాత్రి పనులన్నీ ముగించుకుని ఉస్సురనుకుంటూ వచ్చి కూర్చుంది భర్త పక్కన. "కాత్యాయనీ ఇప్పుడు కొడుకూ సంపాదనపరుడయ్యాడు. వాడి కోసం కూడా వాళ్ళు వీళ్ళు వస్తూవుంటారు. ఇంకాస్త పెద్దిల్లు తీసుకుందాం. ఒక పనిమనిషిని పెట్టుకుందాం.

నీకు కాస్త విశ్రాంతిగా వుంటుంది" అన్నాడు గోపాలకృష్ణ.

"బాగానే వుంది సంబరం. ఆ వచ్చే పదివేలకు అప్పుడే ఖర్చుల జాబితా తయారుచేశారన్నమాట. నాకు వేరే పనేముంది? ఇంటిపని వంటపని తప్ప. నాలుగయిదేళ్ళల్లో ఒకరి తర్వాత ఒకరికి పెళ్ళిళ్ళు చేయాలంటే మాటలా! కొంచెం కొంచెం బంగారం కొని పెట్టుకోవాలి" అందావిడ.

"నీ ముందుచూపు బ్రహ్మాండంగా వుంది. నువ్వు సుఖపడవు. ఇతరుల్ని హాయిగా బతకనియ్యవు"

"మీ అందరి సుఖం కోసం అహర్నిశలూ రెక్కలు ముక్కలు చేసుకుంటూ ఉంటే కూడా మీకింకా తృప్తిగా లేదు. నా లాంటి పెద్ద చదువులు చదవనిదాన్ని చేసుకోబట్టే కదా మీకింత అలుసయిపోయాను"

"ఏ పెద్ద చదువులు చదివినావిడ నన్ను చేసుకుంటానంది? నేను గొప్పింటి వాడినని, పెద్ద చదువులు చదివినవాడినని ఆడవాళ్ళంతా లైనులో నుంచునేవారు. నువ్వది చూశావు కూడా" అన్నాడు అతను హేళనగా.

"అవన్నీ లేకపోతేనేం మన్మథాకారం వుంది కదా! అందుకోసం ఎవరైనా చేసుకునేవారు కళ్ళకద్దుకొని"

"మరెందుకు నేను ఎవర్నీ చేసుకోలేకపోయాను చాలాకాలం వరకు."

"మీకే తెలియాలి. ఎన్ని సంబంధాలొచ్చినా ఆ వంకా ఈ వంకా పెట్టి మీవాళ్ళు పడనిచ్చేవారు కాదటకదా. కట్నం ఆశ కాకపోతే, నాకు తెలిసిన ఇద్దరమ్మాయిలకి- చక్కగా కుందనపు బొమ్మల్లా ఉండేవాళ్ళకి- మీ వాళ్ళు వంకలు పెట్టి చెడగొట్టారట. కట్నం మాటెత్తితే మీరూరుకోరని ఆ వంకలు, ఈ వంకలు పెట్టి మీకు వచ్చిన సంబంధమల్లా చెడకొట్టారుటగా"




## నీ కళ్ళు చెబుతున్నాయి...

కళ్ళు కరుణ కురిపించగలవు, ప్రేమ పలికించగలవు, పగను ప్రజ్వలింపజేయగలవు... సినీమా డైలాగు అనుకుంటున్నారా? ఎంత మాత్రం కాదండోయ్. కానీ అచ్చం అలాగే ఉన్న ఈ వాక్యాన్ని వైద్యులు పూరిస్తున్నారు. ఏమనో తెలుసా? కళ్లు జబ్బుల్ని పట్టి చూపించగలవని. జబ్బులంటే... అలాంటిలాంటి జబ్బులు కాదండీ. ప్రాణాంతక వ్యాధుల లక్షణాల్ని కళ్లు తెలియజేసి, మిమ్మల్ని అప్రమత్తుల్ని చేసి, బతికించి బట్ట కట్టిస్తాయంటున్నారు ఆస్ట్రేలియన్ శాస్త్రవేత్తలు.

మనం కంటి డాక్టరు దగ్గర కెళ్ళినపుడు, కంట్లో ప్యూపిల్‌ని డయలేట్ చేసి, ఆప్తాల్మోస్కోపు ద్వారా లేదా ఫొటోగ్రాఫ్ ద్వారా రెటీనాలో కలిగే మార్పుల్ని అంటే బలూనింగ్ లేదా చిట్లిపోయిన సన్నని రక్త నాళాల్ని పరీక్షిస్తారు. ఆ పరీక్షల సందర్భంగానే మధుమేహ వ్యాధి, రక్తపోటు, క్యాన్సర్ వంటి వ్యాధుల లక్షణాల్ని గుర్తించవచ్చు అంటున్నారు ఆ శాస్త్రవేత్తలు. 3654 మంది కళ్ల ఫొటోల్ని వాళ్లు నిశితంగా పరిశీలించారు. కళ్ళలో రక్తనాళాలు పాడైపోయిన వారిలో డెబ్బైశాతం మందికి గుండె జబ్బులు వచ్చే ప్రమాదముంటుందని తమ పరిశోధనల ఫలితాల్ని బట్టి చెబుతున్నారు. దీనిమీద ఇంకా విస్తృత పరిశోధనలు జరుగుతున్నాయి.

"నీకెవరు చెప్పారీ చిదంబర రహస్యాలు? "

"ఇవి దాగుతాయా దాస్తే కూడా. మా సంబంధానికి మీరొస్తున్నారని తెలిసి మా చిన్నాన్న కూపీ లాగి అన్ని విషయాలూ సేకరించుకొచ్చాడు. 'అంత అందమైన కుర్రాడికి పెళ్ళి కాలేదూ అంటే కట్నం ఆశయినా అయ్యుండాలి. లేదా ఏదో అతనికి అవకరమైనా వుండి వుండాలి' అని చెప్పాడు మా అమ్మా నాన్నతో. ఇంతలో మీరు అనుకోకుండా పెళ్ళి చూపులకొచ్చారు' తల దించుకు కూర్చున్నారు. నన్ను సరిగా చూసి వుండరు"

"ఎలా అనుకున్నావు అలా"

"సరిగా చూస్తే నన్ను చేసుకొనేవారు కాదు. నాకూ ఎన్నో సంబంధాలు వచ్చి వెనక్కి పోయాయి. పిల్లా అంత బావుండదు. కట్నమూ పెద్దగా లేదని"

"మరి నేను చేసుకున్నానుగా నిన్ను, అలాంటిదేమీ అనకుండా"

"వచ్చిన సంబంధాలు ఖాయం కాకపోవడంతో మీ వాళ్ళని నోరెత్తనివ్వకుండా ఈసారి చూసినమ్మాయిని ఎవరికి నచ్చినా నచ్చకపోయినా చేసేసుకుంటానని చెప్పి మరీ వచ్చారటగా"

"ఈ సంగతి నీకెవరు చెప్పారు? "

"మీ వాళ్ళే. నేను మీకు ఏ విషయంలోనూ తగిన దానిని కానట. అయినా మీ వాళ్ళ మీద విసుగొచ్చి చేసేసుకున్నారట"

"అది దైవ నిర్ణయం"

"అలా అనుకునే మీకు ఏ విధమైన కష్టమూ కలగకుండా మిమ్మల్ని చేసుకున్నప్పట్నుంచీ మీరే లోకంగా, మీ పిల్లలే లోకంగా బతుకుతున్నాను. ఎప్పుడైనా నేను ఆ మీటింగనీ ఈ మీటింగని ఎవరొచ్చి పిలిచినా వెళ్తున్నానా? ఏ పేరంటానికో వెళ్ళినా వెంటనే తిరిగి ఇంటికి వచ్చేస్తాను-పిల్లలు కాలేజీ నుంచి వస్తారనో, మీ రాత్రి భోజనానికి వంట ఆలస్యమవుతుందో అని"

గోపాలకృష్ణకు భార్య మీద ఎనలేని జాలి కలిగింది. "ఇన్ని మనసులో పెట్టుకొని ఎందుకు బాధపడుతున్నావు. నేను ఎపుడయినా నిన్ను అందంగా లేవని అన్నానా? కట్నం తేలేదని అన్నానా? పైగా నాకొచ్చే జీతంలోనే ఎంతో పొదుపుగా ఆర్థిక ఇబ్బందులు లేకుండా సంసారం నడుపుతున్నావ్. నన్నూ, పిల్లల్నీ ఏ కొంచెం కష్టపడనీయవు. నువ్వు ఒక్కరోజు లేకపోయినా నాకు గడవదు. రోజంతా నా అవసరాలన్నీ జాగ్రత్తగా, స్వయంగా చూసుకుంటావ్. ఒక్క ఆఫీసు పని తప్పితే, ఏనాడూ ఇంటి విషయం నేను పట్టించుకోలేదు. అన్నీ నువ్వు చూసుకుంటున్నావు. నువ్వు దొరకడం నా అదృష్టం కాత్యాయనీ" అంటూ భార్యను ప్రేమగా దగ్గరకు తీసుకొన్నాడు గోపాలకృష్ణ.

* * *

"హరి దగ్గర నుంచి ఉత్తరం వచ్చింది, మనం ఇద్దామనుకున్న జీతానికి ఒప్పుకున్నట్టు. పదకొండు గంటలకు రమ్మన్నాను" అంది వేదవల్లి భర్తతోపాటు బ్రేక్‌ఫాస్ట్ చేస్తూ.

"పనికి అందుకోగలడంటావా? ఇంటర్వ్యూలో మరీ బెదిరిపోయినట్టు కనపడ్డాడు? " అన్నాడు మనోహర్.

"అదే మొదటి ఇంటర్వ్యూ అన్నాడు. మనం కొంచెం ధైర్యం చెబితే కొద్దిరోజుల్లోనే కాలరు పైకెత్తుకొస్తాడు మీ దగ్గరకు"

మనోహర్ నవ్వుతూ, "అమ్మో? మరీ అంత ధైర్యం పోయకు" అన్నాడు.

"ఇంట్లో వాతావరణాన్ని బట్టి, తిరిగే సమాజాన్ని బట్టి కూడా మనస్తత్వం ఉంటుంది. అదే కాస్త కలిగిన వాళ్లింటి నుంచి వచ్చిన వాళ్లు చూడండి. ఎంత ధైర్యంగా చెప్తారో? ఒక కుర్రవాడు "పదివేలిస్తా... సరేనా? అంటే నేనంత తక్కువకి రాను" అని లేచి వెళ్లిపోయాడు. అతనికి తనమీద తనకున్న నమ్మకం అతని ఇంటి వాతావరణం, పెంపకం వల్ల కలిగినవే.

"అవును, హరి తండ్రి కూడా బెదురు బెదురుగా వచ్చాడు నన్ను కలవడానికి".

"కాలేజీలో చదివేటప్పుడు కూడా అలాగే ఉండేవాడు. మహా మొహమాటస్తుడు"

"వాట్. అతను నీ కాలేజిమేటా. చెప్పలేదే నాకా సంగతి ఇంతవరకూ."

"ముందే చెబితే నాతో కలిసి కాలేజీలో చదివాడు కనుక అతని కొడుకు ఉద్యోగానికి నేనెక్కువ మొగ్గు చూపించానని అనుకోవచ్చుగా మీరు"

"మన కంపెనీ సంగతి తెలుసుగా నీకు. సగం మందిని మెరికల్లాంటి వారిని తీసుకుంటాం.

మిగతా సగంమందిని మనం శిక్షణ ఇచ్చి తర్ఫీదు చేసుకోవడానికి తగిన సత్తువ ఉన్న వాళ్లని తీసుకుంటాం కదా!"

"నిజమే. మరి మెరికలలాంటి వాళ్లు మరో రెండువేలు ఎక్కువ ఇస్తామంటే మనల్నొది లేసి మరో కంపెనీకి వెళ్లిపోతారు. నికరంగా ఉండేవాళ్లు మనం తర్ఫీదు ఇచ్చేవాళ్లే"

"అంత మరీ నికరంగా ఉంటారన్న నమ్మకం పెట్టుకోకు. బాగా తర్ఫీదయి మనల్ని వదిలేసి ఎగిరిపోవచ్చు కూడా"

"అందుకే బాండ్ తీసుకున్నాం కదా! అయినా అసిస్టెంట్ ఇంజినీర్ల దగ్గర నుంచి రెండేళ్లకే బాండు తీసుకున్నారెందుకు? "

"మనం అంతకంటే ఎక్కువ కాలం కట్టిపడెయ్యడం భావ్యం కాదు. జూనియర్ ఇంజినీర్ల దగ్గర నాలుగేళ్లు తీసుకున్నాం. రెండేళ్లలో తర్ఫీదవుతారు. ఆ తరువాత మరో రెండేళ్లు నికరంగా ఉన్నా ఫరవాలేదు"

"నిజంగా, మీ దగ్గరనుంచి ఇలాంటి మెళకువలు ఎప్పటికప్పుడు నేర్చుకుంటూనే ఉన్నాను. అంటే నేనూ తర్ఫీదవుతున్నాను"

"అమ్మో, అంటే నువ్వు నాలుగేళ్ల తర్వాత నన్ను వదిలేసి ఎగిరిపోతావా? అది కుదరదు. నీ దగ్గర జీవితకాలానికి బాండ్ తీసుకున్నాను" అన్నాడు నవ్వుతూ.

"బాండో గీండో, నన్ను పొమ్మన్నా పోనుగా".

నవ్వుకుంటూ ఇద్దరూ బ్రేక్‌ఫాస్టు ముగించి ఎవరి ఆఫీసు గదుల్లోకి వాళ్లు వెళ్లిపోయారు.

"వేదవల్లి సరిగ్గా పదకొండు గంటలకు బెల్ కొట్టి హరి అన్న కుర్రవాడు వచ్చాడా? " అని అడిగింది లోపలికి వచ్చిన ప్యూన్‌ని.

"వచ్చి కూర్చున్నారమ్మా పక్కగదిలో" అన్నాడతడు.

హరిని తీసుకురమ్మని చెప్పి తను అతని అప్లికేషన్‌లోని వివరాలు తిరిగి చూడడం మొదలుపెట్టింది.

భయపడుతూ నెమ్మదిగా ప్యూన్ వెంట లోపలికి వచ్చాడు హరి. అలికిడికి తలెత్తి చూసింది. మౌనంగా చేతులు జోడించాడు హరి.

"కూర్చో హరీ, చాలాసేపయిందా వచ్చి"

"ఎక్కువసేపు కాలేదు. పదిన్నరకు వచ్చాను మేడమ్" అన్నాడు హరి చేతిగోళ్ల వంక చూసుకుంటూ.

"నేను పదకొండు గంటలకి రమ్మన్నాను కదా! అయిదు నిమిషాల ముందు వస్తే సరిపోయేది"

"రెండు బస్సులు మారి రావాలి మేడమ్. నాన్నగారు ఒక అరగంట ముందే వెళ్లమని చెప్పారు"

"మీ నాన్నగారు అస్తమానం ఇలా సలహాలిస్తూ ఉంటారా? "

"లేదండి. ఇవాళ కొత్తగా నేను ఉద్యోగంలో చేరడం కదండీ, అందుకే"

"మీ అమ్మగారు నీ నోట్లో పెరుగు, పంచదార పెట్టారా? "

"పెట్టింది మేడమ్. మీకెలా తెలుసు"

"అనుకున్నాను. మన ఇళ్లల్లో అలా చేస్తారు సాధారణంగా"

"మీ యిళ్లల్లో కూడానా మేడమ్"

"నువ్వు మమ్మల్ని గురించి ఏమనుకుంటున్నావ్. మాకొక కంపెనీ వుంది కనుక, మీలాంటి వాళ్లకు ఉద్యోగాలు ఇస్తాము కనుక మేం ఆకాశం నుంచి ఊడిపడ్డాం అనుకుంటున్నావా? "

దానికి హరి జవాబుగా చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు.

"హరీ నీకొక సంగతి చెప్పనా. ఒకాయన ముప్పయేళ్ల క్రితం మన రాష్ట్రంలోని ఒక చిన్న టౌను నుంచి అమెరికా వెళ్లాడు. ఆయన అతి సామాన్య మధ్యతరగతి కుటుంబానికి చెందినవాడు. అయితే చదువులో అతి చురుకైనవాడు. కష్టపడి చదివేవాడు. సాయంత్రంపూట లెక్కల ట్యూషన్లు కూడా చెబుతుండేవాడు. తెలివికితోడు శ్రద్ధగా చదువకోవడంతో ఎప్పుడూ స్కూలులోను, తరువాత కాలేజీలోనూ ఫస్టు వచ్చేవాడు. దాంతో స్కాలర్‌షిప్పు వచ్చేది. అదే విధంగా ఒక విదేశీ విద్యాలయంలో కూడా సీటు, స్కాలర్‌షిప్పు సంపాదించాడు. ఇక మెట్టు మెట్టు ఎక్కుతూ పైకివచ్చాడు. ఆయనెవరో తెలుసా? "

తెలియదన్నట్టు తలూపాడు హరి.

"అక్కడ ఒక సాఫ్ట్‌వేర్ కంపెనీ తెరిచాడు. దానిలోనూ చాలా కష్టపడి పనిచేసి మంచి పేరు తెచ్చుకున్నాడు. ఆ తర్వాత మన రాష్ట్రంలో కూడా దానికి అనుబంధ కంపెనీని తెరిచాడాయన. దాని పేరు ఊహించుకోగలవా? "

ఒక్క క్షణం ఆగి "మేడమ్. మిత్ర మైత్ర కంపెనీయా? " అన్నాడు.

"అదీ- చూశావా నేను చెబుతున్నది జాగ్రత్తగా వింటూ పసిగట్టేశావ్"

"మేడమ్ ఈ కంపెనీకి ఆ పేరెందుకు పెట్టారు? "

పరవాలేదు అబ్బాయి కాస్త ధైర్యం తెచ్చుకుంటున్నాడు అనుకుని "మిత్ర మా అమ్మాయి పేరు. మైత్ర మా అబ్బాయి పేరు. ఇక్కడి కంపెనీ వాళ్లిద్దరి పేరుతో పెట్టాం"

"అమెరికా కంపెనీ మీ ఇద్దరి పేర్లతో పెట్టారా మేడం? "

"నా ఒక్కదాని పేరుతోనే పెట్టారు. వేద సాఫ్ట్‌వేర్ కంపెనీ అని! ఆయనకెందుకో తన పేరుతో పెట్టుకోవడం ఇష్టంలేదు. మేం ఈ కంపెనీల గొడవ నుంచి విశ్రాంతి తీసుకున్నప్పుడు బహుశా మా పిల్లలు ఆయన పేరుతో కంపెనీ పెడతారేమో!"

"మేడమ్..."

"సంకోచం దేనికి? చెప్పు హరీ"

'ఏంలేదు మేడమ్. నేనేం పని చేయాలి? "

"తొందరపడకు. ఒక వారం రోజులు ఇక్కడి వాతావరణానికి అలవాటుపడు. సంకోచం లేకుండా కంపెనీ ఆవరణంతా తిరిగి చూడు, ఎవరినీ డిస్టర్బ్ చేయకుండా. ఆ తర్వాత నా దగ్గరకు రా. అప్పుడు చెబుతాను, నువ్వేం చేయాలో" అని ప్యూనుని పిలిచి "హరికి మన కంపెనీ అంతా చూపించు. సింగ్‌గారి దగ్గరకు తీసుకువెళ్లు. ఆయన మిగతా సంగతులు చూసుకుంటారు" అంటూ కుర్చీలోంచి లేచి ముందుకు వచ్చి హరి భుజం తట్టి ఇకనుంచి నువ్వు బయటవాడివి, పరాయివాడివి కావు. మా పరివారంలో ఒకడివి. అలా అనుకునే ఇక్కడ పని చేయాలి. సరేనా" అని అతణ్ణి ప్యూన్‌తో పంపింది.




ఆ రాత్రి భోజనాల దగ్గర కొడుకు ఉద్యోగంలో మొదటిరోజు ముచ్చట్లు చెబుతూవుంటే, గోపాలకృష్ణ అతడి ముఖం వంక శ్రద్ధగా చూశాడు. కాత్యాయని 'నా కొడుకే కదా ఉద్యోగస్థుడయ్యాడు' అని మురిసిపోతూ, రోజూకంటే ఒక కూర ఎక్కువ చేసి, కొసరి కొసరి భర్తకి, కొడుకుకి, ఇద్దరు కూతుళ్లకు వడ్డించింది.

"నువ్వూ కూర్చో కాత్యాయనీ. మేం వడ్డించుకుంటాంలే" అన్నాడు గోపాలకృష్ణ.

"నేనూ కూర్చుంటే ఇక అయినట్టే. అన్నీ

సరిగా వేసుకు తింటారా? మీ అందరికీ అన్నీ వడ్డించి మీరు తినడం చూస్తే కలిగే ఆనం దం మీకెంత చెప్పినా అర్థం కాదు"

"నువ్వలా కొసరి కొసరి పొట్టలు పగిలేలా వడ్డించకుండా నువ్వూ మాతోపాటు కూర్చుంటే మాకెంత ఆనందంగా ఉంటుం దో తెలుసా?"

"అవునమ్మా. నాన్నగారన్నది నిజం" అన్నాడు కొడుకు.

చెల్లెళ్ళిద్దరూ తెల్లబోయి అన్నవంక చూసి కిసుక్కున నవ్వారు.

"నిజమేరా. రోజూ తల వంచుకుని మరీ గబగబా తినేసేవాడివి. నోరు విప్పేవాడివి కాదు, మీ నాన్న ఎదురుగా. ఇవాళ మీ నాన్నకు వత్తాసు పలుకుతున్నావు, ఉద్యో గంలో చేరిన మొదటిరోజే" అంది తల్లి.

"నిజమే కాత్యాయనీ, నేనూ అదే గమని స్తున్నాను. వాడికి తనమీద తనకి కాస్త నమ్మకం కుదిరినట్టుగా కనపడుతున్నాడు. పూర్వం ఏది చెప్పినా 'అమ్మో' అనేవాడు" అన్నాడు గోపాలకృష్ణ.

పిల్లలు ముగ్గురికీ తల్లి దగ్గరే ఎక్కువ మాలిమి. తండ్రి ఎప్పుడూ ఆఫీసు పనిలో మునిగితేలుతూ ఉండడంవల్ల ఆయన దగ్గర వాళ్ళకి ఎక్కువ చనువు ఏర్పడలేదు. అయితే ఆయనంటే భయంతో కూడిన ఆప్యాయత మాత్రం మెండుగానే ఉంది. తమకేది కావలసి వచ్చినా తల్లినే అడుగుతారు. గోపాలకృష్ణ కూడా కాత్యాయ నిని ఎప్పుడూ ఏమీ నిలదీసి అడగడు. ఆవిడ అవసరానికి కావలసిన డబ్బు, అతడి పర్సులో నుంచి తీసుకుంటుంది. పర్సు ఖాళీ అయితే బ్యాంక్ నుంచి డబ్బు తీసు కుని పర్సులో పెడతాడు. అయితే ఏనాడూ కాత్యాయని వాళ్ళ స్తోమతకు మించి న ఖర్చు పెట్టలేదు. ఉన్నంతలోనే కాస్త కాస్త మిగిల్చి పిల్లలకేదో ఒకటి కొనిపెడుతూవుం టుంది. కొన్నతర్వాత ఆవిడ భర్తకు చెప్పే విధానం కూడా గమ్మత్తుగా ఉంటుంది.

"పెద్దమ్మాయి ముఖంలో కాస్త తేడా కన పడుతోందా?" అని అడిగింది ఒకరోజు రాత్రి భోజనాల దగ్గర.

తండ్రి ఆ పిల్ల ముఖంలోకి నిశితంగా చూసి, "కాస్త చిక్కినట్టుగా ఉంది. మరీ అంత అర్ధరాత్రి వరకూ చదవకమ్మా" అంటే అందరూ ఒక్కసారిగా నవ్వారు. ఎందుకు నవ్వారో గోపాలకృష్ణకు అర్థం కాలేదు.

"అమ్మాయి చెవులు చూశారా?" అంది కాత్యాయని కాస్త విసుగ్గా.

"ఓ! లోలకులా? బావున్నాయి. రోజూ అవి కాదా పెట్టుకునేది" అన్నాడు తెలివిత క్కువగా.

"అయ్యో ఖర్మ! ఆ లోలకులు ఇవాళే కొన్నా ను. రోజూ ఎక్కడ చూశారు మీరు? ఎంతసేపూ ఆఫీసు ధ్యాసే తప్పితే మరిం కేదీ పట్టదు" అందావిడ రుసరుసలాడుతూ.

"మిగతా పనులన్నీ నువ్వెంతో నేర్పుగా చేస్తావనే నీమీద వదిలేస్తున్నాను మరి" అన్నాడాయన.

"ఎన్నిటికని నేనొక్కదాన్నే దేవుళ్ళాడను. మీరూ కాస్త పట్టించుకోవడం అవసరం"

"నువ్వే చెప్పు నేను ఆఫీసు నుంచి వచ్చే టప్పటికే రాత్రి ఎనిమిదవుతోంది. పొద్దునే తొమ్మిది గంటలకే ఆఫీసుకు పోవాలి. ఆది వారాలు ఎలాగూ నీతో సరుకులు కొనడా నికి, కూరగాయల వేటకీ వస్తున్నాను కదా"

"ఆహా! వచ్చారులెండి. ఏం పట్టనట్టుగా కారాపి దానినానుకుని నిలబడతారు. కొనేట ప్పుడు కనీసం నాకు సలహా ఇవ్వొచ్చుగా"

"ఒకసారి సలహా ఇవ్వబోతే, మీకేం తెలి యదు ఊరుకోండి. హాయిగా కారులో కూర్చోండి అని ఆజ్ఞాపించావుగా".

"అయ్యో రామా! చూశావా మీ నాన్నగారి వరస. ఏదో చచ్చుసలహా ఇచ్చి ఉంటారు. అందుకే అలా అని ఉంటాను"

పిల్లలు ముగ్గురూ వాళ్ళిద్దరి సంభాషణ వింటూ నవ్వుకుంటూ భోజనాలు ముగిం చారు. "ఒక్క విషయం. నేను మీ అమ్మతో



చేయించలేని పని మీరు చేయించాలి" అన్నాడు పిల్లలతో గోపాలకృష్ణ. ఏమిటన్నట్టుగా ముగ్గురూ తండ్రి వంక చూశారు. "రోజూ రాత్రి తొమ్మిది గంటలకు మనతో పాటు మీ అమ్మ కూడా భోజనానికి కూర్చునేటట్టు చూడాలి" అన్నాడు.

మావల్ల కాదన్నట్టు సైగలతో చెప్పారు.

"అసలు నాతోపాటు పిల్లల్ని కూడా తొమ్మిది గంటల వరకు ఎందుకు కూర్చోబెడతావు? వాళ్ళకు ఎనిమిది గంటలకే ఎందుకు భోజనం పెట్టేయవు? నువ్వెలాగూ నేను తినందే తిన నంటావు. మనిద్దరం కలిసి తినొచ్చుగా తొమ్మిది గంటలకు? "

"అలా కుదరదు. రోజులో ఒక్కసార

యినా అందరం కలిసి కూర్చోకపోతే ఇక కుటుంబం అంటే అర్థం ఏమిటి? "

"సరే నీ మాట కాదనను. అందుకే నువ్వూ కూర్చో మాతో పాటు. రాత్రింబవళ్ళు పనితో అవస్థపడుతూ ఉంటావు. నువ్వు తినకుండా మాకు తినబుద్ధవుతుందనకుంటావా"

"సరేలెండి. మీ మాట మాత్రం ఎందుకు కాదనాలి" అందావిడ.

"ఇది నా మొదటి విజయం. పదండి మీ అమ్మ అన్నం తినగానే అందరం ఐస్క్రీం తిన డానికి వెళదాం" అన్నాడు గోపాల కృష్ణ.




హరి రోజూ ఆఫీసుకు వెళుతు న్నాడు. రోజు రోజుకూ అతడిలో ఆనందం, ధైర్యం పెరుగుతున్నట్టుగా ఇంట్లో అందరూ గుర్తిస్తున్నారు. ఎప్పుడూ నోరు మెదప కుండా అన్నం తిని లేచేవాడు. రోజూ ఏదో మాట్లాడటమో, జోక్ వేయడమో మొదలు పెట్టాడు. అన్నని చూసి ఆడపిల్లలు కూడా కాస్త నోరు విప్పి మాట్లాడడం మొదలుపె ట్టారు.

ఒకరోజు గోపాలకృష్ణ పొద్దుట ఎనిమిది గంటలకు కాఫీ తాగుతుండగా టెలిఫోను మోగింది.

"హలో" అనగానే "నువ్వా గోపాల్. నేను హరి కోసం ఫోను చేశాను. ఇవాళ కాస్త త్వరగా రమ్మన్నాను"

"నువ్వే ఫోను చేయడమేమిటి"

"ఇంత పొద్దుటే పి.ఎ. రాడు. ఏం నేరుగా నేను చేయకూడదా? "

"అలా అని కాదు. సామాన్యంగా అలా ఎవరూ చేయరు కదా!"

"నువ్వు మారవు. అది సరే హరిలో ఈ నెలలో ఏమయినా కాస్త మార్పు కనపడు తోందా? "

"కాస్త ఏమిటి? చాలా కనపడుతోంది. చాలా ధైర్యంగా ఉన్నట్టు కనపడుతున్నాడు"

"అంతేనా? "

"అంతేకాదు. సంతోషంగా కూడా కనపడు తున్నాడు"

"అదే నాకు కావలసింది. మా ఉద్యోగులం దరూ సంతోషంగా పని చేయాలని మా ఉద్దేశం. ఆముదం తాగిన ముఖాలు పెట్టుకు తిరిగితే ఇష్టముండదు మాకు"

"అది నిజమే. వాడిలో కొత్త జీవం వచ్చిన ట్టుగా ఉంది"

"స్వతహాగా తెలివైనవాడు. ఫస్ట్ క్లాస్ ఎలా మిస్సయ్యాడో కాని సూక్ష్మగ్రాహి అని జూని యర్స్‌కు శిక్షణ ఇచ్చే ఇంజనీరు హరి గురించి చెబుతుంటాడు."

"నిజమా! వాడిని గురించి నువ్వు చెప్పేవ రకు నాకా సంగతి తెలియదు"

"మహా గొప్ప తండ్రివే. ఎంతసేపూ నీ ఆఫీసు గొడవే కాని పిల్లల సంగతి పట్టించు కోవన్నమాట"

"అవన్నీ మా ఆవిడే చూసుకుంటుంది. ఆవిడ మాట్లాడుతుంది. ఒక్క నిమిషం" అన్నాడు.

"ఎవరితో ఆవిడ అంటున్నారు" అంది కాత్యాయని. ఆ అగ్గిపెట్టెంత ఇంట్లో ఫోనులో ఎవరేం మాట్లాడినా అందరికీ వినపడాల్సిందే.

"ఇటు రా కాత్యాయనీ. వేదవల్లిగారు హరి కోసం ఫోను చేశారు. నువ్వు థాంక్స్ చెప్పు ఆవిడకు" అన్నాడు గోపాలకృష్ణ రిసీవర్‌పై చేయిపెట్టి.

"నాకేం తెలుసావిడ? నేనేం మాట్లాడగ లను" అంది లోపలినుంచే.

"నువ్వొకసారి ఇటొచ్చి మాట్లాడితేగా తెలి సేది"

"నేను పనిలో ఉన్నాను. తరువాత మాట్లా

డతాలెండి" అందావిడ మొండిగా.

ఇక లాభం లేదనుకుని రిసీవర్ మీది చెయ్యి తీసేసి "వేదా! ఆవిడ వంటింట్లో ఏదో పని మీద ఉంది. తరువాత తనే ఫోను చేసి మాట్లాడుతానంది" అన్నాడు గోపాలకృష్ణ.

"పరవాలేదు గోపాల్. ఆవిడకు నేను పరిచయం లేనుకదా! మొహమాటపడి ఉంటారు" అని వేద ఫోన్ పెట్టేసింది.

"మిమ్మల్ని 'గోపాల్' అంటుందేమిటి ఆవిడ" అంది అతని వెనకనే నిలబడి వున్న భార్య.

"అరె. నువ్వెప్పుడొచ్చావ్ చడీచప్పుడు కాకుండా" అన్నాడు గోపాలకృష్ణ ఆశ్చర్యపడుతూ.

"మీ రహస్యాలు వినడానికి రాలేదు. మీరు మరీ అంతగా మాట్లాడమని అడుగుతారేమో మాట్లాడదామని వచ్చాను"

"అదేమిటి? తరవాత మాట్లాడతానన్నావు కదా!"

"అలా కాదు... ఇప్పుడే మాట్లాడు' అంటే మీ సొమ్మేం పోయింది"

"కాత్యాయనీ నీకు నిజంగా రాను రాను మతిపోతోంది. ప్రతి దానికీ ఎడ్డెం అంటే తెడ్డెం అంటావు. మళ్ళీ నేనేదో మరీ బలవంతం చేసి చెప్పలేదంటావు".

"తప్పేముంది? భార్యాభర్తల మధ్య భేషజాలు దేనికి? మీరు గట్టిగా చెబితే నేనెప్పుడు వినలేదు మీ మాట".

గోపాలకృష్ణ అవాక్కయ్యాడు. ఏం బదులు చెప్పాలో తోచక ఒక్క క్షణం తటపటాయించి, "ఇక నుంచి గట్టిగానే చెబుతాలే. నీకు పుణ్యముంటుంది, ఓ కప్పు కాఫీ ఇవ్వు" అంటూ మళ్ళీ పక్కన పెట్టిన పేపరు చేతిలోకి తీసుకొన్నాడు. కాత్యాయని వంటింట్లోకి వెళ్ళింది కాఫీ చేయడానికి.

గోపాలకృష్ణ పేపరు చూస్తున్నాడే కాని అక్షరాలు కంటికి ఆనడం లేదు. భార్య గురించే ఆలోచిస్తున్నాడు. గట్టిగా ఏదైనా అంటే 'పెద్ద చదువులు లేని మొద్దునని తిడుతూ ఉంటారు' అంటుంది. నెమ్మదిగా చెబితే 'గట్టిగా ఒకటికి రెండుసార్లు చెప్పలేరా' అంటుంది. ఎలా వేగాలో అర్థం కావడం లేదు అనుకుంటూ వుండగా మళ్ళీ ఫోను మోగింది. ఎవరో సిమెంటు వ్యవహారం గురించి మాట్లాడుతున్నాడు. "సరే ఆఫీసుకు రండి. అలాగే మాట్లాడుకుందాం" అన్నాడు.

"మీ ఇంటికి దగ్గరలోనే ఉన్నాం. ఓ అయిదు నిమిషాల్లో వస్తాం" అనగానే "ఆఫీసుకి రండి. నేను త్వరగా తయారయి ఆఫీసుకు వెళ్ళాలి. ఇంట్లో కుదరదు" అని వాళ్ళకి మరో మాటకి తావివ్వకుండా ఫోను పెట్టేశాడు గోపాలకృష్ణ.

ఇంతలో కాత్యాయని కాఫీ కప్పుతో ప్రత్యక్షమయింది. "చూడు! ఎవరైనా వచ్చినా వాళ్ళని కూర్చోబెట్టి మాట్లాడటానికి అనువైన గది లేదు మనకి. ఇల్లు మారదాం. కాస్త పెద్దది తీసుకుందాం" అన్నాడు అనునయంగా.

"నిన్నగాక మొన్న అబ్బాయికి ఉద్యోగం రాగానే ఆ జీతాన్నెలా ఖర్చు పెట్టాలా అని ఆలోచిస్తే ఎలా? అయినా ఈ వాడకట్టుకు, ఈ ఇంటికి అలవాటు పడిపోయాం"

"నీ పట్టుదలే నీది. ఇప్పుడెవరో సిమెంటు పనిమీద మీ ఇంటి దగ్గరలోనే వున్నాం, వస్తాం అని ఫోను చేస్తే రావడానికి వీలు లేదన్నట్లుగా మాట్లాడవలసి వచ్చింది. వాళ్ళేమనుకుని ఉంటారు? "

ఆఫీసు పనిమీద వచ్చేవాళ్ళు ఆఫీసులో కలవొచ్చు ఇంటికెందుకు రావడం. అసలు మీరింట్లో పెళ్ళాం పిల్లలతో కలిసి ఉండేదే నిండా రోజుకు నాలుగు గంటలుండదు. ఇక ఆ టైములోనూ ఆఫీసు పని ఇంటిలో మొదలు పెడతారా? "

"సరేలే. నన్ను స్నానం చేసి ఆఫీసుకు తయారుకానీయ్" అని స్నానాల గదికి దారి తీశాడు గోపాలకృష్ణ.

రాత్రి భోజనాల దగ్గర గోపాలకృష్ణ హరితో "మీ బాస్ పొద్దుట ఫోను చేసింది. నిన్ను కొంచెం త్వరగా రమ్మందట కదా. వెళ్ళ

లేదా? ” అన్నాడు.

“నేనెంత త్వరగా వెళ్ళినా బస్ మిస్సయ్యాను. రెండు బస్సులు మారాలి నాన్నగారూ” అని సంజాయిషీ ఇచ్చాడు.

“పోనీ ఆటోలో వెళ్ళకపోయావా”.

“నిజమే నాన్నగారూ. నాకు తట్టలేదు.”

“మనోహర్‌గారు నీ పని ఎలా వుందంటున్నారు? ”

“ఆయనకు మా జూనియర్ ఇంజనీర్లతో పనిలేదు. మాకు బాస్ వేదవల్లిగారే. ఆవిడే మాకు శిక్షణ ఇప్పించడం, మాచేత పని చేయించడం చూసుకుంటారు”

“పోనీ ఆవిడకయినా నీ పని నచ్చుతోందా? ”

“ఇంకా శిక్షణ పూర్తి కాలేదు. అయినా ఇది ‘ఆన్ జాబ్ ట్రెయినింగ్’ కనుక తేలిక పనులు చేయిస్తున్నారు”

“శ్రద్ధ పెట్టి నేర్చుకో. రెండు బస్సులు మారి అవస్థ పడడం దేనికి? మోపెడో, మోటార్ సైకిలో కొనుక్కోరాదూ? ”

“మీరేమంటారో అని అడగలేదు. నేనూ అదే అనుకుంటున్నాను”

“నేనేమంటానురా. ఉద్యోగస్తుడివయ్యావు. ఆఫీసులో పని చేయాలంటే కనీస సౌకర్యాలు ఉండాలి కదా! కొనుక్కో”

అంతవరకూ నోరు మెదపకుండ వడ్డన చేస్తూ వాళ్ల మాటలు వింటున్న కాత్యాయని “మంచి సలహా ఇచ్చారు. వాడు తిన్నగా వుండాలని లేదా మీకు. స్కూటరు మీద వెళితే సుఖం అనుకుంటున్నారా? మొన్న మన పక్కింటాయనికి స్కూటర్ మీద వెళుతుండగానే కదా యాక్సిడెంటయి కాలు తీసేశారు” అంది.



**హరి పెద్దవాడైపోయాడు. తన నిర్ణయాలు తాను తీసుకునే స్థితికి ఎదిగిపోయాడు అని సణుక్కుంటూ ఎంగిలి కంచం సింకులో పెట్టింది**

“ప్రతిదానికీ భయపడితే ఎలాగే! హడావిడిగా బస్ ఎక్కుతూ కింద పడి తల పగలగొట్టుకున్నాడు ఒక విద్యార్థి అని ఈ మధ్యనే పేపరులో చూడలేదా? ” అన్నాడు గోపాలకృష్ణ.

అక్కడే కూర్చుంటే ఆ టాపిక్ మీద ఇంకా వాదన పెరిగి చివరికి తండ్రి కూడా ‘సరేలేరా... మీ అమ్మ వద్దంటోంది. బస్సు మీదే వెళ్ళు’ అంటే ఇక అక్కడితో తను స్కూటర్ కొనుక్కోవడం హుళక్కే అనుకుని గబగబా అన్నం తినేసి లేచి వెళ్ళిపోయాడు హరి.

అది గమనించిన కాత్యాయని “హరి పెద్దవాడైపోయాడు. తన నిర్ణయాలు తాను తీసుకునే స్థితికి ఎదిగిపోయాడు” అని సణుక్కుంటూ ఎంగిలి కంచం సింకులో పెట్టింది.

ఆ తరవాత కూడా కాత్యాయని ముభావంగా పడుకుని ఆలోచిస్తున్నట్టుగా కనపడితే “కాత్యాయనీ! హరి అలా అన్నం గబగబా తినేసి లేచినందుకు బాధపడుతున్నావా? నువ్వన్నట్టు వాడు ఎదిగాడు. అదృష్టవశాత్తు ఉద్యోగం కూడా వచ్చింది. ఇంకా ప్రతి చిన్న దానికీ మనమే నిర్ణయాలు తీసుకోవాలంటే ఎలా? తండ్రిగా అది నా కనీస ధర్మం కదా! అలా నేను చెప్పకపోయి, తనంతట తనే ఒక స్కూటర్ కొనుక్కొచ్చి చూపిస్తే బావుండేదా నీకు? ” అని అనునయంగా పలికితే వెక్కివెక్కి ఏడ్చింది కాత్యాయని.

గోపాలకృష్ణ కాత్యాయనిని దగ్గరకు తీసుకుని ఓదార్చిన తర్వాత కుదుటపడి “తెలివి తక్కువ మొద్దుని. పెద్ద చదువులు చదవకపో

వడంవల్లనే కదా. నాకిలాంటివి తట్టవు" అంది.

"నువ్వనవసరంగా పెద్ద చదువుల మాట దేనికెత్తుతావు. నాకు మాత్రం పెద్ద పెద్ద డిగ్రీలెక్కడేడ్చాయి? ఉత్త బి.కామే కదా! అయినా చదువుకీ దీనికి సంబంధమేముంది" అంటూ ఓదార్చాడు ప్రేమగా.

'పాపం ఆయనకు నా మీద ప్రేమే. నేనే అనవసరంగా మాటిమాటికీ అత్తగారు, ఆడబిడ్డ అన్న మాటలు గుర్తుకు తెచ్చుకుని బాధపడుతుంటాను, ఆయనని బాధపెడతాను' అనుకుంటూ భర్త నడుం మీద చేయి వేసుకుని నిద్ర పోయింది కాత్యాయని.

* * *

హరి ఉద్యోగంలో చేరి ఏడాది దాటింది. తల్లి మనసు కష్టపెట్టడం ఇష్టంలేక అతడు స్కూటరును కొనడం వాయిదా వేసుకున్నాడు. ఒకరాత్రి భోజనాల దగ్గర హఠాత్తుగా గోపాలకృష్ణ "హరీ! మా ఆఫీసు కూడా మీ ఆఫీసు దగ్గరకు రాబోతోంది, వచ్చే ఫస్టు తారీఖు నుంచి. మా ఫ్యాక్టరీ కొండాపూర్ దగ్గరలో కదా! అందుకని మాదాపూర్‌లో ఒక బిల్డింగ్ ఎవరో అమ్ముతుంటే కొన్నారు కంపెనీ వాళ్లు. ఇక రోజూ నేను నిన్ను దించొచ్చు"

"అయితే ఇక హరి కూడా రోజూ మీలాగే ఎనిమిది దాటాకే వస్తాడన్నమాట" అంది కాత్యాయని వడ్డన కానిస్తూ.

"ఇప్పుడు మాత్రం రెండు బస్సులు మారి వచ్చేటప్పటికి ఇంచుమించు అంతే అవుతోంది కదమ్మా!" అన్నాడు హరి.

"పెద్ద నేనేదో స్కూటరు కొనొద్దు. యాక్సిడెంటులవుతాయన్నందుకేగా నువ్వూ మీ నాన్న లాగ ఎద్దేవా చేస్తున్నావా? నా భయమేదో చెప్పానుగానీ మీ సౌకర్యాలకు నేనేమీ అడ్డుపడడం లేదు. నువ్వే వాయిదా వేసుకున్నావ్" అంది కాత్యాయని.

"ఇక ఇప్పుడా గొడవ దేనికి. ప్రస్తుతానికి నేను వెళ్ళేటప్పుడు దించగలను" అన్నాడు గోపా



## ఆరుద్ర



పరిచయం అక్కరలేని కవి ఆరుద్ర. 'కొండగాలి తిరిగింది గుండె ఊసులాడింది.. గోదావరి వరదలాగా కోరిక చెలరేగింది' అంటూ గోదారమ్మ అందాలను అక్షరాల్లో పొదిగిన ఆరుద్ర కడకు ఆ నదీమతల్లి ఘోషను వేదఘోషతో పోల్చిగానీ తృప్తి పడలేదు. త్వమేవాహం, సినీవాలి, కూనలమ్మ పదాల వంటివి ఆయన కలం నుంచి జాలువారినా సమగ్రాంధ్ర సాహిత్యం ఆయన కీర్తిని దశదిశలా చాటిచెప్పింది. ఇంద్రజాలం, చదరంగం కూడా ఆరుద్రకు ఇష్టమైన అంశాలే. హాస్యప్రియుడు ఆరుద్ర వివిధ సందర్భాలలో రువ్విన చతురోక్తులలో కొన్ని..

### తలవంపులు

ముళ్లపూడి వెంకటరమణగారి పెళ్లికని ఆరుద్రాదులు ఓ పల్లెటూరు వెళ్లారు. ఆడపెళ్లి వారింటికి వెళ్లే దారి అంతా ఇరుకు. బాగా ఎత్తు తక్కువైన గుమ్మాలలో నుంచి వెళ్లాల్సి వచ్చింది. అందరిలాగే బాగా తలవంచుకుని నడుస్తున్న ఆరుద్ర-

'ఆడపెళ్లివారు మగపెళ్లివారికి తలవంపులు తెస్తున్నారే' అంటూ ఓ జోకు పేల్చారు.

అంతే.. వెంటవస్తున్న బృందమంతా పడిపడి నవ్వారు. పెళ్లికొడుకు రమణగారికి ఈ సంగతి తర్వాత ఎవరో చెబితే ఆయన కూడా పొట్టచెక్కలయ్యేలా నవ్వారట.

లక్ష్మణ.
"అంతేకాని నేనూ వచ్చేటప్పుడు ఒక గంట ముందొస్తాను హరిని తీసుకొని అనలేరా" అంది కాత్యాయని.
"నీకెన్నిసార్లు చెప్పాను. ప్రయివేటు కంపెనీలో పనిచేస్తూ కూడా నేనా మాత్రం త్వరగా వచ్చేయగలుగుతున్నాను. కొనుగోలుదారులు మాట్లాడటానికి సాయంత్రంపూటే ఎక్కువగా వస్తారు"
"సరేలెండి. ఇక ఆ సంగతి ఎత్తితే ఒట్టు"
"అమ్మా! నువ్వు కోపం తెచ్చుకోకపోతే ఒక మాట చెప్పనా? " అన్నాడు హరి.
"నా కోపం ఎవర్నేమి చేస్తుంది కనుక. అక్కడికేదో నేనొక రాక్షసిలా మిమ్మల్నందర్నీ కట్టడి చేస్తున్నట్టు! చెప్పరా నాన్నకు" అంది తల్లి.
ఇక్కడి నుంచి అంత దూరం వెళ్ళాలంటే రోజూ నాన్నగారికి పెట్రోలు ఖర్చు పెరుగుతుంది. ఎలాగూ భార్గవికి రెండు నెలల్లో కంప్యూటర్ ఇంజనీరింగ్ అయిపోతుంది. ప్రమీలకు కూడా ఇంకో సంవత్సరంలో ఎమ్.కామ్ పూర్తవుతుంది. వాళ్ళకి కూడా మాదాపూర్ సైడ్‌లోనే ఉద్యోగాలు వెతుక్కోవచ్చు"
"అయితే"
తండ్రి చాలా ఉత్సుకతతో వింటున్నాడు తల్లీ కొడుకుల సంభాషణ.
"ఎలాగూ ఇల్లు సరిపోవడం లేదు. నా స్నేహితులెవరయినా వచ్చినా కూర్చోబెట్టి మాట్లాడటానికి వీలు కావడం లేదు. మొన్న ప్రమీల చదువుకుంటున్నప్పుడు మా కొలీగ్ ఒకతను వస్తే దానికి చదువుకోవడానికి ఇబ్బందయింది" అన్నాడు హరి.
"అది సరే... అసలు చెప్పదలచుకొందేదో చెప్పు త్వరగా" అంది కాత్యాయని.
"మనం మాదాపూర్ వైపే ఇల్లు అద్దెకు తీసుకుంటే బాగుంటుందిగా! ఇదీ అద్దె ఇల్లే కదా!"
"ఇక్కడద్దెకి అక్కడి అద్దెకి పోలికేమిటిరా? అక్కడ పెద్ద ఇల్లు తీసుకుందాం అంటావ్. అంత అద్దె పెట్టగలమా? "
"ఇప్పుడు పెడుతున్న అద్దెకు తోడు మిగతాది నేను పెడతాను"
కొడుకు మాటకు లోపల మురుసుకున్నా పైకి మాత్రం బింకంగా "ఏమోరా, నీ ఇష్టం, మీ నాన్నగారి ఇష్టం" అంది.
"ఇక మాకు ఇష్టం అంటూ లేదా? " అంది భార్గవి.
తల్లీ తండ్రీ తెల్లబోయి చూశారు. అయితే తండ్రి సంతోషించాడు లోలోపలే.
"అన్నయ్య సంపాదిస్తున్నాడు. తన ఇష్టానికి తగ్గట్టు మాట్లాడగలడు" అంది కాత్యాయని.
"సంపాదన లేకపోతే అవసరాలకు సరిపడా ఇష్టాలుండకూడదా? "అంది భార్గవి రోషంతో.
తల్లి అవాక్కయింది. మొట్టమొదటిసారి భార్గవి అలా మాట్లాడేటప్పటికి.
ఆ రాత్రి మళ్ళీ కాత్యాయని దిగులుగా పడుకోవడం చూసి, "కాత్యాయనీ ఎందుకే అలా ఊరికే బాధపడతావు. పిల్లలు పెరుగుతున్నారు. వాళ్ళవసరాలు మనం చూడకపోతే ఎవరు చూస్తారు చెప్పు" అనునయించబోయాడు గోపాలకృష్ణ.
"మీరూ పిల్లలకే వత్తాసు పలుకుతున్నారా? పొద్దున టిఫిన్లు, ఆ తరువాత భోజనాల నుంచి ఎవరికేది ఇష్టమో చేసి పెడతాను. ఒంట్లో బావున్నా బాగోకపోయినా బట్టలుతికి ఇస్త్రీ చేసి పెడతాను. కాలేజీలలో చదువుకుంటున్న పిల్లలు గదా అని వాళ్ల చదువుకి అడ్డు రాకూడదని ఇంటి పని ఏదీ చెప్పను. వాళ్ల అవసరాలు నేనేం చూడడం లేదో చెప్పండి? "
"నువ్వన్నది నిజమే. అన్నీ నువ్వే చేసిపెడతున్నావ్. ఒక పనివాడిని పెట్టుకుంటే బట్టలుతకడం లాంటి పనులు నీకు తప్పుతాయి కదా! కాలేజీలలో చదువుతున్న పిల్లలు ఎవరైనా స్నేహితులు కలిసి చదువుకోవడానికో, కాసేపు కబుర్లు చెప్పుకోవడానికో వస్తే వాళ్ల

కొక గదంటూ ఉండాలి కదా! అలా లేకపోతే ఎవరన్నా వచ్చినపుడు వాళ్లకు చిన్నతనంగా ఉంటుంది. నేనయితే సర్దుకుపోతాను. ఎవ రైనా ఇంటికొస్తానంటే ఆఫీసుకు రండి అంటాను. వాళ్లలా అనలేరు కదా!"

కాత్యాయని చివాలున లేచి కూర్చుని "అయితే అందుకా మీరు ఎవరు వస్తామన్నా వద్దనేది" అంది.

"నీకిప్పటివరకూ ఆ సంగతి అర్థం కాలేదా? "

"అసలే ఆఫీసులో రోజంతా పనిచేసి వస్తా రు. ఇంట్లో ఎవరి గొడవ లేకుండా విశ్రాంతి తీసుకోవాలనుకుంటున్నారనుకున్నాను. అయి నా నాకు తెలియకడుగుతాను. ఇవాళఅయితే మీకొక హోదా వచ్చింది, కారు వచ్చింది. దానికి తగ్గట్టు ఖర్చులూ పెరిగాయి. చదువు లకే తడిచి మోపెడంతవుతోంది. రేపు పెళ్లి ళ్లెలా చేస్తాం, ఉన్నంతలోనే కాస్త వెనక్కు వేసుకోకపోతే"

"నువ్వన్నది నిజమే కాని, ఎంతసేపూ ముందు రాబోయే ఖర్చుల గురించి ఆలో చిస్తూ, ఇప్పుడు మనం కుంచించుకొని బత కడం దేనికి? ఉన్నంతలో ఇంట్లో అందరం సౌఖ్యంగా ఉండగలగాలి"

"సరే, ఇక మీరూ, పిల్లలు ఒకటయినప్పుడు నేనేమనగలను. తీసుకోండి ఏ రాజభవన మైనా అద్దెకు"

"నీ ముఖం. వాళ్లంటున్నది మధ్య తరగతి కుటుంబానికి సరిపడే ఇల్లే. కాస్త సౌకర్యంగా ఉండేది తీసుకోమంటున్నారు" అన్నాడు.

ఆ రోజు తర్వాత ఆవిడ ముభావంగా ఎప్ప టిలాగానే పనిచేసుకుంటూ పోవడం పసిగ ట్టారు పిల్లలు, భర్త. అయితే పూర్వంలాగా "టిఫిన్‌కు రండి, నీళ్లు పోసుకోండి" అంటూ గట్టిగా అరవకుండా మాట మాట్లాడకుండా టైముకు అన్నీ టేబుల్‌మీద అమర్చడం కూడా గమనించి, అందరూ ఏ టైముకాటై ముకు అన్నీ యథా ప్రకారంగా చేసుకుంటూ పోతున్నారు. పూర్వం ఎప్పుడూ అరుపులు కేకలతో దద్దరిల్లే ఇల్లు ఇప్పుడు ఏ చడీ చప్పుడూ లేకుండా నిశ్శబ్దంగా ఉంటోంది. పిల్లలకయితే అది నచ్చిందికాని, గోపాలకృ ష్ణకు అది తుఫాను ముందు నిశ్శబ్దతగా అని పించింది. ఎప్పుడు ఏం జరుగుతుందోనని భయపడుతున్నాడు.




ఆ రోజు ఆఫీ సులో త్వరగా తెమిలి గోపాలకృష్ణ పెందరాళే ఇంటికి చేరుకున్నాడు. ప్రమీల తలుపు తీసింది. అలవాటు చొప్పున అతను కాత్యా యనీ అంటూ పిలుస్తూ వంటింట్లోకి వెళ్లాడు. అక్కడ కనపడకపోతే తమ గదిలోకి వెళ్లాడు. ఏనాడూ అలా వెల్లకిలా పడుకోని కాత్యాయ నిని చూసి "ప్రమీలా" అంటూ కూతుర్ని కే కేసాడు.

తండ్రి కేక వినగానే ప్రమీల పరుగెత్తు కుంటూ వచ్చింది. సామాన్యంగా పిల్లలెవరూ ఆ గదిలోకి రారు. ఇంతలో భార్గవి కూడా వచ్చి తల్లిని చూసి ప్రాన్పడిపోయింది. కంగారు పడింది.

"ఏమయింది అమ్మకు" అని అడిగింది ప్రమీలను తగ్గు స్వరంతో.

ఫోను చేయగానే ఆ వీధి చివరన చిన్న డిస్పెన్సరీ నడుపుకుంటున్న డాక్టరు నారాయ ణరావు వచ్చాడు.

కాత్యాయనిని పరీక్షించి రావడంతోనే "గది లోకి అసలు గాలి రావడం లేదు. ఫ్యాను గాలి చాలా వేడిగా ఉంది. చల్లటి నీళ్ళల్లో ఒక బట్ట ముంచి తెండి. జ్వరం కాస్త ఎక్కు వగానే ఉంది" అన్నాడు.

"ఎంతుంది డాక్టర్" అడిగాడు గోపాలకృష్ణ.

"103 డిగ్రీలుంది" అంటూ చల్లటి బట్ట అందుకొని ఆమె నుదుటి మీద పరిచాడు. పది నిమిషాల్లో కళ్లు తెరిచింది కాత్యాయని. "ఏమయింది నాకు" అని అడిగింది అందర్నీ చూసి.

"ఏమీ కాలేదు. కొంచెం జ్వరం వచ్చిందంతే. కాసేపు కళ్ళు మూసుకు పడుకోండి" అని డాక్టరు లేచి "బట్ట తడి ఆరగానే మళ్ళీ చల్లటి నీళ్లల్లో ముంచి నుదురుమీద పెట్టండి. రెండు ఐస్ ముక్కలు వేయండి నీళ్లల్లో ఎప్పటికప్పుడు" అని పురమాయించి ముందు గదిలోకి వెళ్లాడు. అక్కడున్న పాత సోఫాలో కూర్చుని ప్రిస్కిప్షన్ రాస్తూ "ఆవిడ చాలా నీరసంగా కనబడుతున్నారు. హిమోగ్లోబిన్ చాలా తక్కువగా ఉన్నట్లుంది- ఆవిడ శక్తికి మించిన పని చేస్తారా? " అని అడిగాడు.

"అవును.. అన్ని పనులూ తనే చేసుకుంటేనేగానీ ఆవిడకు తృప్తి ఉండదు. పిల్లల పని కూడా తనే చేస్తుంది" అన్నాడు గోపాలకృష్ణ.

"మన మధ్యతరగతి కుటుంబాలలో గృహిణులు చాలామంది ఇలాగే ఆరోగ్యం పాడుచేసుకుంటారు. ఒక్కొక్క ఏడు పైబడ్డ కొద్దీ శరీరంలో శక్తి తగ్గుతుంది కదా! అంతా 'విల్ పవర్'తో నడిపిస్తారు. కొన్నేళ్లపాటు ఆవిణ్ణి కష్టమైన పనులు చేయనీయకండి. జ్వరం రెండు మూడు రోజుల్లో తగ్గుతుంది. విటమిన్లు, ఐరన్ ఇంకా బలమైన ఆహారం తీసుకోవాలి. ఆవిడకు మందుల కంటే విశ్రాంతి, పౌష్టికాహారం అవసరం" అన్నాడు డాక్టర్.

"పొద్దుట బాగానే ఉంది. ఇంత అకస్మాత్తుగా ఎలా జ్వరం వచ్చిందంటారు? " అడిగాడు గోపాలకృష్ణ.

"ఇది అకస్మాత్తుగా రాలేదు. కొద్దికొద్దిగా జ్వరంగా ఉన్నా ఆవిడ ఖాతరు చేసినట్టు లేరు. ఆవిడకీ మధ్య ఆందోళన కలిగే వ్యవ

## ప్రాణం కూడా తీస్తుందట!

ప్రాణం పోసే ఆక్సిజన్ ప్రాణం తీస్తుందంటున్నారు హరిప్రసాద్ మిశ్రా.

సూర్యుడు ప్రపంచాన్ని తట్టిలేపేవేళ ఆక్సిజన్ ఎంత ఎక్కువగా పీల్చుకుంటే అంత మంచిదని భావిస్తాం. కానీ ఒరిస్సాకి చెందిన హరిప్రసాద్ మిశ్రా అనే శాస్త్రజ్ఞుడు మనిషికి ఆక్సిజన్ ఎక్కువైనా హానికరమే అని తన పరిశోధనల్లో కనుగొన్నారు. ఎక్కువగా పీల్చిన ఆక్సిజన్ డి.ఎన్.ఎ. మీద ప్రభావం చూపటం వల్ల క్యాన్సర్, అల్జీమూర్, పార్కిన్‌సన్ వంటి వ్యాధులు వచ్చే అవకాశం ఉంటుందని ఆయన హెచ్చరిస్తున్నారు. ఎక్కువగా పీల్చుకున్న ఆక్సిజన్ కణాలతో చర్య చెందటం వల్ల ఆర్థ్రయిటిస్, మనోవైకల్యం వచ్చే అవకాశం కూడా ఉందట. అధికంగా పీల్చుకున్న ఆక్సిజన్ వ్యాధి నిరోధక వ్యవస్థ మీద దుష్ప్రభావం చూపుతుంది. మోతాదు మించినప్పుడు ఆక్సిజన్ విడిపోయి వివిధ అణువుల్ని ఏర్పరుస్తుంది. ఈ అణువులే వ్యాధి కారకాలుగా రూపాంతరం చెంది పైన పేర్కొన్న వ్యాధులకి కారణమవుతున్నాయట.

దేశీయంగా లభించే పసుపు, చింతపండు ఎక్కువైన ఆక్సిజన్‌ను నియంత్రిస్తాయని మిశ్రా చెప్తున్నాడు. దీనిమీద ఇంకా పరిశోధనలు జరుగుతున్నాయి.



హారం ఏమయినా జరిగిందా? కొందరు పైకి చెప్పేసి ఊరటపడతారు. అలా కాకుండా లోలోపలే బాధ పడితే ఇలా జరిగే అవకాశం ఉంది. ఏమయినా ఆవిడ చేత పని ఎక్కువ చేయనీయకండి"

"ఎంత మొత్తుకున్నా పని మనిషిని కూడా పెట్టుకోదండి మా అమ్మ" అని చెప్పింది ప్రమీల.

"తల్లి అంటే అంతేనమ్మా. పిల్లలు, సంసారం కోసం అలా తమ సంగతి చూసుకోకుండా సంవత్సరాల తరబడి గడిపేస్తుంటారు. మరీ తట్టుకోలేని పరిస్థితుల్లో ఇలా జబ్బు పడుతుంటారు. మీరంతా తలా ఒక పని అందుకొని ఆవిడకు విశ్రాంతి నివ్వండి" అని డాక్టర్ చనువుగా బుద్ధులు చెప్పి వెళ్లిపోయాడు.

డాక్టరుగారిని పంపి గోపాలకృష్ణ లోపలకు వచ్చి మంచం పక్కనే కూర్చుని చల్లటి బట్ట మార్చి మార్చి కాత్యాయని నుదుటి మీద పెడుతూ ఉన్నాడు.

కాత్యాయని నెమ్మదిగా కళ్లు తెరిచి లేవబోయింది. "ఇదిగో ఈ క్రోసిన్ టాబ్లెట్ వేసుకుని కాఫీ తాగు' అన్నాడు గోపాలకృష్ణ, ప్రమీల తన చేతిలో పెట్టిన కాఫీ కప్పును ఆమె నోటి కందిస్తూ.

"పిల్లలు ఖంగారుపడిపోయారు. నువ్విలా మంచం మీద పడిపోయి ఉంటే" అన్నాడు.

కాఫీ సగం తాగి "ఇక చాలు. నాకేమీ కాలేదు. మందు బిళ్ల వద్దు" అంటూ మంచం దిగబోయింది కాత్యాయని.

ఆవిణ్ణి వారించి, "ఇందాకటి నుంచి నుదుటి మీద చల్లటి బట్ట వేస్తే ప్రస్తుతానికి కాక తీరి జ్వరం తగ్గినట్టుగా అనిపిస్తోంది నీకు. మందు వేసుకోకపోతే మళ్ళీ మొదటికి వస్తుంది" అని బలవంతం చేసి క్రోసిన్ బిళ్ల మింగించాడు గోపాలకృష్ణ.

భర్త చేయిపట్టుకుని "భార్గవి వచ్చిందా? " అని అడిగింది.

"ఇక్కడే ఉందే? ఎక్కడికి వెళ్ళింది" అన్నాడు.

"దాన్నే అడగండి" అని కళ్ళు మూసుకు పడుకుంది. రెప్పల నుంచి కన్నీటి చుక్కలు కణతల మీదుగా దిండుమీదకి కారాయి.

ఆ కన్నీళ్ళు చూసి గోపాలకృష్ణ తుళ్ళిపడ్డాడు. "ఏమయింది కాత్యాయనీ? దేనికీ ఈ ఏడుపు. నీకేం కాదు. కాసేపు విశ్రాంతిగా పడుకో. రేపటికి హాయిగా లేచి తిరుగుతావు" అన్నాడు.

"నాకేదో అవుతుందని నేనేమీ భయపడడం లేదు. నా బెంగంతా మీ అందర్నీ గురించే" అంది నీరసంగా.

"నువ్వు ఆరోగ్యంగా ఉన్నంత వరకు మాకెవ్వరికీ ఏమీ కాదు. నువ్విలా మంచం మీద పడితే పిల్లలు బెంబేలు పడిపోతారు. ఇక పడుకో" అని తల నిమురుతూ ఆవిడ నిద్రలోకి జారుకునే వరకు పక్కనే కూర్చున్నాడు. తర్వాత లేచి ముందు గదిలోకి వచ్చాడు.

హరి రాగానే "మీ అమ్మ లేచేవరకు హోటల్ నుంచి టిఫిన్, భోజనం తీసుకురా. ఎందుకైనా మంచిది, ఈ రెండు రోజులూ నువ్వు మీ బాస్ నడిగి త్వరగా వచ్చేయ్" అని చెప్పాడు. ఇంతలో ప్రమీల కాఫీ కప్పుతో వచ్చింది. "నాన్నగారూ. అన్నం ఇంట్లో వండుతాం. ఈ వీధి చివర ఒకావిడ కూరలు చేసి అమ్ముతుంది. అక్కడి నుంచి తెప్పించుకోవచ్చు మీరేమీ గాభరా పడకండి" అంది భరోసా ఇస్తున్నట్టు.

గోపాలకృష్ణ మెచ్చుకోలుగా చూశాడు కూతురు వంక. "ఇంతకీ భార్గవి ఎక్కడికి వెళ్ళింది? అమ్మ ఆరాటపడింది" అన్నాడు.

"అక్కకి రేపు పరీక్ష వుందట. దానికోసం అర్జంటుగా నోట్సు కావలసి వస్తే స్నేహితురాలి దగ్గరకు వెళ్ళి తెచ్చుకుంటానందట. నోట్సు కావాలని ఇప్పుడు గుర్తుకొచ్చిందా? పగలంతా ఏం చేశావ్? రాత్రిపూట ఆడపిల్లలు తిరగడం నాకిష్టం ఉండదు. తిరిగివచ్చేవరకూ ఆరాటంగా ఉంటుంది. నీకేమయినా అయితే, నాన్నగారు, హరి కూడా

ఇంట్లో లేరు అని అమ్మ కేకలేసిందట. అక్క నవ్వి ఏడు గంటలకే నన్నేవరేమి చేస్తారమ్మా? కాల్ సెంటర్లలో రాత్రిళ్ళు పని చేసే వాళ్ల మాటేమిటి? అందట. అయినా అమ్మ ససేమిరా అనడంతో అక్కకు కోపం వచ్చి, ఎక్కడో ఏదో జరిగిందని మాకేదో అయిపోతుందని ఎందుకమ్మా అనవస రంగా గాభరా పడతావు. నీకంత ఇష్టం లేక పోతే వెళ్లనులే. పరీక్ష పోతే పోనీలే అని మాట్లాడకుండా కూర్చుందట. పరీక్ష పోవ డం అనే మాట వినేసరికి చివరికి అమ్మ సరేలే వెళ్ళిరా అని పంపించిందట."

"ఆ టెన్షన్ కూడా కొంత కారణం కావొచ్చు జ్వరం రావడానికి" అన్నాడు గోపాలకృష్ణ.

"మనం ఈ మధ్య ఇల్లు మారదాం అన్న ప్పటి నుంచి అమ్మ ముభావంగా ఉంటోంది. పూర్వంలాగా ఎవరి మీదా కేకలు వేయడం లేదు. మనం తనని లెక్కచేయడం లేదని బాధపడుతోందనిపిస్తోంది నాన్నగారూ" అంది భార్గవి వంటింట్లో నుంచి వస్తూ.

"నిజమే నాకూ అలాగే అనిపిస్తోంది" అన్నాడు హరి.

"నామీద ఇవాళ అమ్మకు చాలా కోపం వచ్చింది. పరీక్ష పోతే పోనీలే అన్నానని 'నువ్వు ఎదిరించడం నేర్చుకున్నావా? మా అంతటివాళ్ళు మీరయ్యారు. నా అవసరం మీకెవరికీ ఉన్నట్టు కనపడటం లేదు. వెళ్ళు. నీ పరీక్షకేమయినా అయితే అది నేను భరిం చలేను అంటూ నేను వెళ్ళే వరకు ఊరుకో లేదు" అంది భార్గవి.

"నువ్వెప్పుడొచ్చావ్ భార్గవీ? ఏదో తన మనసుకి గట్టి ఆఘాతం తగిలిందని నేను ముందే అనుకున్నాను" అన్నాడు తండ్రి.

"మీరు అమ్మ దగ్గర వుండగా వచ్చాను. ఇలాగయితే మేం ఎలా చదువుకోవాలి నాన్న గారూ. పరీక్షలలో ఎలా మంచి మార్కులతో పాసవ్వాలి. కాస్త చీకటి పడితే ఎవరింటికీ వెళ్ళగూడదు. మరీ చిన్నపిల్లలం కాముగా. స్పెషల్ క్లాసుకు వెళ్లినా, 'త్వరగా వెళ్లవే. మీ అమ్మగారు కేకలేస్తారు' అంటూ మా స్నేహి తులు హేళన కూడా చేస్తున్నార'ని నిష్ఠూర మాడింది భార్గవి.

"అది కాదమ్మా. ఈ మధ్య టీవీలలో ఆడపిల్లల గురించిన రకరకాల ఘటనలను చూపిస్తున్నారు కదా! అందులోనూ మీరిద్దరూ నదురుగా ఉంటారు. దాంతో మీ అమ్మకు మరీ భయం కలుగుతుంటుంది" అన్నాడు తండ్రి అనునయంగా.

మీరిద్దరూ నదురుగా ఉంటారన్న మాట విని ప్రమీల భార్గవిలిద్దరూ ఒకరినొకరు చూసుకుని సిగ్గుతో తలవంచుకొని లోపలికి వెళ్లిపోయారు. హరి క్యారియర్ తీసుకుని బయటకు వెళ్లాడు. గోపాలకృష్ణ కాత్యాయనికి ఎలా ఉందో చూడడానికి ఆవిడ దగ్గరకు వెళ్ళాడు.

* * *

మరుసటిరోజు హరి ఆఫీసులో వేదవల్లి దగ్గరకు వెళ్లి "మేడమ్, రెండు రోజులు సెల వు కావాలి" అనడిగాడు.

వేదవల్లి వివరాలు అడగడంతో తల్లికి ఒంట్లో బాగోలేని సంగతి చెప్పాడు.

అతడు చెప్పింది విని వేదవల్లి బెల్ నొక్కి ప్యూన్‌ని పిలిచింది. "చూడు నిన్న మీ అక్క వచ్చిందన్నావ్ కదా" అని అడిగింది.

"అవునమ్మగారూ. దానికి పుట్టిన పిల్లలి ద్దరూ పోయారు. నలభై ఏళ్ల తర్వాత ఇక నీకు పిల్లలేం పుడతారు అని దీన్నొగ్గేసి మొగు డు ఇంకో పెళ్ళి చేసుకుంటే అది నా దగ్గరకు వచ్చేసింది" అన్నాడు.

"ఇప్పుడు మీ అక్కని ఏం చేద్దామనుకుంటు న్నావ్?"

"కొన్నాళ్లు నా దగ్గరే పెట్టుకుని ఏదైనా పనిలో పెడదామనుకొంటున్నాను"

"ఏం పని చేస్తుంది?"

"ఇంకే పని చేస్తుందమ్మా ఇంటి పని తప్పిస్తే. ఇందాక మీకు నేను తెచ్చిన చాయ్ తనే చేసింది"

"టీ బావుంది. హరిబాబుగారింట్లో పనిచే

స్తుందా? "

"అడుగుతానమ్మా. మనకు తెలిసిన బాబు గారింట్లో అయితే భయమేముండదమ్మా. అసలే పల్లెటూరిది"

"హరీ, నువ్వు త్వరగా వెళ్ళాలన్నావు కదూ!" అని రంగయ్య వైపు తిరిగి "విషయం చెప్పి మీ అక్కని తీసుకురా" అని పంపేసింది అతణ్ణి.

"మేడమ్. చాలా థాంక్స్. మా పట్ల మీరు చాలా శ్రద్ధ తీసుకుంటున్నారు. కానీ మా అమ్మ ఏమంటుందో తెలియదు" అన్నాడు తల్లి తత్వం గుర్తుకొచ్చి

"ఆవిడ ఏమన్నా ఆవిడ ఆరోగ్యం కాపాడాల్సిన బాధ్యత కొడుకుగా నీకూ ఉంది కదా! డాక్టరు ఆవిడకు విశ్రాంతి అవసరమన్నాడు. నువ్వు ఆఫీసుకు రావాలి. నీ చెల్లెళ్ళిద్దరూ కాలేజీకి పోవాలి. పనిచేయడానికి చేతి కింద ఎవరూ లేకపోతే ఇక ఎలా విశ్రాంతి దొరుకుతుందావిడకు".

"జీతం మేడమ్..."

"నేను తర్వాత రంగయ్యతో మాట్లాడి చెబుతాలే. నీ తాహతుకు మించేమీ కాదు" అంది వేదవల్లి నవ్వుతూ.

రంగయ్య తన అక్కని తీసుకువచ్చాడు. ఆవిడ తన వంక చూస్తోందో, మేడమ్ వంక చూస్తోందో అర్థం కాలేదు హరికి. అంత మెల్ల. అసలు అది కూడా కొంత కారణం అయి ఉంటుంది, భర్త ఇంటినుంచి వెళ్ళగొట్టడానికి. "వయసా నలభై అయిదు. ఇక పిల్లల్ని కనే యంత్రంగా కూడా పనిచేయదు. అందునా మెల్లకన్ను, ఎత్తు పళ్ళు. ఎలాగో అన్నేళ్ళు భరించి సందు దొరకగానే వదిలించుకొన్నట్టున్నాడు భర్త" అనుకున్నాడు హరి.

"ఏమంటావు హరీ" అంది వేదవల్లి.

"మీ ఇష్టం మేడం" అన్నాడు.




"సత్తెమ్మా. నువ్వు చేసిన చాయ్ బాగుంది. ఇక్కడ మాకొక వంటావిడ ఉంది కదా. నువ్వు ఈ బాబుగారింట్లో పనిచేయాలి" అని హరితో సత్తెమ్మని పంపింది.

హరి ఇంటికిరావడంతోనే "రా అన్నయ్యా. నీ కోసమే చూస్తున్నాను. అమ్మకింకా జ్వరం ఉంది. నువ్వొచ్చాక మధ్యాహ్నం నుంచి క్లాసులకు వెళదామని ఆగిపోయాను" అంటూ తల్లి పక్కన కూర్చున్నదల్లా లేచింది భార్గవి.

తల్లి చూడకుండా భార్గవిని ముందు గదిలోకి రమ్మనట్టు సైగ చేశాడు హరి. 'ఏమిటబ్బా' అనుకుంటూ భార్గవి ముందు గదిలోకి వచ్చింది హరి వెంట.

అక్కడున్న రంగమ్మను చూసి "ఈవిడెవరు? ' అంది నెమ్మదిగా హరితో.

"మా వాచ్‌మెన్ వాళ్ల అక్క. అమ్మను చూసుకోవడానికి, పనిలో సాయం చేయడానికి మా మేడమ్ గారు కుదిర్చారు" చెప్పాడు హరి.

"నీ పేరేంటి" అడిగింది భార్గవి.

"సత్తెమ్మ. సత్తి అంటారమ్మా అందరూ".

భార్గవి వస్తున్న నవ్వునాపుకొని "మేం సత్తెమ్మ అనే పిలుస్తాంలే" అంటూ ఆమెను వంట గదిలోకి తీసుకువెళ్ళింది. తర్వాత ఉన్న రెండు చిన్న గదులూ చూపించింది.

"ఇల్లింకా ఎవరూ ఊడ్చినట్టు లేదు. చీపురెక్కడుందమ్మా, ముందు తుడుచుకొస్తాను" అంది సత్తెమ్మ పని అందుకుంటూ.

ఫరవాలేదు... పనిచేసే రకమేలే అనుకుని భార్గవి సత్తెమ్మకు మిగతా పని వివరాలన్నీ చెప్పింది.

"అయితే అమ్మాయిగారూ, నేను వండితే మీరు తింటారా అమ్మా" అని అడిగింది సత్తెమ్మ.

గొంతులో పచ్చి వెలక్కాయ పడినట్టయింది భార్గవికి ఆ ప్రశ్నతో. 'ఏమిటన్నట్టు' హరి వంక చూసింది.

"సత్తెమ్మా మిగతా పనులన్నీ చేయి. అమ్మకు జ్వరం తగ్గేవరకూ బయటనుంచి కూరలవీ తెచ్చుకుంటాం. వంట నువ్వు చేయ నక్కర్లేదు. అంట్లు తోమి, బట్టలుతికి మిగతా చిన్న చిన్న ఇంటి పనులు చూసుకుంటే చాలు" అన్నాడు హరి.

"అన్నయ్యా, మాకంటే నీకే ఎక్కువ ఇంటి పనుల సంగతి తెలుసే" అని భార్గవి ఆటలు పట్టించింది.

"ఈ రోజుల్లో అన్ని పనులూ అందరికీ తెలి యాలి. మగపనులు, ఆడ పనులు అంటూ ఉండవు ఇక నుంచి" అన్నాడు హరి తల్లి గది లోకి వెళుతూ.

వెళ్ళీ వెళ్లగానే "ఎవరితోరా మాట్లాడుతు న్నావు" అనడిగింది కాత్యాయని.

"నీకు ఒంట్లో బాగా లేదని, డాక్టరు బాగా విశ్రాంతి తీసుకోవాలన్నారనీ చెబితే ఇంట్లో నీకు సాయంగా ఉంటుందని మా మేడమ్ గారు పనమ్మాయిని కుదిర్చి పంపిచారు." అన్నాడు హరి.

"పనమ్మాయా! దేనికి? రేపటికి జ్వరం తగ్గి పోతుంది. పనులు చేసుకోగలుగుతాను. ఈ చిన్నింట్లో దాన్ని కూడా ఎక్కడ వుంచుకోగ లం" అందావిడ.

"ముందు గదిలో పడుకుంటుందిలే. నువ్వు గొడవ పడకు. మేం చూసుకుంటాంలే అవ న్నీ" అన్నాడు.

"ఏం చూసుకుంటారు? మీకేం తెలుసు నని? "

"అవస



రమొస్తే అన్నీ తెలుస్తాయి. నువ్వివన్నీ పట్టించుకోకుండా విశ్రాంతి తీసుకో"

"అది కాదురా... ఇంట్లోనే ఉండిపోయే మనిషయితే తిండీ బట్టా ఇవ్వాలి. పైగా జీతం ఇవ్వాలి. ఎంత ఖర్చో ఆలోచించావా? "

"అమ్మా! నువ్వు ఖర్చు గురించి ఆలోచించకు"

"ఆలోచించకపోతే ఎలారా? ఎన్ని ఖర్చులని భరిస్తారు మీ నాన్నగారు? "

"అది నేను చూసుకుంటానన్నాను గదా!"

"నువ్వూ సంపాదనపరుడవయ్యావని తెలుసులే. అటు పెద్దిల్లు తీసుకోవాలంటావు, ఇటు ఇరవై నాలుగు గంటలూ ఇంట్లో పడిఉండే పని మనిషిని పెడతానంటావు. నీ జీతం అంతా ఇంటి ఖర్చుకే పెడితే ఎలారా? రేపు నీ పెళ్లయితే మీ ఆవిడ ఊరుకుంటుందా? ఇలా ఇంటి కింద నీ సంపాదన తగలేస్తూ ఉంటే"

"ఇప్పుడు నా పెళ్ళి సంగతెందుకూ? ముందు చెల్లెళ్ళ పెళ్ళిళ్ళు కావాలి కదా? "

"వాటి కోసమయినా కాస్త డబ్బు వెనకేయాలి కదరా!"

"అమ్మా! మంచి సంబంధాలు రావాలన్నా ఇంట్లో కాస్త హంగులుండాలమ్మా. ఈ రోజుల్లో అలా లేకపోతే కష్టం"

"నిజమేరా! అది నాకు తట్టనే లేదు." అని క్షణం అలోచించి "అయి తే మీ ఆఫీసుకు దగ్గరలో ఇల్లు చూడు. మీ నాన్నగారికి కూడా రోజూ అంత దూరం కారు నడపడం తగ్గుతుంది, ట్రాఫిక్‌లో కారు నడి పే కంటే రెండు బస్సులు మారినా పరవా లేదనిపిస్తోందంటున్నారు నాన్నగారు"

"అక్కడ చాలా అపార్ట్‌మెంట్స్ వచ్చాయమ్మా. కావాలనుకుంటే ఒకటి రెండు రోజుల్లోనే దొరికిపోతుంది ఇల్లు" అంటూ లేచి టాబ్లెట్, మంచి నీళ్ళు అందించాడు తల్లికి.



రాత్రి గోపాలకృష్ణ ఇంటికొచ్చి కాల్ బెల్ నొక్కేసరికి సత్తెమ్మ తలుపు తీసింది. ఆ అపరిచితురాలిని చూసి, పొరపాటున వేరే ఇంటికి రాలేదు కదా అని తికమక

పడ్డాడు. ఇంతలో హరి వచ్చి తండ్రి పరిస్థితి చూసి నవ్వుతూ "మనిల్లే... ఈవిడ పేరు సత్తెమ్మ. ఇకనుంచి అమ్మకు సాయం చేస్తూ మనింట్లోనే ఉంటుంది" అని తండ్రికి విషయం చెప్పాడు.

"ఇదుగో సత్తెమ్మా... ఈయన పెద్దయ్యగారు, అంటే మా నాన్నగారు. నాన్నగారి చేతిలోని ఆ పెట్టె తీసుకుని లోపల పెట్టు" అన్నాడు. గోపాలకృష్ణ సంకోచంగా బ్రీఫ్‌కేస్ సత్తెమ్మ చేతికిచ్చాడు.

సత్తెమ్మ వెనకాలే గోపాలకృష్ణ భార్య మంచం దగ్గరకు నడిచాడు "ఎలా ఉంది కాత్యాయనీ?" అంటూ.

"పరవాలేదు. బాగానే ఉంది. మీరు రాగానే పనమ్మాయి బ్రీఫ్ కేస్ కూడా పట్టుకొచ్చేసిందే ఏకంగా గదిలోకి" అంది.

"పాపం ఆ అమ్మాయికేం తెలుసు. హరే పురమాయించాడు"

"మీ పనులు నేను చూసుకుంటానులెండి. దానికి పనిమనిషి అవసరం లేదు" అంది కాత్యాయని.

"అయ్యగారూ, చాయ్ తెమ్మంటారా?" అంది సత్తెమ్మ.

"నేను తెచ్చానులే" అంటూ హరి లోపలికి వచ్చాడు టీ కప్పుతో.

సత్తెమ్మ అలాగే గోపాలకృష్ణను చూస్తూ నిలబడిపోయింది, పల్లెటూరి ధోరణిలో. అది చూసి హరి "సత్తెమ్మా! నువ్వు వెళ్లి పనేమన్నా ఉందేమో చూసుకో" అని పంపించేశాడు అక్కడి నుంచి, తల్లి మనస్తత్వం తెలిసినవాడు కనుక.

"హరీ! ఏం పనులు చెయ్యాలో సత్తెమ్మకు నువ్వే చెబుతున్నావని చెప్పింది భార్గవి. ఈ గదిలో పని, మీ నాన్నగారి పని నేను చూసుకుంటాలే. తర్వాత వంట గదిలో పనీ, వంట కూడా నేనే చూసుకుంటాను. మిగతా గదులు, మిగతా పని తనకి చెప్పు" అంది కాత్యాయని.

ఆ మాటలు విన్నాక గోపాలకృష్ణకి కాస్త ఊపిరాడింది. అదృష్టవశాత్తు మెల్లకన్ను, ఎత్తు పళ్ళు నలభై, యాభై ఏళ్ళ మనిషి కనుక సరిపోయింది. కాస్త అందంగా ఉన్నా, వయసులో వున్నా అసలు కాత్యాయని ఇంట్లో పెట్టుకోవడానికి ఒప్పుకునేదే కాదు అనుకున్నాడు.

"హరి వ్యవహర్తయి పోయాడు. నిర్ణయాలన్నీ తనే తీసేసుకుంటున్నాడు" అంది కాస్త నిష్ఠూరంగా కాత్యాయని.

"మంచిదేగా మనకి. నిజంగా సంతోషించాలి మనం" అన్నాడు గోపాలకృష్ణ.

"నిన్న మొన్నటి పిల్లలు, ఇవాళ మనతో సంప్రదించకుండా పెద్దరికాలు వెలగబెడుతుంటే ఏమిటోగా ఉంది"

"పిల్లలు మనంతటివాళ్ళయ్యాక వాళ్ళని స్నేహితుల్లాగా చూడాలి తల్లిదండ్రులు"

"ఇంకా నయం. పెద్దా చిన్నా అంటూ ఇక లేనట్టేనా? ఎంత పెద్ద వాళ్లయినా తల్లిదండ్రులను మించిన పెద్దవాళ్ళు కారుగా"

"పోనీలే ఇప్పుడవన్నీ ఆలోచించకు నీ ఆరోగ్యం కుదుటపడనీ" అంటూ గోపాలకృష్ణ స్నానం చేయడానికి లేచాడు.




హరి తండ్రి పేరుతో మాదాపూర్‌లోనే ఒక అపార్టుమెంటులో ఓ ఫ్లాట్ తీసుకున్నాడు. భార్గవి పరీక్షలయి పోవడంతో ఇక కాలేజీకి వెళ్ళే పనిలేదు. ఎటొచ్చి ప్రమీలకే కాస్త ఇబ్బంది. అయితే అపార్ట్‌మెంటు చూడగానే "అన్నయ్యా నా కాలేజీకి దూరమయినా పరవాలేదు. ఇల్లు బావుంది" అంది. తండ్రి ఆరు నెలల అద్దె అడ్వాన్స్‌గా ఇచ్చినా హరి మాత్రం ప్రతి నెలా తనే ఏడువేల రూపాయల అద్దె కట్టేయడానికి నిర్ణయించుకు

న్నాడు. మిగతా మూడు వేలూ చేతిలో ఉంటాయి కనుక పరవాలేదనుకున్నాడు. తన ఆఫీసు ఒక కిలోమీటరు దూరంలోనే ఉంది. గోపాలకృష్ణకి రెండు కిలోమీటర్ల దూరంలోనే ఆఫీసు.

భార్గవి రిజల్ట్సు వచ్చాయి. డిస్టింక్షన్‌లో పాసయింది. వెంటనే ఉద్యోగాల వేటలో పడింది. కాత్యాయని మాత్రం 'ఇక వరుడి వేటలో పడాలి' అనుకుంది. అనుకుందే తడవుగా భర్తను వేధించడం మొదలు పెట్టింది. భార్గవి ఎక్కువగా మాట్లాడదు. మాట్లాడిందంటే చాలా ఖచ్చితంగా ఉంటాయి ఆ మాటలు. ఒకరోజు రాత్రి భోజనాల దగ్గర "నాన్నగారూ! నేనిప్పుడప్పుడే పెళ్ళి చేసుకోను. కనీసం రెండేళ్ళయినా, ఎవరి గొడవా లేకుండా ఉద్యోగం చేస్తాను" అంది.

"విన్నారా దాని మాటలు" కూర వడ్డిస్తూ భర్తతో అంది కాత్యాయని.

"అమ్మా! నువ్వు ప్రతి దానికీ అడ్డు చెప్పకు. సంబంధాలు చూడమని నాన్నగారిని వేధించకు. కనీసం రెండేళ్ళ వరకు నేను చస్తే పెళ్ళి చేసుకోను" అంది భార్గవి ఖచ్చితంగా.

"ఇక నీ మాటకు ఎదురు చెప్పే సాహసమా నాకు!మా అంతటి వాళ్ళయ్యారు. ఏది ఎలా జరగాలని ఉంటే అలా జరుగుతుంది" అంది కాత్యాయని ముఖం గంటు పెట్టుకుని.

ఆ రాత్రి గోపాలకృష్ణకు భార్యను సముదాయించడమే సరిపోయింది. తల్లీ కూతుళ్ళ మధ్య మాటలంతగా లేవు ఆ తర్వాత.

ఒక రోజున రాత్రి భోజనాల దగ్గర "నాన్నగారూ నాల్గవ నెంబరు అపార్టుమెంటులో ఉంటున్నాడే నా కొలీగ్. అతను మన ప్రమీల రోజూ కాలేజీకి వెళ్ళడం చూస్తున్నాడట. అతనికి తను నచ్చినట్టుగా ఉంది" అన్నాడు హరి.

"ప్రదీపా? ఒకటి రెండుసార్లు మనింటికి వచ్చాడు నీ కోసం, అతనేనా? " అంది తల్లి.

"ఊ! అతనే"

"అతను వచ్చినప్పుడల్లా ప్రమీలే తలుపు తీసిందనుకుంటా..." అంది. కాత్యాయని గుర్తు తెచ్చుకుంటూ.

"ఉండొచ్చు ఆ మాట అతనేమీ నాకు చెప్పలేదు. మన కుటుంబ విషయాలు అవీ అడిగాడు, చెప్పాను" అన్నాడు హరి.

"మంచిదే... వరుణ్ణి వెతికే పని తప్పుతుంది" అన్నాడు గోపాలకృష్ణ నవ్వుతూ.

"బావుందండీ సంబడం. కొడుకేదో చెప్పటం, తండ్రి తందాన తాన అనడం. అసలు కులం ఏమిటో... తల్లిదండ్రులెవరో... కుటుంబం ఎలాంటిదో చూడొద్దా? " అందావిడ.

"ఆ వివరాలన్నీ తెలుసుకుంటాలే. ముందసలు మనం ఫరవాలేదు అనుకుని ముందుకు వెళదామా వద్దా చెప్పండి" అన్నాడు హరి.

"అది సరేరా. భార్గవి మాటేమిటి? ముందు దాని పెళ్ళి కావాలి కదా! అదేమో కనీసం రెండేళ్ళవరకూ ససేమిరా చేసుకోనంటోంది" అంది కాత్యాయని.

"సరేలేమ్మా... అతను ఇంకా ముందుకు వచ్చి మాట్లాడినప్పుడు చూద్దాంలే" అని అక్కడికా సంగతి ఆపేశాడు హరి, అట్టే తర్జన భర్జనలకు తావీయకుండా.

ఆ రాత్రి భార్యకు నచ్చచెప్పేటప్పటికి గోపాలకృష్ణ తల ప్రాణం తోకకు వచ్చింది.

అయినా ఆవిడ మాట ఆవిడదే. "చిన్న పిల్లకు సంబంధం ముందు కుదిరిందని తెలిస్తే, పెద్ద పిల్లలో ఏదో లోపం ఉండి ఉంటుందనుకుంటారు. ఇక దానికి సంబంధాలు వస్తాయా? " అంది.

"హరి ఏదో అన్నాడు. అప్పుడే చిన్నదాని పెళ్ళి కుదిరిపోయినట్టు మాట్లాడతావేంటి కాత్యాయనీ. నువ్వనవసరంగా ఆలోచించుకుని హైరాన పడిపోతావ్. పడుకో. మళ్ళీ పొద్దున లేవగానే నీ పని నీకుంటుందిగా.

"మీ కొడుకు సత్తెమ్మని పెట్టాడుగా. నాకున్నదల్లా వంటొక్కటే. అలాంటప్పుడు కాస్త పిల్లలకిష్టమయిన టిఫిను, కూరలయినా

చేయకపోతే నేనుండి ఎందుకు ఇంట్లో?"

"హరి నీ కొడుకు కాడా ఏమిటి? అది సరే సత్తెమ్మ పని బాగా చేస్తోందా?"

"ఆ! బాగానే చేస్తోంది. తర్ఫీదు ఇవ్వడానికి టైము పట్టిందనుకోండి. సత్తెమ్మలో ఒక సుగుణం ఉంది. చుట్టుపక్కల డ్రైవర్లు వాళ్ళు దానిమీద కన్నేస్తారేమోనన్న భయం లేదు" అందావిడ నవ్వుతూ.

గోపాలకృష్ణ కూడా నవ్వుతూ "వాళ్ళకర్థం అయి ఏడవాలిగా ఎవరిని చూస్తోందో..."

"అయినా మగవాళ్లని నమ్మడం కష్టం."

"నీకసలు అపనమ్మకం కలిగేలా ప్రవర్తించానా ఎప్పుడైనా?"

"మీరు ప్రవర్తించకపోవచ్చు. మీకు గుర్తుందా, ఒకసారి మా చిన్నాన్న కూతురు వచ్చిందీ? అది ఒకటే పనిగా బావగారూ, బావగారూ అంటూ చొంగలు కార్చుకుంటూ చూసేది మిమ్మల్ని. ఆ తర్వాత మళ్ళీ ఒకసారి నా మీద ధ్యాస పోయిందంటూ వస్తానంటే, మనం వారం రోజులు ఊళ్లో ఉండడం లేదని చెప్పేశాను. నా మీద ధ్యాస పోవడమా పాడా! మిమ్మల్ని చూస్తూ గుటకలు మింగడానికి వస్తానంది. నేను లేకపోతే అది మిమ్మల్ని వలలో వేసుకునే బాపతు. అదెప్పుడయినా చెప్పాపెట్టకుండా వస్తే జాగ్రత్త"

"నాకేం భయం లేదు. వేయి కళ్ళతో నువ్వు కనిపెట్టుకుని ఉంటావు కదా" అన్నాడు గోపాల కృష్ణ నవ్వుతూ.

"పిచ్చివాళ్ళం. మేం అలా అనుకుంటాం. మగవాళ్ళు చేసే పనులు చేసుకుంటానే ఉంటారు. చపలచిత్తం ఉన్న భర్తల్ని ఎంత వరకు కాపాడుకోగలం?"

"ఒకవేళ నాకెప్పుడయినా చపలచిత్తం కలిగితే విడాకులిస్తావా?"

"అమ్మో... విడాకులే. తాడూ బొంగరం లేనిదాన్ని. నేను విడాకులిచ్చి ఎక్కడికి పోతాను? అసలు మన సమాజంలో విడాకులిచ్చిన స్త్రీకి గౌరవం ఉంటుందా? అందులో డబ్బూ దస్కం లేని ఆడవాళ్ళు ఎవరి పంచన చేరగలరు? ఎవ్వరూ చూడరు. మంచో చెడో భర్త దగ్గరే పడి ఉండాలి"

"భార్యలందరూ ఇలాగే అనుకుంటారా?"

"ఆం, మధ్యతరగతి కుటుంబాల్లో భార్యల స్థితి ఇదేగా!"

"అది సరే... ఒకసారి వేదవల్లి దంపతుల్ని మనింటికి పిలిస్తే బావుంటుంది కదూ!"

"ఇప్పుడెందుకులెస్తురూ...ఏదో సందర్భం పడినప్పుడు పిలుద్దాం"

"పోనీ సత్తెమ్మని పంపినందుకయినా ఆవిడకు ఫోను చేసి థ్యాంక్స్ చెప్పాల్సింది"

"పని మనిషిని పంపమని నేనేం ఆవిణ్ణి అడగలేదుగా."

"అందుకనే నువ్వు మరీ థ్యాంక్స్

## కుర్రసన్నాసి



సుమారు మూడు దశాబ్దాల క్రితం హిప్పీ సంస్కృతి పట్నాల్నీ పల్లెల్నీ ముంచెత్తింది. ముఖ్యంగా నగరాల్లోని యువత అంతా దాని మాయలోపడి కొట్టుమిట్టాడేవారు. సమాజానికి దూరంగా మత్తులో తలమునకలు అవుతుండేవారు.

ఆ రోజుల్లో ఆరుద్ర పాల్గొన్న ఒక సభలో చర్చ హఠాత్తుగా హిప్పీలవైపు మళ్లింది. ఈ సందర్భంగా ఒకాయన లేచి-

'హిప్పీకి తెలుగుమాటేంటి ఆరుద్ర గారూ?' అని ప్రశ్నించాడు.

'ఇంకేమిటి.. కుర్రసన్నాసి' అంటూ ఠకీమని చెప్పి అందర్నీ కడుపుబ్బ నవ్వించారు ఆరుద్ర.

చెప్పాలి"

"మీరు నిజంగా అమాయకులో... లేక పోతే అలా నటిస్తారో నాకర్థం కాదు. హరి నన్ను చూసుకోవడానికి వారం రోజులు సెలవు పెట్టి ఎక్కడ ఇంట్లో ఉండిపోతాడో నని ఆ వాచ్‌మన్‌కీ, మనకీ మెహర్బానీగా సత్తెమ్మనిక్కడికి పంపిందావిడ"

"కాత్యాయనీ నువ్వెప్పుడూ వక్రంగానే ఆలోచిస్తావెందుకు? ఎవరినీ సరైన దృక్ప థంతో చూడవు"

"నాకే దృక్పథాలూ తెలియవు. అనవస రంగా అందరితో పరిచయాలు పెట్టుకోను"

"అందరి మాట వేరు. ఆవిడ మాట వేరు"

"ఏం మీతో కాలేజీలో కలిసి చదివిం దనా? "

"అంతేకాదు. మన హరికి ఫస్టుక్లాసు రాక పోయినా ఉద్యోగం ఇచ్చింది".

"అందుకేగా ఇరవై వేలు ఇవ్వకుండా పది వేలే ఇస్తోంది. ఇచ్చిన దానికంటే ఎక్కువ పనే చేయించుకుంటోంది. వాడూ ఇంచు మించు మీరొచ్చే టైముకే వస్తున్నాడు ఇంటికి"

"నిజంగా కాత్యాయనీ... నీకు కృతజ్ఞత కూడా లేదే" అని విసుక్కుంటూ పక్కకు తిరిగి పడుకున్నాడు గోపాలకృష్ణ. కాసేప టికి కాత్యాయని వెక్కివెక్కి ఏడవడం వినిపించి మళ్ళీ చచ్చినట్టు సముదాయిం చడం మొదలుపెట్టాడు.

గోపాలకృష్ణకి వయసు పెరిగిన కొద్దీ ఓపిక తగ్గిపోతోంది. ఆఫీసులో చాకిరీ, ఇంటికొస్తే భార్యని సముదాయించడం... భార్య ఇంట్లో అందరికీ సౌకర్యాలు కలుగజేస్తుంది. కాని లేనిపోని అనుమానాలతో, భవిష్యత్తులో జీవి తానికి సరిపడా పొదుపు చేసే యత్నంతో మనశ్శాంతి లేకుండా చేస్తుంది. పిల్లలు పెద్ద వాళ్ళయ్యాక కొంచెం ధైర్యం పుంజుకున్నారు. దానికి సంతోషించడం పోయి తనకు ఏ మా త్రం విలువ ఇవ్వడం లేదని బాధ పడుతుం ది అని మనస్సులోనే విసుక్కున్నాడు.




"నాన్నగారూ మీ కోసమే చూస్తున్నాను" అంది భార్గవి - కాల్ బెల్ వినగానే తలుపు తీసి.

"ఏమిటమ్మా. ఏమయింది" అన్నాడు గోపా లకృష్ణ కూతురి ముఖం వంక చూస్తూ. ఆమె ముఖంలో అలజడి లక్షణాలు లేవు. ఆనందం కనపడుతోంది.

"నాన్నగారూ, నాకు విప్రో నుంచి ఇన్‌ఫో సిస్ నుంచి ఒకేసారి ఇంటర్వ్యూ ఉత్తరాలు వచ్చాయి" అంటూ గబగబా లోపలికెళ్ళి తెచ్చి ఆ రెండూ చూపించింది తండ్రికి.

ఉత్తరాలు చూస్తూ "చాలా సంతోషమ మ్మా... ఎప్పుడూ... ఎల్లుండి విప్రో, ఆవలె ల్లుండి ఇన్‌ఫోసిస్‌లో. అయితే రేపే బయలు దేరి వెళ్ళాలిగా" అన్నాడు.

"ఎలా వెళుతుందండీ. అక్కడ ఎక్కడుం టుంది. హైదరాబాద్ గొడ్డు పోయిందా? అంతోటి ఉద్యోగం ఇక్కడ దొరకదా? " అంది కాత్యాయని అక్కడికి వచ్చి

"పోనీలే ఇంటర్వ్యూకి వెళ్ళిరానీయ్. తర్వాత సంగతి తర్వాత చూసుకోవచ్చు" అన్నాడు గోపాలకృష్ణ.

"అయితే ఒంటరిగా పంపుతారా? " అడిగిం దావిడ.

"అవసరమయితే రెండు రోజులు సెలవు పెట్టి నేను వెంట వెళతాలే" అన్నాడు గోపా లకృష్ణ.

"ఏమో, నాకు మీ తండ్రీ కూతుళ్ళ వరస నచ్చడం లేదు. ఊరికే ఇంటర్వ్యూకి వెళ్ళడం

దేనికి? ఖర్మం చాలక సెలక్టయితే బెంగుళూరు పంపుతారా? "

"ఎప్పుడు ఏ పదం వాడాలో తోచడం లేదు నీకు. ఖర్మం చాలకేమిటి? అదృష్టవశాత్తు అనాలి" అన్నాడు గోపాలకృష్ణ నవ్వుతూ.

"మీకంతా నవ్వులాటగా ఉంటుంది. పెళ్ళి కావలసిన పిల్లని ఎక్కడికో పంపడమేమిటి? ఆ కవర్లు రెండూ చించి అవతల పారేయండి" అందావిడ.

"నాన్నగారూ మీరు రానవసరం లేదు. నా స్నేహితురాలికి కూడా ఇన్ఫోసిస్ నుంచి పిలుపు వచ్చింది. వాళ్ళన్నయ్య, వదిన బెంగుళూరులోనే ఉంటారు. ఈ రెండు మూడు రోజులూ మేమిద్దరం అక్కడే ఉంటాం" అంది భార్గవి.

"పిలుపులు రావడం తరువాయి, ఇద్దరూ అప్పుడే అన్ని ప్రణాళికలు వేసేసుకున్నారన్న మాట. ఇకనేం. టిక్కెట్లు కూడా కొనేసుకునే వుంటారు" అంది కాత్యాయని.

"ఇంకా లేదు. అన్నయ్యతో చెప్పి తనకీ నాకూ బస్సుకి తెప్పించమంది"

"వాడొకడు దొరికాడు మీకు తోడు" రుసరుసలాడుతూ అంది కాత్యాయని.

"సరే పద. నాకు కాఫీ తెచ్చియ్యి. రాగానే గొడవ దేనికి? " అన్నాడు గోపాలకృష్ణ అసహనంగా.

"అయ్యో నా మతిమండా. ఉండండి ఇప్పుడే తెస్తా " అంటూ వంటింటి వైపు వెళ్ళిందావిడ.

"బాధపడకు. హరికి ఫోను చేసి చెప్పు టిక్కెట్లు తెమ్మని" అంటూ పర్సులోంచి డబ్బు తీసిచ్చాడు గోపాలకృష్ణ కూతురికి.

* * *

భార్గవి బెంగుళూరు వెళ్ళిన దగ్గర నుంచి కాత్యాయనికి ఒకటే ఆదుర్దా. తిన్నగా వెళ్ళిందో లేదోనని, భార్గవి దిగిన ఇంట్లో వాళ్ళు సవ్యమయిన వాళ్ళో కాదోనని, సవాలక్ష సందేహాలతో నాలుగు రోజులు గడిపింది. అయిదవ రోజు భార్గవి తండ్రి ఆఫీసుకు ఫోనుచేసి "తను రెండు కంపెనీలలోనూ సెలెక్టయ్యాన"ని చెప్పింది.

"నీ స్నేహితురాలిదేమయింది" అడిగాడాయన.

"ఇద్దరం సెలక్టయ్యాం. అందుకే ఇద్దరం ఒకేచోట చేస్తే వీలుగా వుంటుందని ఇన్ఫోసిస్‌లోనే చేరదామనుకుంటున్నాను. పైగా వాళ్ళ బ్రాంచాఫీసు హైదరాబాద్‌లో కూడా వుంది. అక్కడికి బదిలీ చేయించుకోవచ్చు తరవాత"

"మంచి ఐడియానే... ఎప్పుడొస్తున్నారు? "

"రేపు జాయినయి వారం రోజుల్లో బట్టలవీ తీసుకువెళ్ళడానికి వస్తున్నాం"

"ఏమిటీ... అప్పుడే జాయినయిపోవాలా? ఇక్కడికి వచ్చి బ్రాంచాఫీసుకు వెళ్ళి ఖాళీలేమయినా వుంటే ఇక్కడే చేరొచ్చు కదా!"

"అలా నిముషాల మీద ఎలా ఒప్పుకుంటారు? మీరూ అమ్మలాగా మాట్లాడుతున్నారు"

"ఏమోనమ్మా! ఒంటరిగా అంతదూరాన ఉద్యోగంలో చేరడం ఎంతవరకు సమంజసం అని ఆలోచిస్తున్నాను"

"ఎంత దూరం నాన్నా. బస్సులో ఒక రాత్రి ప్రయాణం. ఇంటర్వ్యూకి ఎక్కడెక్కడి నుంచో వచ్చారు. ఒకసారి ఉద్యోగం చేయి జారితే కష్టం"

"నేనేమీ చెప్పలేకపోతున్నాను. అవునన లేను. కాదనలేను. అమ్మ చాలా బెంగ పెట్టుకుంటుంది"

"అమ్మ సంగతి సరే. తన లోకం తనదే. తన మాట మిన్న అనుకుంటుంది. ముందు బాధ పడ్డా తరువాత సర్దుకుంటుందిలెండి. అన్నయ్య స్వతంత్రంగా నిర్ణయాలు తీసుకుంటున్నాడని బాధపడింది. ఇప్పుడు అలవాటు పడిపోయింది. నా విషయంలోనూ అదే జరుగుతుంది. అమ్మ విషయంలో మీరు దిగులు పడకండి" అని భార్గవి ఫోను పెట్టేసింది, ఇక తండ్రికి మాట్లాడే అవకాశం ఇవ్వకుండా.

'భార్గవి మొదటనుంచీ ఏదైనా నిర్ణయం

తీసుకుంటే ఇక దానిని ఎవరూ మార్పించలేరు. కానీయ్, ఏదైతే అదవుతుంద'నుకుంటూ ఇంటి ముఖం పట్టాడు గోపాలకృష్ణ.

* * *

తలుపు తెరవగానే "పెద్దదాని సంగతి ఏమయినా తెలిసిందా" అని అడిగింది కాత్యాయని ఆదుర్దాగా.

"ఆఁ! కంగారేమీ లేదు. సెలక్టయింది" అన్నాడు గోపాలకృష్ణ.

"ఎప్పుడొస్తుందట తిరిగి"

"ఎల్లుండి బయలుదేరతానంది"

"స్నేహితురాలి సంగతేమయిందో చెప్పిందా?"

"ఆ అమ్మాయి కూడా సెలక్టయిందట" అంటూ తమ గదిలోకి నడిచాడు.




కాసేపటికి కాత్యాయని టీ పట్టుకొచ్చింది. పరధ్యానంగా కూర్చొని ఆవిడ రావడం గుర్తించలేదతను.

"ఏమిటంత దీర్ఘాలోచనలో ఉన్నారు. ఉద్యోగంలో చేర్పించటం, చేర్పించకపోవడం మనిష్టమే కదా!" అంది టీ కప్పు చేతికందిస్తూ.

"పిచ్చిదానా... అన్నీ మనిష్ట ప్రకారమే జరుగుతాయనుకుంటున్నావా? మన పిల్లలు ఇంకా పసివాళ్ళు కారు. తమ నిర్ణయాలను తాము తీసుకొనే స్థితికి ఎదిగారు" అన్నాడు.

"అంతేలెండి. కాని పెళ్ళి కాని ఆడపిల్లను ఒంటరిగా అలా ఎక్కడ ఉండనివ్వగలం?"

"గుండె నిబ్బరం చేసుకుని మనం పిల్లలకు ధైర్యం చెప్పాలి. ఆడపిల్లలు కూడా ఉద్యోగాలు చేసుకుంటూ తమ కాళ్ళ మీద తాము నిలబడగల స్థితికి వచ్చారని తల్లిదండ్రులు సంతోషించాలి"

"ఏమో! నేను పురాతన కాలపు మనిషిని"

"నీ భావాలింకా మన తరం భావాలే. ఆడపిల్లలకు పెద్ద చదువులు చదివించి ఇక్కడ ఉద్యోగం చేయి, అక్కడొద్దు అంటే ఎలా?"

"ఎక్కడైనా చేసుకోనీయండి. మనం పెళ్ళి చేసి పంపేస్తే మన బాధ్యత తీరిపోతుంది. ఆ తరువాత వాళ్ళ ఇష్టం ఏం చేసుకున్నా"

"అది కనీసం రెండేళ్ళ వరకు చేసుకోనని భీష్మించుకుని కూర్చుంది కదా!"

"పోనీ... ఇక్కడే ఎక్కడైనా చూడండి. ఏ చిన్నపాటి ఉద్యోగమో"

"అక్కడ మంచి ఉద్యోగమే వచ్చింది. కంగారుపడకు. ఇక్కడ కంపెనీ బ్రాంచి వుంది. నెమ్మది మీద బదిలీ చేయించుకోవచ్చునట"

"అయితే అన్నీ మీతో సంప్రదించేసిందన్నమాట!"

"నాకు చెప్పిందలా అని. దానిని నువ్వు సంప్రదింపే అంటావో ఏమంటావో నీ ఇష్టం"

"ఇక నేను ఉన్నా లేకపోయినా ఒకటే. నాతో ఎవరూ ఒక్కమాట కూడా చెప్పరు"

"చెప్పి ఏం లాభం. గట్టిగా కేకలేస్తావు. లేదా ఏడుపు మొదలు పెడతావు. అందుకనే నీకు చెప్పరు"

"అవునులెండి. నేను పిచ్చిదానిని. మూర్ఖురాల్ని. భర్త, పిల్లలు అంటూ అహోరాత్రులు ఆరాటపడ్డం తప్పు. నాకు తగిన శాస్తే అయింది" అంటూ ఖాళీ కప్పు తీసుకుని వెళ్ళిపోయిందావిడ అక్కణ్ణుంచి.

ఆ తరవాతి రెండు రోజులూ ఆవిడ ముభావంగానే ఉండిపోయింది. భార్గవి వచ్చినా కూడా సరిగా మాట్లాడలేదు. "అమ్మా" అంటూ దగ్గరకు వచ్చి ఏదో చెప్పబోయినా వినిపించుకోనట్లే ఉంది. భార్గవి పరిస్థితి అర్థం చేసుకొని ఊరుకుంది.

వెళ్ళేరోజు బట్టలవీ సర్దుకుంటుంటే నాలుగు పట్టుచీరలు, రెండు బంగారుగాజులు, ఒక

చిన్న నెక్లెసు పట్టుకొచ్చి ఇచ్చి ఇవి కూడా సర్దుకో... పెళ్ళికి ఉంటాయని కొని ఉంచాను. ఇక్కడుండి ఏం చేస్తాయి" అని. భార్గవి 'అవును' 'కాదు' అనకుండానే కాత్యాయని గిరుక్కు తిరిగి తన గదిలోకి వెళ్ళి పడుకుంది.

"అమ్మా... వెళుతున్నాను" అని చెప్పడానికి వచ్చినా తిరిగి చూడలేదు. తండ్రి, హరి, ప్రమీల వెంట వెళ్ళి బస్సెక్కించి వచ్చారు. వెళ్ళిన నాలుగయిదు రోజులకు ఫోనుచేసి తన స్నేహితురాలి అన్నయ్య ఇంటికి దగ్గరలో గది అద్దెకు తీసుకుని తనూ తన స్నేహితురాలు కలిసి ఉంటున్నామని, కలిసి వండుకుంటున్నామని చెప్పింది.

ఆ మాటే భార్యతో చెబితే "కులం ఒక్కటే చెడగొట్టుకుంది. స్నేహితురాలితో కలిసి మాంసం కూడా తింటుందేమో! ఇక ముందు ముందు ఇంకెన్నెన్ని వినాలో" అనుకుంటూ సణుక్కుంది తప్పితే, పెద్దగా ఏడవ లేదు పూర్వం లాగా. ఇక అప్పటి నుంచి తనంత తానై భార్గవి సంగతులు అడగడం మానేసిందావిడ. భర్త కాని, కొడుకు కాని చెబితే విని ఊరుకునేదంతే.

రానురాను కాత్యాయనిలో ఏదో మార్పు కనపడుతోంది. పూర్వంలా ఇష్టంలేని పనులు చేస్తే కేకలు వేయడం, లేదా ఏడవడం లాంటివి చేయడం మానేసింది. మనిషి మాత్రం పూర్వపు చలాకీతనం పోయి ఒక యంత్రంలా పనులు చేసుకుంటున్నట్లు కనపడుతోంది. గోపాలకృష్ణకు భయంగా ఉంది. ఇది ఎక్కడికి దారితీస్తుందోనని.

## 8

ఒకరోజున గోపాలకృష్ణ ఇంటికి వస్తూనే "రేపు సాయంత్రం వేదవల్లిగారు మనని వాళ్ళింటికి రమ్మని పిలిచారు" అని చెప్పాడు భార్యతో.

"తెలుసు. మీరు వెళ్ళండి"

"ఎలా తెలుసు, హరి చెప్పాడా? "

"లేదు ఆవిడే ఫోను చేశారు"

"మరి ఇకనేం... వెళ్ళకపోతే బావుండదు. దగ్గర దగ్గర ఏడాదవుతోంది, హరి ఉద్యోగంలో చేరి. ఆవిడ పిలవకముందే వెళ్ళి కలిసి, భార్యభర్తలని మనం పిలిస్తే బావుండేది"

"బావుంది. పిలిస్తే అంతటి వాళ్ళు మనింటికి వస్తారా? "

"వచ్చేవారో కాదో! రారనుకుని మనమెందుకనుకోవాలి"

"ఏమో మీరు వెళ్ళండి. అంత పెద్దవాళ్ళింటికి వెళ్ళడం నాకు కుదరదు. వాళ్ళందరూ గబాగబా ఇంగ్లీషులో మాట్లాడుతూ ఉంటారు. నేను తెల్లముఖం వేయాలి"

"అదా నీ బాధ. ఆవిడ అసలు సిసలు తెలుగావిడ. చక్కటి తెలుగు మాట్లాడుతుంది"

"వాళ్ళంతా ఎన్నెన్నో ఫ్యాషన్‌లు చేసుకుని ఉంటారు. నేను ఇలా సాదాగా వెళితే బావుండదు"

"సాదాగా ఎవరు వెళ్ళమన్నారు. ఎప్పుడూ డబ్బు పొదుపుచేసి చేసి ఏవో కొంటూనే ఉంటావుగా పిల్లల పెళ్ళిళ్ళకని"

వాళ్ళ సంభాషణ వింటున్న ప్రమీల "అమ్మా! నువ్వు భార్గవి అక్కయ్యను తీసుకువెళ్ళమని యిచ్చినవి నా దగ్గరే పెట్టి వెళ్ళింది. లేత గులాబీరంగు కంచి పట్టు చీరకట్టుకో. నెక్లెసు కూడా నాజూగ్గా వుంది. అది వేసుకో అమ్మా" అంది.

"భార్గవి అవి తీసుకువెళ్ళనే లేదా" అందావిడ ఆశ్చర్యంగా.

"అది నీ కూతురేగా! నువ్వు బిగదీసుకు పడుకుంటివి. నువ్వు కోపంతో ఇచ్చావని అదేమో వాటిని ప్రమీల దగ్గరే వదిలేసి పోయింది" అన్నాడు గోపాలకృష్ణ.

"ప్రమీలా! నువ్వా చీర కట్టుకుని, ఆ నెక్లెసు వేసుకువెళ్ళు. నేను రానులే. అస

లావిడ పిల్లలొచ్చారనే కదా పిలిచింది. నువ్వూ హరి వెళ్ళండి. మీ నాన్నగారు, ఆవిడ కాలేజీలో కలిసి చదువుకున్నారు కనుక అప్పటి కాలేజి కబుర్లు చెప్పుకుంటారు. నాకేం తోస్తుంది? నేను మరొకసారి వస్తానులే. రేపు మాత్రం రాను" అంది దృఢంగా.

గోపాలకృష్ణకు విసుగొచ్చి ఇక భార్యను రమ్మని బలవంతం చేయలేదు. మరుసటి రోజు సాయంత్రం "కాత్యాయనీ మేం బయలుదేరుతున్నాం. ఇక నువ్వు రానట్టేగా" అన్నాడు చిరాకుగా, ఆవిడ వంటింట్లో ఏదో పనిచేసుకుంటూ వుంటే.

భర్త అలా చిరాకుగా 'నువ్వొస్తే రా లేకపోతే లేదన్నట్టు' పిల్లల్ని తీసుకుని వెళ్ళిపోతే తన ఇల్లు భూకంపానికి వూగినట్టుగా అనిపించిందామెకు. తెలియని భయంతో ఆవిడ ఒళ్ళు జలదరించింది ఎవరు తనకు దూరమయినా భర్త మాత్రం ఎలాంటి పరిస్థితుల్లోనూ దూరం కాడనుకుంది. ఇప్పుడా నమ్మకం సడలినట్టు అనిపించింది.

* * *

ఎక్కువ మందిని పిలిచినట్లుగా



లేరు. పదిమందే ఉన్నారు. వాళ్ళూ పిల్లలే. కాసేపు కూర్చుని "మనోహర్‌గారు వచ్చాక చెప్పు వేదా. కాత్యాయనికి ఒంట్లో బాగా లేదు. నేను వెళ్తాను. పిల్లల్ని ఎంజాయ్ చేయ నీయ్" అని లేచాడు.

గోపాలకృష్ణ, వేదవల్లి వరండాలోకి వచ్చే టప్పటికి మనోహర్ కారు దిగుతున్నాడు ఒక విదేశీ స్త్రీతో కలిసి.

గోపాలకృష్ణను చూసి "హలో" అంటూ కరచాలనం చేసి "అప్పుడే వెళ్ళిపోతున్నారే మిటి? ఈవిడ రేచల్. అమెరికాలో నా పార్టనర్" అని పరిచయం చేశాడు మనో హర్.

"భార్యకి ఒంట్లో బాగుండలేదట. అందుకని పిల్లల్ని దించి వెళ్ళ పోతున్నాడు" అని సంజా యిషీ ఇచ్చింది వేద అతడి తరఫున.

గోపాలకృష్ణ ఇంటికి వచ్చి బెల్ కొడితే సత్తెమ్మ తలుపు తీసింది. గదిలోకి వెళ్ళి చూస్తే తమ పాత సోఫాలో బుగ్గన చేయి పెట్టుకుని కాత్యా యని దీర్ఘాలోచనలో మునిగిపోయి కనిపించింది.

పక్కనే కూర్చుని "కాత్యాయనీ నువ్వన్నది నిజమే. అది నిజంగా పిల్లలదే. అందుకని వాళ్ళని అక్కడ దించేసి వచ్చేశాను - నువ్వు ఒంటరిగా ఉన్నావని" అన్నాడు.

"ఒంటరిగా ఉన్నానన్నారా, ఒంట్లో బావుం డలేదన్నారా? " అంది తీక్షణంగా ఆవిడ.

"నీకెలా తెలుసు? "అన్నాడు ఆశ్చర్య పోతూ.

"మీ వేదగారే ఫోనుచేసి అడిగారు. గోపాల్ కొద్దిసేపట్లోనే చేరుకుంటాడు, మీ ఆరోగ్యం సరిగా చూసుకోవడం లేదను కుంటా" అంటూ.




"నాకేమయింది. బాగానే ఉంది" అన్నాను. ఇక ఆవిడేం మాట్లాడలేదు. "పిల్లలు ఇక్కడే భోజనం చేసి వస్తారు" అని ఫోను పెట్టేసింది.

'పాపం వేద నిజంగానే బాగోలేదనుకొని ఫోను చేసి వుంటుంది'. అనుకున్నాడు లోపల. పైకి మాత్రం "అలా చెప్పకపోతే నన్ను వచ్చేయనీయరు కదా. అందుకని అలా చెప్పాను" అన్నాడు.

"అంటే మీ పబ్బం గడుపుకోవడానికి నాకు జబ్బు కూడా అంటకడతారన్నమాట" అంది ముఖం చిన్నబుచ్చుకుని.

"మరి నువ్వు మూర్ఖంగా రానని ఇంట్లో కూర్చుంటే అబద్ధం చెప్పక చావనా" అన్నాడు విసుగ్గా.

"అంతలేసి మాటలు దేనికి? నాకు తెలు సండీ. మీకు తగని దానినని."

"కాత్యాయనీ పిల్లలు చేతికందివచ్చి వారి బతుకులు వారు బతికే స్థితికి ఎదిగాక కూడా నువ్వు ఇంకా 'మీకు తగను' అనే పాతపాటే పాడుతున్నావు. అది ఎప్పటికీ వదలవా? "

"నేను మర్చిపోదామన్నా మీ అక్కగారు మర్చిపోనిస్తారా? అత్తగారు పోయేవరకు ఇరుగు పొరుగు వాళ్లతో కూడా ఆ మాటే అంటూ ఉండేవారు. నేను విని బాధపడతానే మోనని కూడా అనుకునేవారు కాదు"

"నేను కదా వాళ్లని కాదని నిన్ను చేసుకు న్నది.నేనా మాట ఎప్పుడయినా అన్నానా? "

"వాళ్లమీద పంతంతో చేసుకున్నాక ఎలా అంటారు! అవునూ పెళ్లి చూపులకు వచ్చిన ప్పుడు తలెత్తి నన్ను చూడను కూడా చూడ లేదట కదా! మా వాళ్లు కూడా ఆ మాటే అన్నారు. అబ్బాయి అమ్మాయికంటే సిగ్గుప డుతున్నాడు, తల కూడా ఎత్తడం లేదని"

"నేను తలెత్తకపోవడానికి కారణం, ఎక్కడ మా అమ్మ, అక్క కట్నం, ఆడప డుచు లాంఛనాలు అంటూ మొదలుపెడతా రేమోనని భయపడుతూ అలా కూర్చు న్నాను"

"మా వాళ్లంతా ఆశ్చర్యపోయారనుకోండి. మా నాన్న కట్నం, లాంఛనాల మాట అవ గానే "అవేమీ వద్దండి. ముహూర్తం పెట్టించి తెలియజేయండి" అంటూ హడావి డిగా మీ అమ్మగారిని, అక్కగారిని నోరు విప్పనీయకుండా తీసుకుపోయారుగా. నేనంతా గమనిస్తూనే ఉన్నాను. మా చిన్నాన్న కూతురు ఒకటే వాపిరితనంతో మిమ్మల్ని తినేసేటట్టు చూడడం కూడా గమనించాను"

"అమ్మబాబోయ్... నీవి అఖండమైన తెలి వితేటలే కాత్యాయనీ? " అంటూ భుజంమీద చేయివేసి "ఇటు చూడు. నువ్వు అందంగా వున్నావా లేదా అని ఏనాడూ ఆలోచించు కోవడానికి కూడా తావివ్వకుండా అహర్ని శలూ మాకు సేవలు చేస్తూనే వున్నావ్ ఇన్నేళ్లూ. అలా భార్యాభర్తలు ఒకరికొకరు అలవాటుపడిపోతారు. ఆప్యాయతా పెరు గుతుంది. ఇక భార్య అందంగా వుందా లేదా, భర్త అందంగా ఉన్నాడా లేడా అన్న ఆలోచనే రాదు. నాకు తెలుసు, మా అమ్మ రాజీకి రాలేకపోయింది. పోయేవరకూ తనకి నువ్వెంత సేవచేశావు! అయినా అందం, కట్నం రెండూ లేవంటూ కన్ను మూసింది. అక్క కూడా పిచ్చిది. తనూ రాజీకి రాలేకపోతోంది ఇప్పటికీను. పోనీలే అదంతా, అవునూ మరిచేపోయాను. అక్క ఉత్తరం రాసింది. లెటర్ బాక్స్‌తీసి చూడ లేదా ఇవాళ? " అన్నాడు కవరు చించుతూ.

"ఏమో! నా మనసు బాగోలేదు. ఇవాళ లెటర్ బాక్స్ మాట గుర్తే లేకపోయింది"

"పోనీలే. మునిగిపోయిందేమీలేదు. చదు వుతాను విను"

"తమ్ముడూ, ఇంట్లో అందరూ కులాసాగా ఉన్నారనుకుంటాను. నీకు తెలుసుగా, నేను సూటిగా మాట్లాడతాను ఏ విషయంలో నైనా. అసలు విషయానికి వస్తాను. మీ బావగారు పెద్దబ్బాయికి పెళ్లి చేయాలను కుంటున్నారు. వాడు ఉద్యోగంలో చేరాడు. భార్గవికి ఇంత పెద్ద రాష్ట్రంలో ఉద్యోగమే దొరకలేదా, బెంగుళూరులో ఉద్యోగంలో చేర్పించావట? ఆడపిల్లను అలా పెళ్లి కాక ముందు ఎలా పంపేశావు? మీ ఆవిడ కూడా ఊరుకుందా? ఏదో ఒకటిలే. ఈ సంగతి నాకెలా తెలిసిందంటావా? మొన్న ఫోన్‌చేస్తే ప్రమీల చెప్పింది. మా పెద్దాడికి మీ భార్గవినిస్తావేమో కనుక్కోమన్నారు మీ బావగారు. మళ్లీ మీవాళ్లు మమ్మల్ని అడగ కుండా బయట సంబంధాలు చూసుకు న్నారు అని నింద వేయొచ్చు అన్నారు. ఏ సంగతీ తెలియజేయి. వాడికి ఇప్పటికే చాలా సంబంధాలు వస్తున్నాయి. కానీ నాకు భార్గవి మీద బాగా మనసుంది. నీకు తెలుసుగా, నేను అందం అంటే ప్రాణం ఇస్తానని. అదృష్టవశాత్తు నీ పిల్లలకు నీ అందం, రంగు వచ్చాయి. ఏ సంగతీ వెంటనే రాయి. రక్తబంధం తెంచుకోవని అనుకుంటున్నాను. కోడలు నలుపైతే వంశం అంతా నలుపే అంటారు. అందుకే పచ్చటి భార్గవిని కావాలనుకుంటున్నాను.

ఇట్లు

నీ అక్క.

"అయితే ఆ ముక్కుపురుగుని చందనం బొమ్మలాంటి మన భార్గవికి అంటగట్టాలని ప్రయత్నమన్నమాట. అన్ని సంబంధాలు వస్తుంటే మన మీద అంత ప్రేమ ఒలకబో యక్కర్లేదు, చేసుకోమనండి వాళ్లనే" అంది కాత్యాయని కోపంగా.

గోపాలకృష్ణకు నవ్వాగలేదు. "కాత్యాయనీ ఎందుకే అంత కోపం అక్కమీద. నీకూ అందంమీద మక్కువే అని బయటపడిపో యావు. నిజమే దురదృష్టవశాత్తు దాని కొడుకులిద్దరికీ బావగారి రంగు, రూపు

# చతుర భాషితాలు

తప్పుల్ని ఒప్పుకోవడం, సరిదిద్దుకోవడం, అందుకు దారితీసిన పరిస్థితిని వివరించడం మంచి లక్షణం.

-లాంగ్‌ఫెలో

జీవితం నిరాడంబరంగా, ఆశయాలు ఉత్తమంగా ఉండాలి.

-న్యూకంబర్

వివేకవంతమైన విజ్ఞానం ఉందనుకోవడం కంటే అది ఆచరణలో ప్రతిబింబించేలా ప్రయత్నించడం ముఖ్యం.

- హెలన్ కిల్లర్

మన నిర్ణయాన్ని సరిదిద్దగలిగింది, వాస్తవాల్ని నిర్ధారించగలిగింది కాలం మాత్రమే.

-మహాత్మాగాంధీ

మన సమస్యలకు పరిష్కారాలు మన దగ్గరే ఉంటాయి. కాని వాటిని ఎవరో పరిష్కరించాలని మనం కోరుకుంటాం.

-రోస్‌పాల్

ఆత్మను మేల్కొలిపి ఉద్దీపింపచేయడమే ఉత్తమ సాహిత్య లక్ష్యం.

-తాపీ ధర్మారావు

వాస్తవాల్ని గుర్తించడానికి ప్రయత్నిస్తే సమస్యలకు పరిష్కారాలు తేలిగ్గా లభిస్తాయి.

-లూయిస్ పాస్టర్

అహంకారాన్ని ప్రదర్శించడం కన్నా బాధ్యతల్ని వినయంగా చేపట్టడం మంచిది.

-వి.టి. టైటస్

నిరంతర కృషి అన్ని పనులకు ఆత్మవంటిది. అదే ఫలితాలకు కేంద్రం.

-స్వామి వివేకానంద

శీలాన్ని పెంపొందించి జీవితాన్ని తీర్చిదిద్దుకునే అవగాహన కలిగించేదే అసలైన విద్య అవుతుంది.

-రాజాజీ

నీ అభిప్రాయం సరైనదనే విశ్వాసం నీకుంటే చాలదు. వాస్తవాల ఆధారంగా ఇతరులను ఒప్పించగలదిగా ఉండాలి.

-జవహర్‌లాల్ నెహ్రూ

ప్రకృతిని ప్రేమించు, కాపాడు. అది నీకు సహకరిస్తుంది. నిన్ను సంరక్షిస్తుంది.

-జాన్ మిల్టన్

వాస్తవాల్ని వదిలి ఊహల్లో విహరించేవారు అనేక భ్రమలకు లోనవుతుంటారు.

-బెంజిమన్ డిజ్రేలీ

వచ్చాయి. కాని బుద్ధిమంతులు" అన్నాడతను.

"అయితే చేయండి. మీ కూతురు... మీ ఇష్టం. నేను అందంగా లేనని సాధించే ఆవిడ నా పిల్లను అందం లేనివాడిని ఇస్తానని ఎలా అనుకుంది? అయినా నాకెందుకు లెండి! మీ అక్కాతమ్ముళ్ల మధ్య కల్పించుకోవడం"

"ఇటు చూడు కాత్యాయనీ. అక్క మాత్రం అప్పటి మా పరిస్థితులనుబట్టి తన అందం చూసి కట్నం లేకుండా చేసుకోవడానికి ఇష్టపడ్డారని మా బావగారిని మనసు చంపుకుని పెళ్లి చేసుకుంది. అయినా ఆయనతో సరిపెట్టుకుని కాపురం చేస్తోందా లేదా?"

"అక్కా తమ్ముళ్లు ఒక్కటే. మీరు మాత్రం సరిపెట్టుకుని నాతో వేగడం లేదా?"

"కాత్యాయనీ... నేనేం చెప్తే నువ్వు నన్ను నమ్ముతావు!... అసలు మన భార్గవి ఏమంటుందో తెలుసుకోవాలిగా"

"అదీ నిజమే. మందమతిని. అసలే అది 'కట్టె కొట్టె తెచ్చే' అనే రకం. అంతా మేనత్త పోలికలు, గుణాలు. సూటిగా మాట్లాడటం అంటూ మనసు విరిచేసేలా మాట్లాడతారు. పోనీయండి, నా సోదికేంగాని భార్గవిని కనుక్కోండి" అంది.

హాల్లోనించి ఫోను శబ్దం విని గోపాలకృష్ణ హడావిడిగా లేచి వెళ్లాడు. భార్య అతణ్ణి అనుసరించింది. రిసీవరందుకుని "హలో!" అన్నాడు. అటువైపు నుంచి కూతురి స్వరం విని, "ఏమిటమ్మా భార్గవీ. బావున్నావు కదా!" అన్నాడు.

"బాగానే ఉన్నాను నాన్నగారూ. అత్తయ్య దగ్గరి నుంచి ఉత్తరం వచ్చింది"

"నీ ఎడ్రసు ఎలా తెలిసిందమ్మా"

"మొన్న ఫోన్‌చేస్తే ప్రమీల ఇచ్చిందంట"

"ఇంతకీ ఏమని రాసింది"

"వాళ్లబ్బాయిని నేను చేసుకోవాలట"

"వాళ్లబ్బాయే కాని, నీకు బావ కాడా?"

"ఏమో అలా వరసలు పెట్టి మాట్లాడటం నాకిష్టం ఉండదు. ఇప్పుడే ఉద్యోగంలో చేరాను. రెండు మూడేళ్ల వరకు నేను పెళ్లి చేసుకోదలచుకోలేదు. ఆ సంగతి అత్తయ్యతో మీరు చెప్పండి"

"ఆ మాటే నువ్వు రాసేయకూడదా అమ్మా!"

"సరే నాన్నగారూ. మీరేమీ అనుకోకపోతే నేనే రాసేస్తాను" అని ఫోన్ పెట్టేసింది భార్గవి.

"చూశారా, దానికెంత ఉదాసీనమో! నా సంగతేమైనా ఎత్తిందా? అమ్మ ఎలా ఉంది అని అడిగితే దాని నోటి ముత్యాలు రాలిపోతాయా? పిల్లలూ పిల్లలూ అని నేను పడి చావడమే కానీ" అంటూ కళ్లనీళ్లు పెట్టుకుంది కాత్యాయని.

గోపాలకృష్ణ ఆవిడ భుజం మీద చేయి వేసి లోపలకు తీసుకువెళుతూ "అర్థం చేసుకో దానిని. అది ఇంక వేరే సంగతులు ఆలోచించే స్థితిలో లేదు. నెమ్మదిగా అంతా సర్దుకుంటుందిలే" అని అనునయించాడు భార్యని.




నాలుగు రోజుల తర్వాత గోపాలకృష్ణ ఇంటికి వచ్చేటప్పటికి అక్క విమల తలుపు తీసింది. ఆవిణ్ణి చూడగానే ఆశ్చర్యపోయాడు. "ఎప్పుడొచ్చావు అక్కా?" అంటూ లోపలికి నడిచాడు సాలోచనగా.

"నువ్వు ఆఫీసుకు వెళ్లాక వచ్చానులే" అందావిడ కాస్త కోపంగా.

"ఫోన్ చేసి చెప్పి ఉంటే బస్‌స్టాండ్‌కు వచ్చేవాణ్ణిగా".

"నీకంత కష్టం దేనికిలే... భార్గవి ఉత్తరం రాసింది"

అతనేమీ మాట్లాడలేదు.

"నీకు చెప్పే రాసిందా? " అడిగిందావిడ.

అవునన్నట్టు తలూపాడతను.

"నీ ఉద్దేశ్యం కూడా అదేనా? "

మళ్లీ మౌనమే అతడి సమాధానమయింది.

"సరేలే. తమ్ముడూ, తమ్ముడు కూతుళ్లు అని నేను పడి చావడమేకాని మీకసలు చుట్టరికం అనే భావనే లేదు. అన్నీ తల్లిబుద్ధులు. వచ్చినప్పట్నుంచీ చూస్తున్నాను వంటింట్లోనే. వంటలు మొదలుపెట్టింది. నేనిక్కడ తిండికి కరువాసి వచ్చానా? పది కూరలు, నాలుగు పిండివంటలు చేసి పెట్టకపోతే, పెట్టలేదని అనుకుంటానా? భార్గవి సంగతి ఎత్తితే 'నాకు తెలియదు మీ తమ్ముణ్ణే అడగండి. నా మాట ఎవరు వింటారు' అంటుందేమిటి? తల్లిగా తనకే బాధ్యతా లేదా? " అంటూ ఉండగా ప్రమీల కాలేజీ నుంచి వచ్చింది.

అత్తను చూస్తూనే "అత్తయ్యా ఎప్పుడొచ్చావు? " అనడిగింది.

ఆ పిల్లను చూస్తూనే దగ్గరకు పిలిచి పక్కన కూర్చోబెట్టుకుని "అందంలో భార్గవిని మించిపోయింది ఇది. అది రెండు మూడేళ్ళ వరకు పెళ్ళి చేసుకోనని అంటోంది. ప్రమీలా. నీ చదువు ఎప్పుడయిపోతోంది? " అని అడిగింది మేనకోడల్ని.

"అయిపోయింది. రిజల్ట్సు కోసం ఎదురు చూస్తోంది" చెప్పాడు గోపాలకృష్ణ.

"అవునా! సరేలే అమ్మా. ఇప్పుడే వచ్చావ్ బయటినుంచి. కాళ్ళూ చేతులూ కడుక్కుని టిఫిన్ చేయి" అని లోపలికి పంపేసింది మేనకోడల్ని.

"ఇటు చూడు. చిన్నదానికీ పెళ్ళీడు వచ్చింది గదా. పోనీ దీనినివ్వరాదూ మా వాడికి" అంది లోగొంతుతో.

లోపల్నుంచి వీళ్ళ మాటలు వింటున్న కాత్యాయనికి లోగొంతులో మాట్లాడినా ఆడబిడ్డ అన్న మాటలు బాగానే వినపడ్డాయి.

కాసేపు వేచి చూచింది భర్త ఏమంటాడోనని. "నువ్వే అడగక్కా దాన్ని" అన్నాడు.

ఇక కాత్యాయని ఉండలేకపోయింది. "అదేమిటండీ. పెద్దదానికి కాకుండా చిన్నదానికి ఎలా చేస్తాం? " అంటూ ఇద్దరికీ టిఫిను, టీ తెచ్చి ఇస్తూ అంది.

"ఈ రోజుల్లో ఇలాంటి పట్టింపులెక్కడున్నాయి కాత్యాయనీ" అంది ఆప్యాయంగా పిలుస్తూ ఆడబిడ్డ.

"అవసరం వచ్చినప్పుడు ఆప్యాయత బాగానే ఒలకబోస్తుంది" అని లోలోపల గింజుకుంటూ... "పట్టింపు కాదు. పెద్దపిల్లకు కాకుండా చిన్నదానికి చేస్తే పెద్దదానికేదో లోపం ఉందనుకుంటారు. ఇక దానికి సంబంధాలు వస్తాయా? " అంది ధైర్యం కూడగట్టుకుని.

గోపాలకృష్ణ తెల్లబోయి చూశాడు భార్య వంక, అలా ధైర్యంగా ఆవిడ మాట్లాడటం చూసి.

"నాకర్థం అయిందిలే కాత్యాయనీ. నువ్వు అందంగా లేవని మా వాణ్ణి చేసుకోవద్దు అన్నామని ఇవాళ బదులు తీర్చుకుంటు న్నావు. ఆడదాని అందం చూడమన్నారు, మగవాడి సంపాదన చూడమన్నారు. మీ విషయంలో తారుమారయింది. పోనీయ్" అని తమ్ముడు వైపు తిరిగి "అసలు మీ బావగారు చాలా డబ్బున్న సంబంధాలు వస్తుంటే వద్దని మీ తమ్ముడి కూతుర్ని చేసుకుంటే పెళ్ళికి ఉభయ ఖర్చులూ మనమే భరించాలి అని ఎగతాళి చేస్తున్నారురా. సరేలే మేనరికం అన్న మమతతో వచ్చాను కానీ కాత్యాయనీ మీ పిల్లపాటి మరెవరూ దొరకక పోరు. చూస్తూండు నీ పిల్లల్ని తలదన్నే అందగత్తెల్ని తీసుకొచ్చి నా కొడుకులిద్దరికీ చేయకపోతే నన్ను నా పేరుతో పిలవొద్దు" అంటూ ఎంత వారించినా వినకుండా తమ్ముడి చేతిని కూడా తోసేసి తెచ్చుకున్న చిన్న బ్యాగ్ పట్టుకుని చరచరా బయటకు వెళ్ళిపోయింది విమల. గోపాలకృష్ణ కంగారుగా కారు తీసుకుని బస్

స్టాండుకు వెళ్ళి చూస్తే ఆటోలో నుంచి దిగుతోంది. అతడు బతిమిలాడుతున్నా వినకుండా కౌంటర్ దగ్గరకు చరచరా వెళ్ళి టిక్కెట్టు కొనుక్కుని అప్పుడే బయలు దేరబోతున్న బస్సు ఎక్కేసింది. గోపాలకృష్ణ ఇక చేసేదేమీలేక ఇంటికి తిరిగి వచ్చేశాడు.

రావడం రావడమే "నేనలా అనకుండా వుంటే అక్కగారి మీద ప్రేమతో ప్రమీల నివ్వడానికి మీరు ఒప్పేసుకునేవారు" అంది కాత్యాయని.

"అక్క అటూ. నువ్విటూ. ఇద్దరూ అడకత్తెరలో వేసి ముక్కలు చేయండి నన్ను" అంటూ విసురుగా బాత్‌రూమ్‌లోకి వెళ్ళి దభాలున తలుపేసుకున్నాడు గోపాలకృష్ణ.

భర్త అలా ఎన్నడూ మాట్లాడటం చూసి ఎరగని కాత్యాయని బిత్తరపోయింది. మరుక్షణమే తనని తాను నిందించుకుంటూ ప్రమీలా మీ నాన్నగారికి టీ, టిఫిను ఇవ్వమ్మా. ఇందాక ఇచ్చింది చల్లారిపోయింది. నాకు తలనెప్పిగా ఉంది. కాసేపు పడుకుంటాను" అని గదిలోకి వెళ్ళి పడుకుంది.

గోపాలకృష్ణ స్నానం చేసి హాలులోకి వచ్చాడు. ప్రమీల టిఫిను వేడి చేసి తెచ్చిచ్చింది. టీ మళ్ళీ చేసి తీసుకొచ్చింది. గోపాలకృష్ణ ఏం జరగనట్టే కూతుర్ని పక్కన కూర్చోబెట్టుకుని "నువ్వేం చేద్దామనుకుంటున్నావమ్మా" అన్నాడు.

"నాకేం తెలుసు నాన్నగారూ! మీరెలా చెబితే అలా" అంది.

"అది మంచి పద్ధతి కాదు. నీకై నువ్వు నిర్ణయాలు తీసుకునే చదువు, వయసు ఉన్నాయి. నీకు మేం సలహా మాత్రమే ఇవ్వగలం" అంటూ కాసేపు ఆ కబుర్లూ ఈ కబుర్లూ చెబుతూ వుండగా హరి వచ్చాడు

## అవి యమపాశాలు

"తలనొప్పా! అనాసిన్ వాడండి!" ఇలాంటి ప్రకటనల్ని మనం తరచు వింటుంటాం, చూస్తుంటాం. ఆ ప్రకటనల్లో తల పట్టుకుని నొప్పితో బాధపడే స్త్రీని కూడా చూస్తుంటాం. తరచు కలిగే చిన్న చిన్న నెప్పులకి అనాలజిసిక్ డ్రగ్స్ వాడుతున్నారని ఓ సర్వేలో తేలింది. క్రమంగా వాళ్లకు ఇదో అలవాటుగా మారుతోంది. ఈ అనాలజిసిక్ డ్రగ్స్ వాడటం వల్ల వాళ్లలో ఎక్కువగా రక్తపోటు వస్తున్నట్లు అమెరికన్ శాస్త్రజ్ఞులు కనుగొన్నారు.

దాదాపు 500 మంది మహిళలను వాళ్లు పరీక్షించారు. వాళ్ళలో ఎక్కువ మంది యాస్ప్రిన్, ప్యాట్ మాల్, నాన్ స్టీరాయిడల్ ఇన్‌ఫ్లమేటరీ డ్రగ్స్-అంటే ఇబూప్రోఫెన్, నేప్రోక్సెన్ వంటివి వాడుతున్నారని వెల్లడయింది. రోజుకి 500 మి.గ్రాలు అంతకంటే ఎక్కువగా ప్యాట్ మాల్ ఉపయోగించే మహిళల్లో అధిక రక్తపోటు ఉన్నట్టు కనుగొన్నారు. అలాగే 400 మి.గ్రాల ఇబూప్రోఫెన్ తీసుకునే స్త్రీలలో అరవై శాతం మందికి అధిక రక్తపోటు ఉన్నట్టు గుర్తించారు. ఇలా పెయిన్ కిల్లర్స్ వాడుతూ రక్తపోటుకు గురవుతున్న వాళ్లలో 50 నుండి 80 ఏళ్ళ వయసు పైబడ్డ వాళ్లే ఎక్కువ. అందుకే ఎడాపెడా పెయిన్ కిల్లర్స్ వాడడం మానేయండి. అత్యవసరమైతే వైద్య నిపుణుల సలహాతో మాత్రమే వాడండి.



ఆఫీసు నుంచి.

"హరీ, రోజూ మరీ ఇంత ఆలస్యమవుతుందా? నా ఆఫీసే నయం" అన్నాడు తండ్రి నవ్వుతూ.

"తొమ్మిది గంటలయ్యేటప్పటికి భోజనానికి కూర్చోకపోతే అమ్మ ఊరుకోదని ముగించేసుకొని వచ్చాను. ఇంకా పని మిగిలిపోయి ఉంది" అన్నాడు హరి.

"పని ఒత్తిడి ఎక్కువగా ఉండి కష్టంగా ఉంటోందా? "

"లేదు నాన్నగారు! ఎన్ని గంటలైనా చేయాలనిపిస్తుంది. పైగా మా మేడమ్ కూడా ఆఫీసులో కూర్చునే ఉంటారు. మధ్య మధ్యలో మా దగ్గరకొచ్చి ఏమైనా సందేహాలుంటే తెలియ చెబుతారు"

"ఏమిటీ! వేద ఇంతసేపు ఆఫీసులోనే ఉంటుందా? " అన్నాడు తండ్రి ఆశ్చర్యంగా.

"రోజు పది గంటలవరకు ఆవిడ ఆఫీసులోనే కూర్చుని పని చేసుకుంటూ వుంటారు. మేడమ్ మీరు ఆఫీసులో ఉండగా టైమైపోయిందంటూ



మేమెలా వెళ్ళగలం అని ఒక రోజు అడగను కూడ అడిగేశాం"

"ఏమంది తను"

"నాకు ఈ పని కూడా లేకపోతే ఏం తోచక పిచ్చెక్కుతుంది" అని నవ్వారు. తన విషయం పట్టించుకోకుండా మా టైముకి మమ్మల్ని వెళ్ళిపొమ్మని చెప్పారావిడ. అసలావిడ మేం ఎన్ని గంటలు

కూర్చున్నాం అన్నది చూడరు. పని పూర్తి చేస్తే చాలు"

"అది అమెరికన్ పద్ధతిలే. ఆస్ట్రేలియాలోనూ అంతేనట. పని పూర్తికావడం ముఖ్యం"

"అదే మంచిదనిపిస్తుంది నాన్నగారూ! రోజూ టైముకి ఆఫీసుకు వెళ్ళి లంచవరకీ, మరోటనీ సాయంత్రం వరకూ పనిమీద శ్రద్ధ పెట్టకుండా జాప్యం చేయడం, మధ్య మధ్యలో బాతాఖానీలు... పని మాత్రం సవ్యంగా జరగదు. దానికంటే వాళ్ళ పద్ధతే బావుంది"

ఇంతలో ప్రమీల వచ్చి టేబులు మీద ప్లేట్లు పెట్టింది.

అది చూసి "ఏమిటమ్మా ఇవాళ నువ్వు భోజనాలు వడ్డిస్తున్నావు? " అన్నాడు తండ్రి.

"అమ్మ తలనెప్పిగా ఉందని పడుకుంది. లేపితే లేవలేదు. మంచి నిద్రలో ఉంది. అందుకని నేను పెడుతున్నాను" అంది.

గోపాలకృష్ణ ఒక్క క్షణం ఆలోచించి "సరేప దండి భోజనం చేద్దాం" అన్నాడు. హరి కూడా వంటింట్లోకి వెళ్ళి చెల్లెలికి సాయపడ్డాడు.

భోజనాలయ్యాక గోపాలకృష్ణ కూతుర్ని డిగి ఒక గ్లాసు పాలు తీసుకుని భార్య దగ్గరకు వెళ్ళి "కాత్యాయని లే. ఈ పాలు తాగు" అంటూ లేపి పాలగ్లాసు నోటికందించాడు. కాత్యాయని ఏమనుకుందో కాని మాట్లాడకుండా పాలు తాగేసింది. లేచి వెళ్ళి ముఖం కడుక్కువచ్చింది.

గోపాలకృష్ణ కాత్యాయనిని దగ్గరకు తీసుకుని "కాత్యాయనీ... సారీ కఠినంగా మాట్లాడానుకదూ నీతో" అన్నాడు.

కాత్యాయని బావురుమంది. "తప్పు మీది కాదు. నేను తెలివి తక్కువ మొద్దుని, ఎప్పుడు ఎలా మాట్లాడాలో తెలియదు. అసలే మీ అక్కగారలా వెళ్ళిపోయేటప్పటికి మీరు బాధపడుతూ వస్తే నేనలా రాపాడించాల్సింది కాదు. నా వల్ల మీకు సుఖం లేదు" అంది ఏడ్పు మాని.

"నీ ముఖం... నువ్వివాళ భోజనం వడ్డించకపోతే మాకెవ్వరికీ అన్నం తిన్నట్టే లేదు. హరి కూర వేసుకోవడం మర్చిపోయి పచ్చడి తర్వాత పెరుగు వేసుకుతిని లేచిపోయాడు. ప్రమీల చారన్నంతో లేచిపోతుంటే పెరుగు వేసుకోమని చెప్పాను"

"నిజమా! అయ్యో! మీరయినా తిన్నారా? " ఎలా తింటాను? రోజూకొసరి కొసరి వడ్డించే దానివి. అంచేత నాకసలు ఏమి తిన్నానో కూడా తెలియలేదు"

"అయ్యో! అర్థాకలితో లేచిపోయారా? "

"నువ్వు మాత్రం ఆకలితో పడుకుంటావా? ఆలస్యమయితే అయింది కొంచెం అన్నం తిను"

"ఇక ఇప్పుడు తిననులెండి. మీ అక్కగారున్నారు కదా అని పాయసం చేశాను" అంటూ లేచింది.

"హాల్లోకి పద. పిల్లల్ని కూడా పిలుస్తాను. అందరం కలిసి కబుర్లు చెప్పుకుంటూ తిందాం. భార్గవి వెళ్ళిపోయాక అందరం మౌనంగా అన్నం తినడమే కాని సరదాగా మాట్లాడుకోవడమే మానేశాం" అన్నాడు గోపాలకృష్ణ.

కాత్యాయనిలో కొంత మార్పు కనపడుతోంది. గోపాలకృష్ణ దానికి కారణం కనిపెట్టగలిగాడు. అక్కమీద ప్రేమతో ప్రమీలని స్తానని చెప్పకపోయేటప్పటికి తన మీద నమ్మకం ఏర్పడిందనీ; అక్క, తల్లికంటే తన మీదనే ఎక్కువ ప్రేమ ఉందని అనుకుని కాస్త ధైర్యం తెచ్చుకుంటోంది. పిచ్చిది. ఇన్నేళ్ళు కలిసి బతికినా ఇంకా అపనమ్మకమే. అపనమ్మకం కంటే తనకు అందం లేదన్న న్యూనతాభావం బాగా పాతుకుపోయింది. దాంతో తను నాకు తగదన్న భావం లోతుగా నాటుకుపోయింది. వట్టి అమాయకురాలు. తన సేవలతో ఇంటిల్లిపాదిని ఎంతగా తన మీదనే ఆధారపడేటట్టు చేసుకుందో తన కర్థం కాదు" అనుకుంటూ నిద్రలోకి జారుకున్నాడు గోపాలకృష్ణ.




భార్గవి దగ్గర నుండి ఉత్తరాలు లేవు. కాని, ఫోను మాత్రం తరుచూ చేస్తూనే ఉంది. ఊరికే కూర్చోవడమెందుకని కంప్యూటర్ సెంటర్‌కు వెళుతోంది ప్రమీల. ఉద్యోగాలకు అప్లికేషన్లు పెడుతోంది.

ఒకరోజు ఫోనొచ్చింది వేదవల్లి దగ్గర నుంచి. "గోపాల్ ఇవాళ ఆదివారం కదా. అందరూ మా ఇంట్లో భోజనానికి రావాలి" అంది.

"నేను రెడీ... అసలు ఎందుకో చెప్పు"

"నా పుట్టిన రోజు మాత్రం కాదు"

"మరి"

"మేం కంపెనీ పెట్టి మూడు సంవత్సరాలయింది. ఆ సందర్భంగా"

"ఓ! చాలా మందిని పిలిచావా!"

"ఎవ్వరూ లేరు మీరే. ఆవిణ్ణి పిలు"

"కాత్యాయనీ... నీకు ఫోను" అని కేక వేశాడు. వంటింట్లో నుంచి చేతులు తుడుచుకుంటూ వచ్చి "నాకెవరు ఫోను చేశారండి" అంటూ ఫోను తీసుకుంది.

"కాత్యాయనిగారూ! మీరూ, మీవారు పిల్లలతో సహా మా ఇంటికివాళ భోజనానికి రావాలి" అంది వేదవల్లి.

"ఆయనా, పిల్లలు వస్తారులెండి"

"అదేమిటి మీరు రాకపోతే ఎలా? "

"నా కంతగా బయటకు వెళ్లడం అలవాటు లేదండీ"

"చేసుకోవాలి. ఊరికే ఇంట్లోనే కూపస్థ మండూకంలా ఉంటే ఎలా? "

"ఏమిటో పిల్లలతో కుదరదండీ"

"పిల్లలు చిన్న వాళ్లయినప్పుడు సరే, ఇప్పుడు వాళ్ళకి మన అవసరం అంతుండదు"

"మా పిల్లలలా కాదండి! ఆయనా, పిల్లలు కూడ దగ్గరుండి చూస్తేనే సరిగా భోజనం చేస్తారు. లేకపోతే ఒకటి తింటే ఒకటి తినకుండా చేతులు కడిగేసుకుంటారు"

"అదృష్టవంతుడు గోపాల్. మా ఇల్లు మీ ఇల్లే అనుకుని రండి. మీ వాళ్ళందరితో పాటు నాకూ భోజనం పెట్టండి"

"మీరు మరీ మొహమాట పెడుతున్నారు. చూస్తాలెండి" అని మళ్లీ ఆవిడ మాట్లాడటానికి ఛాన్స్ ఇవ్వకుండా ఫోను పెట్టేసింది. ఆ రోజు సాయంత్రం వరకు కాత్యాయని అన్య మనస్కంగా ఉండటం కనిపెట్టాడు గోపాలకృష్ణ. సాయంత్రం "కాత్యాయనీ... కిందటి దీపావళికి కట్టుకున్న చీర కట్టుకో. ఎవర్నీ పిలవలేదట, ఒక్క మన కుటుంబాన్ని మాత్రమే" అంటూ బాత్‌రూమ్‌కి వెళ్లాడు. ఇక ఆవిడకు "రాను, కాదు" అనే అవకాశం లేకపోయింది. ఒక క్షణం ఆలోచించి ఏదో నిశ్చయం చేసుకున్నట్టు భర్త బయటకు రాగానే తనూ బాత్ రూమ్‌కి వెళ్ళి ముఖం, కాళ్ళూ, చేతులూ కడుక్కు వచ్చింది. ఆవిడ గదిలోకి వచ్చేటప్పటికి గోపాలకృష్ణ బట్టలు వేసుకుని హాలులోకి వెళ్లిపోయాడు.

ఇంతకుముందు ఉన్న ఇంట్లో వాళ్ల గదిలో హంగులేమీ లేకపోయినా చిన్నపాటి అద్దం గోడకు కొట్టి ఉండేది. మంచం కాకుండా ఇద్దరు కూర్చునే వీలుగా ఇక్ష్వాకుల కాలంనాటి పాత సోఫా ఉండేది. ఈ అపార్టుమెంటుకు వచ్చాక నిలువుటద్దంతో డ్రెసింగ్ టేబుల్ కాక స్టీలు బీరువాకు కూడా వెనకనుండి కనిపించే విధంగా అద్దం ఉంది. మొదటిసారిగా తన ముఖాన్ని పరిశీలనగా చూసుకుంటూ పౌడరు రాసుకుని, కళ్లకు సన్నగా కాటుక పెట్టుకుంది. దోస గింజ లాంటి బొట్టు పెట్టుకుంది. ఆమె

ముఖంలో కాస్త బావున్నట్టు కనపడేది నుదురు, ఉంగరాల జుట్టు. ముడి వేసుకుంది జాగ్రత్తగా. పరవాలేదు. తనేమంత అనాకారి కాదు. సత్తెమ్మ వచ్చాక అంట్లు తోమే పనిలేక చేతులు మృదువుగా ఉన్నాయి. అరచేతులు మొద్దుబారి లేవు. బట్టలు కూడా ఉతికే పని లేదాయె. చేతులు, పాదాలు కూడా మొరటుగా లేవు. వయసు పైబడ్డకొద్దీ నలుపు కాస్త విడివడి ఒంటి రంగు చామన ఛాయలోకి మారింది అనుకుంది. లేచి లేత ఊదారంగు వెంకటగిరి చీర కట్టుకుంది. మెడలో మంగళ సూత్రం గొలుసు తప్పిస్తే మరే నగ పెట్టుకోలేదు. తను పిల్లల కోసమే కొంటుంది కాని తన కోసం కాదుగా. చెవులకు తెల్ల రాళ్ళ కమ్మలు; రెండేసి చొప్పున రెండు చేతులకు సన్నటి గాజులు వేసుకుంది. వెనక బీరువా అద్దంలోకి చూసుకుంటే మెడ మీదుగా వేసుకున్న ముడి మెడను కప్పేసి తన ఒంటి రంగు బయట పడనీయడం లేదు. పైగా ఎంతో హుందాగా అనిపించింది.

పెళ్లయిన నాటినుంచి ఈనాటి వరకు తనని తాను ఇంతగా పరిశీలించి చూసుకోలేదు. ఇప్పుడు అలా ఎందుకు చూసుకుందో... తనకే అర్థం కాలేదు. అందరిలాగే బ్యూటీ సెలూన్‌లకు వెళితే తనూ బాగానే ఉంటుంది. ఈ రోజుల్లో ఎవరు వికారంగా కనపడుతున్నారు? అందరూ అందంగానే కనపడుతున్నారు. పిచ్చిదానిలాగా ఇన్నేళ్లూ నా సంగతి నేను పట్టించుకోలేదు. అయినా ఇవాళ నేనెందుకు ఇలా ప్రవర్తిస్తున్నాను. నేనేమన్నా అందాల పోటీకి వెళుతున్నానా? వేదవల్లి ముందు తను తీసికట్టుగా కనపడకూడదనా? ఆవిడంత అందంగా లేకపోయినా, తనూ అంత కురూపి కాదు అని ఆవిడకూ తన భర్తకూ తెలియాలనా? అనుకుంటూ తెగని ఆలోచనల్లో మునిగిపోయింది కాత్యాయని.

పిచ్చిదానిలాగా ఇన్నేళ్లూ నా సంగతి నేను పట్టించుకోలేదు. అయినా ఇవాళ నేనెందుకు ఇలా ప్రవర్తిస్తున్నాను. నేనేమన్నా అందాల పోటీకి వెళుతున్నానా?!



"కాత్యాయనీ పిల్లలు తయారయ్యారు. నీకింకా ఎంత టైము పడుతుంది? " అంటూ గదిలోకి వచ్చిన గోపాలకృష్ణ ఆవిణ్ణి చూసి మెచ్చుకోలుగా చిరునవ్వు నవ్వాడు. కాత్యాయని ఒకక్షణం కొత్త పెళ్ళికూతురిలా సిగ్గుపడింది.

దగ్గరకు వచ్చి "చాలా బావున్నావు. ఈ రంగు చీర బాగా నప్పింది నీకు" అని భుజాల మీద చేతులు వేసి దగ్గరకు తీసుకున్నాడు.

* * *

ట్రాఫిక్ రద్దీ లేకపోవడంతో పావు గంటలో వేదవల్లి ఇంటికి చేరుకున్నారు. హరి అంతకుముందే పెద్ద పేము బుట్టలో అందంగా ఏర్పాటు చేసిన పూల బొకె కొని తెచ్చి కారులో పెట్టాడు. అది తల్లి చేతికిచ్చి "ఇది మా మేడమ్‌కి నువ్విస్తే బావుంటుంది" అన్నాడు.

వాళ్ళు వస్తున్న శబ్దం విని ఆహ్వానించడం కోసం వేదవల్లి ఎదురుగా వచ్చింది నవ్వుతూ. హరి తల్లి చేతిలో బొకే బుట్ట పెట్టాడు. కాత్యాయని అలవాటు లేక కాస్త ఇబ్బందిపడుతూనే దానిని వేదవల్లి చేతిలో పెట్టింది.

"చాలా బావుంది. రజనీగంధపు పూలు ఎంత గుబాళిస్తున్నాయో!" అంటూ ఆ బొకేని పక్కనే వున్న టేబుల్‌మీద

పెట్టి కాత్యాయని చేతులు పట్టుకుని "చాలా సంతోషం! క్రితంసారి ఒంట్లో బాగోక రాలేకపోయినా ఇవ్వాళైనా వచ్చారు" అంది.

"అంత పెద్ద సుస్తి ఏమీ కాదు. తల పోటు అంతే. ఊరికే ఆయన కంగారుపడ్డారు" అంది.

"రండి ఈ పక్కవరండాలో కూర్చుందాం. చల్లటి గాలి వీస్తుంది. ఎంతైనా ఎయిర్ కండిషనర్ గాలికంటే సహజమైన గాలే హాయిగా ఉంటుంది" అంటూ వరండా వైపుగా దారితీసింది వేదవల్లి.

"ప్రమీలా రిజల్ట్స్ ఎప్పుడొస్తాయమ్మా హరి చెప్పాడు ఎమ్.కామ్ కంప్యూటర్స్ చేశావటకదా" అంది వేదవల్లి.

"ఈ వారంలోనే వస్తాయండి" చెప్పింది ప్రమీల.

"తరవాత ఏం చేద్దామనుకుంటున్నావు? "

"ఉద్యోగమేనండీ. కొన్నిటికి అప్లై చేస్తున్నాను"

"దొరుకుతుందిలే. మా కంపెనీలో ఒక నియమం ఉంది. ఒక ఇంటిలో ఇద్దరికి అత్యవసరమయితే కాని ఉద్యోగం ఇవ్వకూడదని. లేకపోతే ఇబ్బంది ఉండేది కాదు"

"మీ కంపెనీలో చేరాలని కాదు, అవునా ప్రమీలా" అన్నాడు గోపాలకృష్ణ.

"అవును నాన్నగారు, చాలా పెద్ద కంపెనీలో ఇలాంటి నియమం ఉంటుందని విన్నాను" అంది ప్రమీల.

"గోపాల్! నీకే కంపెనీలోని వాళ్లతోనైనా బాగా పరిచయం వుందా? " అంది వేదవల్లి.

"సరేలెండి. ఆయనకు తెలిసినా తన పిల్లలకోసం చెప్పరు. పాపం! వాళ్ళంతటవాళ్ళే పైకొచ్చారు. పెద్దమ్మాయికి ఆయన ఇక్కడ ప్రయత్నిస్తే ఏదైనా ఉద్యోగం దొరకకపోయేదా? " అంది కాత్యాయని కాస్త నిష్ఠూరంగా.

"అవును పెద్దమ్మాయి రాలేదేం అనుకుంటున్నాను. ఇక్కడ లేదా? " అనడిగింది వేదవల్లి.

"బెంగుళూరులో ఇన్ఫోసిస్‌లో చేరింది" చెప్పాడు గోపాలకృష్ణ.

"మీరైనా చెప్పండి ఆయనకు. ఇక్కడా వాళ్ళ ఆఫీసు ఉందటగా ఇక్కడికి బదిలీ చేయించే ప్రయత్నం చేయమని" అంది కాత్యాయని.

"వేదా! నువ్వయినా నచ్చచెప్పు ఈవిడకి. ఈ రోజుల్లో చదువుకొన్న ఆడపిల్లలు ధైర్యంగా తమ బాగోగులు తాము చూసుకోగలుగుతున్నారంటే వినడం లేదు" అన్నాడు గోపాలకృష్ణ.

"అది కాదండి వేదవల్లిగారూ! మేమెలా పెంచాం పిల్లల్ని! ఇవాళ ఊరు కాని ఊరు పంపేసి తన సంగతి తను చూసుకోగలదని వదిలేస్తే ఎలా? ఏమో నన్ను నేను సమాధాన పరుచుకోలేకపోతున్నాను"

"కాత్యాయనీ... కొద్ది రోజులుపోతే నీకే అలవాటవుతుంది. నీలో వస్తున్న మార్పుని నువ్వు కనుక్కోలేకపోతున్నావు" అన్నాడు గోపాలకృష్ణ.

చల్లటి బత్తాయి రసం, వేయించిన జీడిపప్పు, వేరుశనగ పప్పు తెచ్చిపెట్టాడు నౌకరు, కాత్యాయని తీసుకోలేదు-"నాకు రాత్రిపూట తీసుకుంటే పడిశం పడుతుంది" అంటూ.

"పోనీలెండి కాసేపాగి వేడివేడిగా సూపు తెప్పిస్తాను. అందాక కనీసం జీడిపప్పయినా తినండి" అంది వేదవల్లి, ఆవిడ ముందుకు ప్లేటు తోస్తూ.

"కొలెస్ట్రాల్ పెరుగుతుంది. జాగ్రత్త రెండు మూడు కంటె ఎక్కువ తినకండి. మీరు" అని భర్తతో అంటూ తను రెండంటే రెండు జీడి పప్పులు, రెండు వేరుశనగ పప్పులు చేతిలోకి తీసుకుంది కాత్యాయని.

గోపాల్ భార్య చెప్పినట్టే రెండు జీడిపప్పులు, ఒక వేరుశనగ పప్పు చేతిలోకి తీసుకుని 'సరేనా' నీ ఆజ్ఞను పాలించానా లేదా" అన్నట్టు చూశాడు నవ్వుతూ. అది చూసి వేదవల్లి వస్తున్న నవ్వునాపుకుంటూ "సూప్

తెమ్మని చెప్పి వస్తాను" అంటూ లేచి లోపలికి వెళ్ళింది.

వేదవల్లి లోపలకు వెళ్ళగానే "మీకు చల్లగాలిలో కూర్చుంటేనే పడిశం పడుతుంది. అంత చల్లటి బత్తాయి రసం రాత్రి పూట తాగితే ఒక వారం రోజులు పడుతుంది పడిశం తగ్గే టప్పటికి" అంది కాత్యాయని.

"నువ్వు తాగవు. నన్ను తాగనీయవు. ఎక్కడికైనా వచ్చినప్పుడయినా ఇలాంటి ఆంక్షలు పెట్టకు బావుండదు" అన్నాడు గోపాలకృష్ణ.

"నిజమేనమ్మా... మేడమ్ రావొచ్చు మీ ఇద్దరి గొడవ వింటారేమో ఆవిడ" అన్నాడు హరి.

"బాగుందిరా మీ వరుస. ఆయనేమో 'ఆంక్ష'లంటారు. నువ్వేమో 'గొడవ' అంటావు. అందుకే నేనెక్కడికి రానసలు. బలవంతపెట్టి తీసుకురావడం, ఏమీ తెలియని పల్లెటూరి బైతునన్నట్టు నాకు పాఠాలు చెబుతారు. మీరనుకుంటున్నట్టు ఆవిడేమీ అనుకునే మనిషిలా కనపడటంలేదు. ఎంతో సీదాసాదాగా ఉన్నా రు. ఇసుమంత కూడా గర్వం లేదు. ఏమీ లేనివాళ్ళు కూడా ఎంతెంత గొప్పలు పోతారో తెలుసా? వేదవల్లిగారు పెద్ద కంపెనీ యజమాని అంటే ఎలా ఉంటుందో అనుకుంటూ వచ్చాను. ఎంత అతిశయంగా ఉంటుందో అనుకున్నాను. చూడగానే ఎంత ఆప్యాయతగా పలకరించారో, నాకు నోట మాట రాలేదు ముందు"

"ఏమిటి కాత్యాయనిగారు నన్ను గురించి ఏదో అంటున్నారు" లోపలి నుంచి వస్తూ అంది వేదవల్లి. ఆమె వెనకే నౌకరు ట్రేలో సూప్ బౌల్స్ తీసుకు వచ్చాడు.

"ఇంతవరకూ కాత్యాయని అంతగా పొగిడినవాళ్ళని చూడలేదు నేను. నువ్వింత మంచిదానివి, అంత మంచిదానివి అంటోంది. చూసీ చూడగానే ఆవిడ నీ ఆకర్షణలో పడిపోయింది" అన్నాడు గోపాలకృష్ణ సంతోషంగా.

"ఆడవాళ్ళంటే ఆడవాళ్ళకు పడదంటారు మగవాళ్ళు. కాని నిజానికి ఆడవాళ్ళతోనే ఆడవాళ్ళు మనసు విప్పి మాట్లాడతారు" అంది వేదవల్లి.

"అది నీ అనుభవం. ఆడా మగా అని కాదు నచ్చిన మనిషితో మనసు విప్పి మాట్లాడతారు ఎవరైనా" అన్నాడు గోపాలకృష్ణ.

"వేడిగా ఉంది సూపు తీసుకోండి" అంటూ పింగాణీ గిన్నెలో వేయించిన బ్రెడ్డు ముక్కలు వేసి బౌల్ కాత్యాయని చేతికందించింది వేదవల్లి.

కాత్యాయని సూప్ కొంచెం తాగి "మిరియాల చారులా ఉంది. ఇంకేమిటో కలిపారు" అంది.

"చెప్పుకోండి చూద్దాం? " వేదవల్లి కవ్వింపుగా అంది.

## ఆరుద్ర కాదు.. ఆదుర్దా



తాపీ ధర్మారావు గారు, ఆరుద్ర కలిసి కొన్ని సినిమాలకు పని చేశారు. తమ ఇద్దర్నీ గురించి ఒకాయన 'ఒకరు తాపీ.. ఇంకొకరు ఆదుర్దా' అని వ్యాఖ్యానించారని ముసిముసి నవ్వులు నవ్వుతూ తరచూ చెప్పేవారు ఆరుద్ర.

తనను 'ఆదుర్దా'గా వెక్కిరించినా దాన్నే పదేపదే మిత్రులకు చెప్పుకుని మనస్ఫూర్తిగా నవ్వుకోవడం ఆరుద్రకే చెల్లింది.

మరో చెమ్చా సూపు తాగి "బియ్యపు పిండి వేశారా?" అడిగింది కాత్యాయని.

"కాదు. కొంచెం గంజిలో కాసిని మెతుకులు మెత్తగా మెదిపాను".

"అయితే మీరే చేసి తీసుకువచ్చారన్న మాట. బావుంది. అమెరికాలో ఇలా చేస్తారా".

"అమెరికాలో నేను చూడలేదు. ఒకసారి ఢిల్లీ వెళ్ళినప్పుడు ఇండియా ఇంటర్‌నేషనల్ సెంటర్‌లో భోజనానికి వెళితే ఇచ్చారు. అక్కడి బేరర్‌ని అడిగాను. దానిని గురించిన వివరాలు రాసున్న కాగితం తెచ్చిచ్చాడు. ఇలాంటి సూప్‌ని బ్రిటిషు వారికి ఎవరో ఇండియాలో ఇచ్చారట. వాళ్లు బాగుందని మెచ్చుకున్నారట. అందుచేత అన్ని రకాల సూపులతోపాటు ఈ సూపునూ చేస్తున్నారట!"

"నిజంగా రుచిగా ఉంది. నా చిన్నప్పుడు జ్వరం పడితే ఇలాగే మా అమ్మ మిరియాల చారులో మెత్తగా అన్నం కలిపి పిండి పిప్పి తీసి ఆ పల్చటి అన్నంచారు తాగించేది. ఈ సూపు తాగితే నా చిన్నతనం గుర్తుకొస్తోంది" అంది కాత్యాయని.




భోజనాల దగ్గర ఎవరూ అంతగా మాట్లాడలేదు. 'కూర బావుంది', 'ఇంకాస్త వేసుకోండి' లాంటి మాటలు తప్పిస్తే మరే విషయం మీదా మాటలు గాని, చర్చలు గాని లేవు.

గోపాలకృష్ణ సాంబారులో నంజుకోవడానికి మళ్ళీ బంగాళదుంపల వేపుడు వేసుకోబోతే కాత్యాయని "ఇప్పటికే రెండుసార్లు వేసుకున్నారు. బంగాళదుంప ఎక్కువ తినడం ఆరోగ్యానికి మంచిది కాదు. వడియాలు, అప్పడాలు నంజుకోండి" అంది.

గోపాలకృష్ణ వేదవల్లి వంక చూసి చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు. పిల్లలిద్దరూ తల్లి అలా తండ్రికి ఆంక్షలు పెట్టడం చూసి ఒకరిముఖాలొకరు చూసుకున్నారు.

"గోపాల్ నువ్వు చాలా అదృష్టవంతుడివి. ఇంత చక్కగా నిన్ను చూసుకునే భార్య దొరికింది" అంది వేదవల్లి మెచ్చుకోలుగా.

"ఆయనలా అనుకోరు. నేను ఇష్టమైనవేవీ తిననివ్వననుకుంటారు. పిల్లలూ అంతే. వాళ్ళ ఆరోగ్యం కూడా వాళ్ళు చూసుకోరు. ఇక నాకు తప్పదు కదా" అంది కాత్యాయని.

భోజనాలయ్యా అవగానే గోడ గడియారంలో పది గంటలవడం చూసి "అబ్బో పదయిపోయింది. ఇక వస్తాం" అని లేచి నుంచుంది కాత్యాయని.

"ఒక్క క్షణం కూర్చోండి. ఇప్పుడే వస్తాను" అని లోపలికి వెళ్ళింది వేదవల్లి. ఆవిడ వచ్చే వ్యవధిలో ఎదురుగా టేబుల్ మీద వున్న వేదవల్లి, మనోహర్ల ఫోటో దగ్గరగా వెళ్ళి చూస్తూ నుంచుంది కాత్యాయని. కాని మనోహర్‌కి అటుపక్కన నుంచున్న తెల్లావిడెవరో ఆవిడకు అర్థం కాలేదు.

"ఏమిటి అంత దీక్షగా చూస్తున్నారు. ఇటొచ్చి ఒక క్షణం కూర్చోండి" అంది వేదవల్లి నౌకరుతో ట్రేలో ఏవేవో పెట్టించుకొచ్చి.

కాత్యాయని కూర్చోగానే బొట్టు పెట్టి పాలపిట్టరంగు మైసూరు సిల్కుచీర, రవిక ఒడిలో పెట్టింది.

"వద్దు వద్దు?" అంటూ లేవబోయింది కాత్యాయని- హఠాత్తుగా ఆవిడంత ఖరీదుగల బట్టలు పెడితే.

"మొదటిసారి మా ఇంటికి వచ్చారు. తీసుకోండి. ఇకముందు వచ్చినప్పుడు ఏమీ ఇవ్వనులెండి... గోపాల్ ఇది నీకు. ఇది జంట్స్ వాచీయేలే" అంటూ అతని చేతికిచ్చి, "ప్రమీలా ఇది నీకమ్మా ఇది లేడీస్ వాచ్ సన్నగా ఉంది. ఇవాళ రేపు ఆడపిల్లలు పెద్దపెద్ద వాచ్‌లు పెట్టుకొంటున్నారు కాని నీకలాంటిది ఇష్టముంటుందో లేదోనని ఇది తీసుకున్నాను... హరీ! నీకేమీ ఇవ్వదలచుకోలేదు. నీకిది నేనిచ్చే పనిష్‌మెంట్" అంది వేదవల్లి.

"పనిష్‌మెంటా? " ఆశ్చర్యంగా అంది కాత్యాయని.

"మరి- అంత డబ్బు పెట్టి అంత పెద్ద బొకే ఎవరు తెమ్మన్నారు అతణ్ణి మేమిచ్చే కొద్దిపాటి జీతం మామీదే ఖర్చుపెడితే ఎలా? "అంది.

ఫోను మోగుతుంటే "ఒక్క క్షణం" అంటూ కొద్ది దూరంలోనే ఉన్న ఫోను దగ్గరకు వెళ్ళి రిసీవర్ ఎత్తింది.

అటువైపు నుంచి ఎవరో మాట్లాడుతున్నారు. ఎంత వినొద్దనుకున్నా వినపడుతూనే ఉన్నాయి ఆవిడ మాటలు అందరికీ.

"అవును సెల్ స్విచాఫ్ చేశాను.. మన కంపెనీ మూడవ యానివర్సరీ కదా అని గోపాల్ వాళ్ళ కుటుంబాన్ని భోజనానికి పిలిచాను... ఇంకా నయం ఎలా మర్చిపోతాను. ఆదివారం కూడా వాళ్ళని యానివర్సరీ పేరుతో ఆఫీసుకు పిలవదలచుకోలేదు. అందుకని రేపు సెలబ్రేట్ చేస్తాం... అందరికీ వాచీలు తెప్పించాను... పోనీలెండి రాలేకపోతే మీరు లేరనే అందర్నీ పిలవ లేదు... సరే ఇవ్వండి... రేచల్ హౌ ఆర్ యు... థాంక్యూ" అని ఫోను పెట్టేసి "సారీ ఆయన దగ్గర నుంచి ఫోను. హరీ నీకు రేపు మిగతా అందరితోపాటు ఇస్తాను" అంటూ కారువరకూ వచ్చి వాళ్ళని సాదరంగా సాగనంపింది వేదవల్లి.

* * *

కారులో ఎవరూ మాట్లాడుకోలేదు. ఎవరి ఆలోచనలో వారున్నారు. ఇంటికి చేరుకున్నాక కాత్యాయని పడుకోబోయే ముందు భర్తతో, "మీతో నేను రావడం మంచిదయింది" అంది.

"ఏం? లేకపోతే నాకేమయినా అయిపోయేదా" అన్నాడు నవ్వుతూ గోపాలకృష్ణ.

"ఈవిడతో ఇక భయంలేదు. కాకపోతే ఆవిడ మిమ్మల్ని 'గోపాల్' అనడం మీరు ఆవిణ్ణి 'వేద' అనడం మాత్రం నాకంతగా నచ్చలేదు".

"ఆవిడ నాకు కాలేజీలో క్లాసుమేట్. కాలేజీలో చదువుకొనే విద్యార్థులు ఒకరినొకరు మీరు అని మాట్లాడుకోరు. పూర్తి పేరు పెట్టి పిలుచుకోరు".

"కుటుంబాలా, మీరిద్దరూనా" అంది నవ్వును దాచుకుంటూ ఆవిడ.

"ఒకవేళ మేమిద్దరం ఆ రోజుల్లో దగ్గరైన వాళ్లమే అనుకో. అయితే ఇన్నేళ్ళ తర్వాత నీకొచ్చిన బాధ ఏమిటి? "

"ఇప్పుడు కొత్తగా నాకేమీ బాధలేదు లెండి. నన్ను చేసుకోక పూర్వం మీరెవరితో తిరిగితే నాకేమిటి"

"సరేలే. ఇక ఆ గొడవ మానేయ్. నీకీ అనుమాన పిశాచం మాత్రం వదలేటట్టు లేదు. వయసు పైబడ్డకొద్దీ ఆ జబ్బు ఇంకా ఉధృతమవుతోంది"

"మీరింత అందంగా ఉంటారు కదా? ఎవరి మనసు మీమీద పడుతుందోనని నా భయం" అంది దగ్గరగా వచ్చి కూర్చుని.

"పోనీలే... అంతవరకు నామీద అపనమ్మకం లేదు. ఇతరులమీదే నీ అనుమానం. అయినా కాత్యాయనీ, ఆడవాళ్ళందరికీ ఇక వేరే పనేం లేదా అందమైన మగవాడు కనపడితే వెంటపడడం తప్ప. నాకంటె అందంగా ఉండేవాడు కనపడితే నీ మనసు కూడా చలిస్తుందా? "

ఉలిక్కిపడిందావిడ "అదేమిటి అలా అన్నారు" అంది ఏడుపు దిగమింగుతూ.

"నీలాంటివాళ్ళే మిగతా ఆడవాళ్ళు కూడా.



ఎందుకు అలా చులకనగా మాట్లాడతావు ఇతరుల గురించి. నువ్వసలు ఇల్లు దాటి బయటకు రాకపోవడం వల్ల ఇలా పిచ్చిపిచ్చిగా ఆలోచిస్తున్నావ్" అన్నాడు పక్కకు తిరిగి పడుకొని.

కాత్యాయని ఏం మాట్లాడలేదు. కాసేపు మౌనంగా ఉండిపోయింది, ఏదో ఆలోచించుకుంటూ.

"ఏమండీ... నిద్ర పోయారా? నాకొక

సందేహమండీ" అంది.

"ఏమిటి నీ సందేహం? నాన్చక త్వరగా చెప్పు. నిద్రొస్తోంది" అన్నాడతడు.

"ఏం లేదండీ. ఫొటోలో భర్తకు ఇటు పక్క ఈవిడా, అటుపక్క ఆ తెల్లావిడా. ఏమిటావిడ పేరు? "

"రేచల్"

"ఆవిడ వీళ్లతో కలిసి నుంచుని ఉండడం ఏమిటి? "

"ఇక్కడ వేదవల్లి ఎలా ఈ కంపెనీ చూస్తోందో, అమెరికాలో ఆవిడ అక్కడి కంపెనీ చూస్తోంది. ఆవిడ ఆయన పార్టనర్"

"ఆవిడ అక్కడ పార్టనర్ అయితే, ఈవిడ ఇక్కడ పార్టనరన్నమాట" అంది నవ్వుతూ.

"ఎందుకా నవ్వు" ఆడవాళ్ళు పార్టనర్‌గా ఉండకూడదా? "

"ఎందుకుండకూడదూ! ఆవిడ కంపెనీలోనే పార్టనరా, జీవితంలో పార్టనరా అని"

"నీకిలాంటి సందేహాలు, అనుమానాలు ఎలా వస్తాయే... మాకెవ్వరికీ ఏమీ అనిపించలేదు"

"మీరూ, పిల్లలూ కుర్చీలో అతుక్కు కూర్చున్నారు. ఆవిడ లోపలికి వెళ్ళినప్పుడు నేను లేచి భోజనాల గదిలో మూల టేబుల్ మీదున్న వాళ్ల ఫొటో చూశాను"

"అమెరికాలో ఎన్నో ఏళ్ళుగా ఉన్నవాళ్లు. అలా ఫొటోలు తీయించుకోవడం సాధారణమే. అయినా కాత్యాయనీ! నీ కళ్ళ నుంచి ఏదీ తప్పించుకోలేదే! ఏం నిశిత పరిశీలన!"

"మగవాళ్ల కంటే ఆడవాళ్ళకు ఇల్లెలా పెట్టుకున్నారా అని చూడడం అలవాటు. అలా నా కంటపడింది"

"ఓహో! మగవాళ్లకు వాళ్ళేదైనా పెడితే తినడం, రావడమూనా!" అన్నాడతను నవ్వుతూ.

"మీకంతా నవ్వుతాలే. అక్కడ హాయిగా లొట్టలేసుకుంటూ భోజనం ఎక్కువే లాగించారు. ఇక పడుకోండి. నాకూ నిద్ర వస్తోంది" అందావిడ ఆవులిస్తూ.

## 11

ఒకరోజు వేదవతి దగ్గరునుండి ఫోను వచ్చింది. "గోపాల్ ఒకసారి ఆఫీసుకు వస్తావా? నీతో మాట్లాడాల్సిన పనుంది" అంటూ.

'ఏం పనబ్బా! హరి ఏమైనా సరిగ్గా పని చేయడం లేదా ఈమధ్య' అనుకుని వెంటనే వేదవల్లి ఆఫీసుకు బయలుదేరాడు.

"వెంటనే వచ్చేశావే. అంతగా కంగారుపడే విషయమేమీ కాదులే. నీతో సంప్రదించడం ఎందుకైనా మంచిదని పిలిచాను. నీ పనికేం ఆటంకం లేదు కదా, ఇక్కడ కాసేపు కూర్చుంటే" అంది వేదవల్లి.

"పరవాలేదు. అసిస్టెంటుకు చెప్పి వచ్చాలే. అర్జంటు పనుంటే ఫోను చేస్తాడు. అసలింతకీ ఎందుకు పిలిచావు? "

"ఇది ఆఫీసుకు సంబంధించింది కాదు లే... భోజనం టైమైందిగా. మీ ఆవిడ నీకు లంచ్‌బాక్స్ పెట్టివ్వలేదు కదా"

"నేను పన్నెండున్నరకే భోజనం చేస్తాను. మ్యాగజైనులు చదివి చదివి కొలెస్ట్రాల్ పెరగకుండా, బరువు పెరగకుండా భోజనం కట్టిస్తుందిలే. అందువల్ల వాటిల్లో నాకిష్టమైనవేవీ ఉండవు" అన్నాడు నవ్వుతూ, ఆవిడతోపాటు నడుస్తూ.

"అన్నట్టు నీకు బంగాళాదుంప వేపుడు ఇష్టం కదా! బహుశా ఇవాళ అదే చేసినట్టుంది మా వంటమ్మాయి. తినగలిగినంతే తిను నాతోపాటు" అంటూ భోజనాల గదికే నేరుగా తీసుకెళ్ళింది గోపాలకృష్ణని.

భోజనం చేస్తూ "ఇంతకీ నన్ను ఎందుకు పిలిచినట్టు" అన్నాడతను.

"మీ అమ్మాయి ప్రమీలకు ఉద్యోగం వచ్చిందా? ఫస్టుక్లాసులో పాసయిందటగా" అంది.

"అవును. ఏవో ప్రయత్నాలు చేస్తోంది. నిముషాల మీద ఉద్యోగాలెలా దొరుకుతాయి? "

"నిజమే. మీ ఆవిడ పిల్లల పెళ్ళిళ్ళ మాట తలపెట్టడం లేదా? "

"సరేలే. ఎందుకు తలపెట్టదు. పెద్దమ్మాయి రెండు మూడేళ్ళ వరకు ససేమిరా పెళ్ళి చేసుకోనంది- అన్నట్టు నీకు గుర్తుందా మా అక్క విమల? "

"ఆс పేరు సరిగా గుర్తులేదు కాని ఆవిడ బాగా గుర్తున్నారు. భలే అందంగా ఉండే వారావిడ"

"ఇప్పుడూ అందంగానే ఉంది. వాళ్ళ పెద్దబ్బాయికి మా పెద్దమ్మాయినివ్వమని అడిగింది. అది చేసుకోనంటే మా రెండో అమ్మాయినిమ్మంది"

"ఇద్దామని నిశ్చయించారా? "

"లేదు. పెద్దమ్మాయికి కాకుండా, రెండవ దానికి వీలు కాదంది కాత్యాయని. మా అక్క కొడుకు అంత బావుండడు. అందుకే ఆమెకు అసలు ఇష్టం లేదు"

"అదేమిటి? ఆవిడంత అందంగా ఉంటారు కదా!"

"కొడుకులిద్దరికీ తండ్రి పోలికలొచ్చాయి. అక్కకు కోపం వచ్చి మాకు శుభలేఖ కూడా పంపకుండా పెద్దబ్బాయికి పెళ్ళి చేసేసింది. మా అక్కకి కాస్త హోదా, డబ్బున్న వాళ్ళంటే ఇష్టం. ఈ రెంటికంటే అందం అంటే మరీ ఇష్టం"

"అవునా? మరి ఆవిడ భర్త పోలికలు పిల్లలకు వచ్చాయన్నావ్. ఆయన అంత బావుండరా? "

"బావుండడు"

"ఆవిడెలా ఇష్టపడ్డారు పెళ్ళికి? "

"కట్నం లేకుండా చేసుకుంటానన్నాడు తన అందం చూసి. దాంతో ఆనందపడిపోయింది. పైగా పెద్ద కంపెనీలో అప్పటికే మంచి ఉద్యోగంలో ఉన్నాడు. హోదా, డబ్బు ఉన్నాయి కదా, అందం లేకపోయినా అని సరిపెట్టుకుంది. మా అక్కకి నువ్వంటే ఇష్టంగా ఉండేది" అన్నాడు నవ్వుతూ.

"నేనేమీ అందంగా ఉండేదాన్ని కాదుగా"

"మీ అన్నయ్యకు కలెక్టరు హోదా ఉండేది కదా! అందుకని నువ్వు అందంగానే ఉన్నట్టు తన లెక్కలో"

"మా అన్నయ్యకు హోదా ఉండేది కాని మా తలిదండ్రులు మాకేమీ ఆస్తి మిగిల్చిపోలేదు. గొప్పలకుపోయి విచ్చలవిడిగా ఆస్తంతా హారతికర్పూరం చేసేశారు. ఆ తరవాత కొద్ది రోజులకే ఇద్దరూ పోయారు. అన్నయ్య నా చదువు వరకు చూడగలిగాడే కాని, కట్నం ఇచ్చి పెళ్ళి చేసే స్థితిలో లేకపోయాడు"

"నీ పెళ్ళెప్పుడయింది? "

"బి.కామ్ పూర్తిచేసిన కొద్ది రోజులకే. నేను ఎమ్.కామ్ చేద్దామనుకున్నాను. అప్పుడు ఇన్ని కోర్సులుండేవి కావుగా"

"మనోహర్‌గారు నిన్ను కట్నం తీసుకోకుండానే చేసుకున్నారా? "

"ఆс! ఆయన ఏదో పనిమీద ఇండస్ట్రీస్ మినిస్ట్రీకి వచ్చారట. అక్కడ అన్నయ్య డైరెక్టరుగా ఉన్నాడు. ఆయన లోపలికి వచ్చేటప్పటికి అన్నయ్య నాతో ఏదో ఫోనులో మాట్లాడటం విన్నారట. ఆయన ఆశ్చర్యపడి "మీరు తెలుగువారా" అన్నారట తెలుగులో. నీకు విసుగ్గా ఉంది కదూ"

"లేదు, లేదు, చెప్పు"

"వాళ్ళిద్దరూ మాట్లాడుకుంటూ వుండగా నేను అన్నయ్య గదిలోకి వెళ్లాను.-నా ఫారమ్ మీద గార్డియన్‌గా తన సంతకం కోసం. అన్నయ్య నన్నాయనకు పరిచయం చేశాడు. 'నా చెల్లెలు తనతోనే మాట్లాడుతున్నాను మీరు వచ్చేటప్పటికి. కింద రిసెప్షన్ నుంచి ఫోను చేసింది.' అని చెప్పాడు. ఆయన నమస్కారం చేశాడు. అప్పుడు నేనాయన్ని సరిగా చూడనేలేదు"

"కాలేజీలో చదివేటప్పుడు కూడా అలాగే వుండేదానివి కదా! నీ చదువేమిటో, నువ్వేమిటో అన్నట్టుండేదానివి"

"నీకప్పటి సంగతులు ఇంకా గుర్తున్నాయన్నమాట... ఇవన్నీ నీకెందుకు చెబుతున్నా

నిప్పుడు! అసలు సంగతి చెప్పనీయ్. మా కంపెనీలోనే ఒకతను పనిచేస్తున్నాడు. అతణ్ణి మనోహర్ అమెరికా ఆఫీసుకు బదిలీ చేద్దామనుకుంటున్నాడు. చాలా తెలివైన వాడు. పనిలో మంచి అనుభవం కూడా సంపాదించాడు."

"అతడి గురించి నాకెందుకు చెబుతున్నావ్? హరి అంత బాగా పనిచేయలేకపోతున్నాడా?"

"ఛ!ఛ! అదేమిటలా అంటున్నావు. ఎవరో బాగా చేస్తున్నాడంటే హరి బాగా చేయడం లేదనా అర్థం? పూర్తిగా వింటే అసలు సంగతి అర్థమవుతుంది నీకు. హరి నిన్న అతణ్ణి తీసుకుని నా దగ్గరకు వచ్చాడు. అతను ప్రమీలను రోజూ కాలేజీకి వెళుతుండగా చూసేవాడట. చాలా అందంగా ఉంటుంది కదా! కళ్ళు తిప్పుకోలేక, మనసూ తిప్పుకోలేక అవస్థ పడుతున్నాడట. పెళ్లి చేసుకుంటాడట."

"ఎలా వేదా. కాత్యాయని రాద్ధాంతం చేస్తుంది. ఒప్పుకోదు. తనకు కులం పట్టింపు. పైగా భార్గవికి పెళ్ళి కాకుండా రెండవదానికెలా పెళ్ళిచేస్తాం అంటుంది. ఇది జరిగే విషయం కాదు."

"జరిగేటట్టు చేస్తే బావుంటుందేమో"

"అది నా వల్లకాదు. అయినా వాళ్ళిద్దరూ నీ దగ్గర కెందుకొచ్చారు?"

"నిన్ను ఒప్పించమని. హరి, అతను ప్రాణస్నేహితులయిపోయారు."

"భార్గవి పెళ్ళయ్యేవరకు అతను ఆగితే అప్పుడు ఆలోచించవచ్చు"

"పూర్తిగా విను ముందు. అతను తెలుగు వాడు కాదు. వాళ్ళ నాన్నగారు ఆంధ్రకేడర్ ఐ.ఎ.ఎస్. ఆఫీసరు. రిటైరయ్యాక పో

## మెగ్నీషియంతో మెమరీ...

ఏదో 'ఇగ్నిషన్' ఇచ్చినట్టు మెగ్నీషియంతో జ్ఞాపకశక్తి మెరిసిపోతుందంటారేమిటి అని ఆశ్చర్యపడకండి. అది ముమ్మాటికీ నిజం అంటున్నారు మెసాచుసెట్స్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ శాస్త్రవేత్తలు. ఎముకల్ని బలంగా ఉంచటానికి, ప్రోటీన్ల తయారీకి, కండరాల్లో నిల్వ ఉండే శక్తిని విడుదల చెయ్యడానికీ, శరీర ఉష్ణోగ్రత క్రమబద్ధీకరించడానికి మెగ్నీషియం ఉపకరిస్తుందని మనకి తెలుసు.

అయితే ఈ శాస్త్రవేత్తలు మెగ్నీషియం పోషించే కొత్త పాత్రని తమ పరిశోధనల ద్వారా కనుగొన్నారు. మధ్య వయసు, ఆ పైబడ్డ వాళ్ళలో క్షీణించే జ్ఞాపకశక్తిని పెంచడంలో మెగ్నీషియం ముఖ్యపాత్ర పోషిస్తుందని నిరూపించారు. మనం తీసుకునే ఆహారంలో ఉండే ఆకుకూరల్లో దాదాపు 400 మి.గ్రా. మెగ్నీషియం లభ్యమవుతుంది. మెగ్నీషియం మెదడులో జ్ఞాపకశక్తికి సంబంధించిన భాగాన్ని చైతన్య పరుస్తుందని నిరూపించారు ప్రొఫెసర్ గేసంగ్ లివ్, ఇమాస్లుట్స్కీ. మెగ్నీషియం కొరతవల్ల జ్ఞాపకశక్తి, గ్రహణ శక్తి తగ్గుతాయి. సెరిబ్రో స్పైనల్ ఫ్లూయిడ్‌లో మెగ్నీషియం ప్రమాణం తగ్గకుండా ఉండేట్టు చూడగలిగితే మెదడులో జ్ఞాపక శక్తికి సంబంధించిన భాగం చాలా చురుకుగా, చైతన్యవంతంగా పనిచేస్తుంది.

"థ్యాంక్స్ టు మెగ్నీషియం" అందామా!



యారు. వాళ్లు ఉత్తరప్రదేశ్ బ్రాహ్మలు."

"వేదా! లాభం లేదు. ఈ పని నావల్ల కాదు. అందులో అతను అమెరికా వెళ్ళిపోబోతున్నాడు"

"భలేవాడివే. అందరు తల్లిదండ్రులూ అమెరికా అల్లుడే కావాలని ఉవ్విళ్ళూరుతారు? "

"అందరిదీ ఒక దోవ అయితే ఉలిపికట్టెది ఇంకొక దోవ. మాదంతా ఒక రకంలే. ఇప్పుడు ఆ భారతం అంతా ఎందుకులే. అన్నట్టు కాత్యాయనికి ఒక సందేహం వచ్చింది. ఈ సారి వచ్చినప్పుడు చెబుతాలే దాని సంగతి"

"అయితే అప్పుడు నా భారతం విప్పాలన్నమాట" అంటు నవ్విందావిడ.

"నాకు తెలియదు నీకూ ఒక భారతం ఉందని" అంటూ నవ్వుతూ వెళ్ళిపోయాడు గోపాలకృష్ణ.

వేదవల్లి హరిని పిలిచి "మీ నాన్నకు అభ్యంతరం ఉండదు. మీ అమ్మ విషయం చెప్పలేం. మీ నాన్న ఒక మాట అన్నారు. పెద్దపిల్ల పెళ్ళి కానిదే చిన్న పిల్ల పెళ్ళికి మీ అమ్మ ఒప్పుకోదని" అంది.

"భార్గవి రెండు మూడేళ్ళ వరకు పెళ్ళి చేసుకోనని భీష్మించుకు కూర్చుంది మేడమ్. ఇక చేయగలిగిందేమీలేదు. ప్రదీప్‌తో చెప్పేస్తాను ఇది కుదిరే వ్యవహారం కాదని" అంటూ నిరాశగా లేచి వెళ్ళాడు హరి.

హరి చెప్పిందంతా విన్న ప్రదీప్, "నాకేమీ అభ్యంతరం లేదు. మీ పెద్దచెల్లి పెళ్ళయ్యాక ప్రమీలను తప్పకుండా నా కిచ్చి చేస్తారో లేదో కనుక్కో మీ యింట్లో" అన్నాడు.

హరి గొంతులో పచ్చి వెలక్కాయపడినట్టయింది. దానికేం సమాధానం చెప్పాలో అర్థంకాక గుటకలు మింగాడు. "నాకు కొంచెం టైమివ్వు. మా యింట్లో వాళ్ళని ఒప్పించడానికి ప్రయత్నిస్తాను. అసలు ప్రమీల ఏమంటుందో ముందు తెలుసుకుంటాను" అన్నాడు హరి.

* * *

ప్రమీల తన గదిలో కంప్యూటర్ ముందు కూర్చొని ఏదో చూస్తోంది.

'ప్రమీలా' అంటూ లోపలికి వచ్చాడు హరి. ఏమిటన్నట్టు తలతిప్పి అతణ్ణి చూసింది

"నీకు అమెరికాకు వెళ్ళాలని ఉందా? "

"నాకు అక్కడ ఉద్యోగం దొరుకుతుందా? "

"నీ మనసులో ఉద్యోగం తప్ప మరేమీ ఉండదా? "

"ఏం ఉంటుంది. ఇంకేముండాలసలు."

"నిన్నెవరయినా పెళ్ళి చేసుకుని అమెరికాకు తీసుకువెళ్ళి పోతానంటే పెళ్ళి చేసుకొని వెళ్ళిపోగలవా? "

"అమ్మో! మిమ్మల్నందర్నీ వదిలా!"

"అప్పుడప్పుడు వచ్చి చూస్తూ ఉండొచ్చుగా. ఇప్పుడు భార్గవి అందర్నీ వదిలి బెంగుళూరు వెళ్ళిపోలేదా ఉద్యోగం కోసం? రేపొకవేళ అమెరికాలో ఉద్యోగం దొరికినా వెళ్ళిపోతుంది ధైర్యంగా. నువ్వూ అలాగే ధైర్యంగా ఉండాలి"

"అన్నయ్యా, అక్కకున్నంత ధైర్యం నాకు లేదు"

"ఏ ఆడపిల్లయినా భర్త దగ్గరకు వెళ్ళిపోవాలిగా"

"అది నిజమే అనుకో. ముందు అక్క పెళ్ళి కావాలి గదా"

"తన పెళ్ళయ్యాక నువ్వూ చేసుకోవాలిగా"

"నేను పెళ్ళి చేసుకోనని అనలేదు కదా! ఇప్పుడెందుకా ప్రసక్తి"

"అవసరం వుంది కనుకే. నీకు ప్రదీప్ తెలుసుగా."

"తెలుసు. నీకోసం మన ఇంటికి వస్తువుంటాడు అతనేగా".

"అవును, ఆ ప్రదీపే. అతడికి నీవంటే చాలా ఇష్టమట. నిన్ను పెళ్ళి చేసుకుంటానంటున్నాడు"

"అమెరికా తీసుకువెళ్ళటం అన్నావేమిటి మరి"

"ఓ! నీకు చెప్పలేదు కదూ. వచ్చే నెల అతను న్యూజెర్సీ ఆఫీసుకు బదిలీ అయి వెళ్ళిపోతున్నాడు"

"అదా! వెళ్ళనియ్యి. గొడవలేదు"

"నీ ముఖం. న్యూజెర్సీ అంటే మరో లోకం కాదుగా!. వచ్చి చేసుకుంటాడు."

"రెండు మూడేళ్ళ తర్వాత మాట కదా. పైగా అమ్మ, నాన్న ఒప్పుకోవాలి. అతడు మన కులం కాకపోతే చస్తే ఒప్పుకోరు"

"అదంతా సరే... అసలు తనంటే నీకిష్ట మేనా? "

"ఏమో. అయినా నేనా దృష్టితో అతడి గురించి ఆలోచించలేదుగా".

"ఇప్పుడు ఆలోచించు. ముందు నీ ఇష్టం తెలుసుకోమన్నాడతను"

"నాకు కొంచెం టైమివ్వు అన్నయ్యా"

"అతను అమెరికా వెళ్ళిపోయేలోగా చెప్పు తల్లీ"

"సరే...పో అన్నయ్యా" అంటూ భుజం పట్టుకొని గది బయటకు తోసింది.

ఒక వారం తర్వాత "అమ్మ నాన్నలకు, నీకూ, అక్కకీ ఇష్టమయితే నాకూ ఇష్టమే" అని చెప్పింది ప్రమీల హరికి.

హరి తండ్రి ఆఫీసుకు వెళ్ళి ప్రమీల చెప్పిన విషయం, చెప్పిన పద్ధతి వివరిం చాడు నవ్వుతూ.

"పిచ్చిపిల్ల... దానికి స్వతంత్రంగా ఆలో చించే అవకాశమే ఇవ్వలేదు మనం. భార్గవి లాగ తనకి తాను అవకాశాలు కల్పించుకో లేదు. ఈ సంబంధం నీకు ఇష్టం. భార్గవి కూ డా అడ్డు చెప్పదు. నాకేమీ అభ్యంతరం లేదు. అందరం కలిసి మీ అమ్మను ఒప్పిద్దాం." సరేనని చెప్పు ప్రదీప్‌కి. అంతగా కావాలని అలాంటివాడు అడుగు తున్నాడంటే అంతకంటే ఆలోచించవలసిందేముంది. మనం కావాలన్నా అలాంటి సంబంధం తేగ లమా? " అన్నాడు గోపాలకృష్ణ.




హరి తండ్రి ఆఫీసు నుంచే భార్గవికి ఫోనుచేసి అన్ని విషయాలూ చెప్పాడు.

"నా పెళ్ళివరకు ఆగొద్దు. నేను రెండు రోజులు సెలవు పెట్టి ఈ రాత్రి బస్‌కే బయ లుదేరి వస్తున్నా" అని ఫోను పెట్టేసింది. గోపాలకృష్ణకు పెద్ద కూతురి తడాకా తెలుసు. 'హమ్మయ్య' అని ఏదో పెద్ద బరువు తీరి నట్లుగా సంతోషించాడు.

చెప్పినట్టుగానే భార్గవి బెంగుళూరు నుంచి మరుసటి రోజు ప్రొద్దుటే వచ్చింది కాల్ బెల్లు కొట్టగానే కాత్యాయని తలుపు తీసింది. ఎదురుగా భార్గవి.

"అమ్మా ఎలా ఉన్నావ్" అంది నవ్వుతూ.

పెద్ద కూతుర్ని చూసి ఆశ్చర్యపోయి, "ఏమి టింత హఠాత్తుగా. అయినా నీకు నేనిప్పుడు గుర్తు వచ్చానా? " అంటూ కళ్ళనీళ్ళతో కౌగ లించుకుని లోపలికి తీసుకువచ్చింది. "ఏమం డీ, హరీ, ప్రమీలా ఎవరొచ్చారో చూడండి" అంటూ గట్టిగా కేకలు వేసింది.

భార్గవి వచ్చే విషయం తమకు తెలిసినా కాత్యాయనికి అనుమానం రాకుండా "ఏమ్మా అకస్మాత్తుగా వచ్చావ్? అంతా సవ్యమే కదా" అన్నాడు గోపాలకృష్ణ.

హాలులోకి వచ్చి

"భార్గవీ, ఏమిటి సంగతి ఇలా ఊడిపడ్డావ్ చెప్పాపెట్టకుండా" అన్నాడు హరి.

"అక్కా, ఎన్ని రోజులయిందే నిన్ను చూసి. చిక్కావు కాని ఇంకా బావున్నావి ప్పుడు" అంటూ ప్రమీల అక్క రెండు చేతులూ పట్టుకొంది.

"ఉన్నావ్ పెద్ద అన్నయ్యవి. నేనేదో దూరంగా ఉద్యోగం చేసుకుంటున్నాను. నువ్వేం చేస్తున్నావ్ ఇక్కడ. ప్రమీలకేదయినా ఉద్యోగం చూశావా? పోనీ పెళ్ళి కొడుకునేమ యినా వెతుకుతున్నావా? మంచి ఉద్యోగం వచ్చింది కదా అని ఇక ఇంట్లో ఎవరి సంగతీ పట్టించుకోవడం లేదు నువ్వు. అమ్మ, నాన్న పెద్దవాళ్ళయిపోతున్నారు. నాన్నగారిక రెండే ళ్ళల్లో రిటైరవుతారు. నువ్వు బాధ్యత తీసుకో వద్దా? "అంటూ హరిని దులిపేసింది భార్గవి.

భార్గవి మాటలకు బాధపడుతున్నట్టు నటిస్తూ తల వంచుకుని నుంచున్నాడు హరి.

"భార్గవీ... ఎందుకమ్మా రావడం రావడం వాడి మీద విరుచుకు పడుతున్నావు. నిజానికి ఆ బాధ్యత నాది, మీ అమ్మది" అన్నాడు గోపాలకృష్ణ.

"నువ్వు రెండు మూడేళ్ళ వరకు చేసు కోనని భీష్మించుకు కూర్చున్నావ్. దానికి పెళ్ళి సంబంధాలకేం తొందరొచ్చింది" అంది కాత్యాయని.

"సరేలే... ముందు కాఫీల సంగతి చూడు. తర్వాత తీరికగా మాట్లాడుకోవచ్చు" అన్నాడు గోపాలకృష్ణ భార్యతో.

కాత్యాయని వంటింట్లోకి వెళ్ళ గానే హరి, భార్గవి బిగ్గరగా నవ్వడం మొద లుపెట్టారు. గోపాలకృష్ణ కూడా నవ్వాపు కోలేకపోయాడు. వాళ్ళెందుకు నవ్వు తున్నారో అర్థంకాక తెల్లబోయి ఆ ముగ్గురి ముఖాలు చూస్తూ నుంచుంది ప్రమీల.

ఇంతలో కాఫీలు పట్టుకొ చ్చింది కాత్యాయని. "ఏమిటి అంత గట్టిగా నవ్వుతున్నారు, అన్ని ఆపార్టుమెంట్‌ల వాళ్ళు బయటకొచ్చేటట్టు" అంటూ.

"అమ్మా ఏడిస్తే వస్తారు. నవ్వితే రారు. అయ్యయ్యో ఎంత సంతోషంగా నవ్వుకుంటు న్నారో వాళ్ళు అని అసూయతో ఏడ్చుకుం టారు."

"చాల్లే బెంగుళూరు వెళ్ళాక ఇంకా



మాటలు నేర్చావ్" అంది తల్లి.

ఒక గుక్క కాఫీ తాగి "అమ్మా నీ చేతి కాఫీ తాగి ఎన్ని రోజులయింది!" అంటూ భార్గవి మరో కప్పు కూడా అడిగి తాగింది. కాత్యా యని బ్రహ్మానంద పడిపోతూ హడావిడి పడి పోయింది.

"నిజానికి కాఫీ ఈ రోజు అంత బాగోలేదు. భార్గవీ బలే మస్కా కొడుతున్నావే అమ్మకి" అని హరి ఆశ్చర్యపోయాడు పెద్ద చెల్లెలి నేర్ప రితనానికి.



బ్రేక్‌ఫాస్టు దగ్గర "అమ్మా... నా పెళ్ళికేం గాని, ప్రమీలకు పెళ్ళి చేసేద్దాం. ఉన్నకొద్దీ అందం తేలుతోంది" అంది భార్గవి పెసరట్టు ముక్క తుంచుతూ.

"అదేమిటే భార్గవీ. నీకు మాత్రం అంద మేమి తక్కువ. అదృష్టవశాత్తు మీ ముగ్గు రికీ మీ నాన్నగారి వైపు వాళ్ల అందా లొచ్చాయి"

"నాన్నగారూ అసలు జీవితా నికి పెళ్ళి ముఖ్యమా అనిపి స్తోంది నాకు" అంది భార్గవి.

"బాగుంది వరస. పెళ్ళి ముఖ్యం కాకపోతే ఏది ముఖ్యం, ఉద్యోగమా? ఒంటరిగా ఉండడం అలవాటయిపోతే, కొన్నాళ్ళకి భర్త, పిల్లలు బరువనిపి స్తారు. అందుచేత ఏ వయసుకు తగిన ముచ్చట ఆ వయ సులో జరగాలి..." అంది తల్లి.

"అది సరే నమ్మా... ఒకవేళ నా పెళ్ళికి నాలుగయి దేళ్ళు పడుతుందనుకో అప్పటివరకూ పాపం ప్రమీలని అలా ఉంచే యటమేనా? దాని మన స్తత్వానికి చక్కగా పెళ్ళిచేసి పంపేస్తే, భర్తా పిల్లలతో హాయిగా

నీటిపుట్ట అంచున మరుభూమి... ఆశ్చర్యం గొలిపే ఈ వింత తీరం అట్లాంటిక్ సముద్రం, ప్రాచీనమైన నమీబ్ ఎడారి కలిసే చోట ఉంది. నరకప్రాయమైన ఈ తీరం నమీబియాలో 300 మైళ్ల పొడవునా వ్యాపించి ఉంది. అక్కడ చిక్కుబడిపోవడం కంటే మరణించడమే మేలనిపించేటంతటి భయంకర తీరమది. ఈ తీర ప్రాంతమంతటా వీచే పెనుగాలులు, ప్రమాదకరమైన ప్రవాహ ఉధృతి, నీటిలో పాతుకుపోయిన రాళ్లగుట్టలు, అలుముకుపోయే పొగమంచు అటుగుండా ప్రయాణించే ఎన్నో నౌకల్ని, వాటి సిబ్బందిని, ప్రయాణీకుల్ని పొట్టన పెట్టుకుంటాయి. ఏదో విధంగా ఒడ్డున పడితే ప్రాణాలు హరించడానికి అనంతమైన ఎడారి ఉండనే ఉంది. అక్కడ అనేక నౌకల అవశేషాలు, చనిపోయిన వారి అస్థిపంజరాలు కనిపిస్తుంటాయి. అలాంటి భయంకర తీరాన్నీ వెన్నెల స్నానం చేయిస్తున్నాడు నింగిలోని నిండుపున్నమి రేడు.



సంసారం చేసుకుంటుంది"

"అంటే ఏమిటంటావు ఇప్పుడు? నీ పెళ్ళి కాకుండా దాని పెళ్ళి ఎలా చేస్తామే? "

"తప్పేమిటే? "

"తప్పుకాదే... పెద్దపిల్లకు ఎందుకు కాలేదు? ఏమన్నా లోపం ఉందా అని, నీకు సంబంధాలు రావడం కష్టమవుతుందే. అయినా సంప్రదాయం కూడా కాదు"

భార్గవి పకపకా నవ్వుతూ "అమ్మా నేను చదువుకొని ఉద్యోగం చేయడం సంప్రదాయమేనా? " అంది.

"ఇవాళారేపు అందరూ చేస్తున్నారు. నువ్వూ చేస్తున్నావు. ఇవాళ నలుగురూ చేసేది రేపు సంప్రదాయం అవుతుంది"

"అలాగే నలుగురూ ఎవరికి సంబంధం వచ్చినప్పుడు వాళ్ళకి పెద్దా, చిన్నా అని చూడకుండా చేసేస్తే అదీ సంప్రదాయమే అవుతుంది? అయినా నా కోసం, నా స్వార్థం కోసం ప్రమీల జీవితం పాడుచేయడం నాకిష్టంలేదు"

"దాని జీవితం పాడవడమేమిటే... ఏమయింది దానికి? "

"ఇంకా ఏమీ కాలేదనుకో. చక్కటి సంబంధాలు వస్తుంటే కాలదన్నుకోవడమెందుకూ? అమ్మా ఒక్కటి సూటిగా చెప్పు. మన కులంలోని కుర్రవాడే మంచి ఉద్యోగంలో ఉన్నవాడు, కాణీకట్నం లేకుండా మన ప్రమీలను చేసుకుంటానంటే ఒప్పుకుంటావా? "

"ఎవరన్నా ఉన్నారా నీ దృష్టిలో? "

"మా అందరి దృష్టిలో ఉన్నాడు!

"ఏమిటే" అంటూ అలవాటు చొప్పున అరిచినంత పనిచేసింది కాత్యాయని. కాసేపటికి తెప్పరిల్లి అందరివంకా చూసింది 'నిజమేనా' అని అడుగుతున్నట్టు. అందరూ తలలు వంచుకున్నారు, ఏ సమాధానమూ ఇవ్వకుండా.

"ఏమే ప్రమీలా నీకూ తెలుసా? " అని అడిగింది.

'అవునూ, కాదూ' అనకుండా తల వంచుకుంది ప్రమీల.

"ఈ ఇల్లు నాది కాదు, ఈ పిల్లలు నావాళ్లు కారు. ఆయనా దూరం అయిపోతున్నారు. ఇన్నేళ్లూ నా ఇల్లే స్వర్గం, నా సంసారమే సర్వస్వం అని గానుగెద్దులా పనిచేసుకుంటూ నా లోకంలో నేను బతికాను. నాకు మిగిలిందేమిటి? " అంటూ ఏడుపునాపుకుంటూ లోపలకు వెళ్లిపోయింది.

గోపాలకృష్ణ తప్పనిసరిగా లేచి వెళ్లాడు భార్యను సముదాయించడానికి. వెళ్లడం వెళ్లాడే కాని ఎలా సముదాయించాలో బోధపడడం లేదతనికి. భార్య దృష్టిలో ఇదొక సంసార విప్లవం. తన సంసారం కూలిపోతున్నట్టు విలవిలలాడిపోతోంది.

"ఊరుకో కాత్యాయనీ... దేనికిప్పుడు ఏడుపు". భార్గవి మాత్రం ఏమంది? నీకిష్టం లేని పని ఇంట్లో ఎవరూ చేయరు. ఇక ఆ ఊసు ఇంట్లో ఎవరూ ఎత్తడానికి వీలులేదని చెప్పేస్తాలే. ఇన్నేళ్లు వచ్చి, పిల్లేదో అందని ఇలా ఏడవటం ఏమిటి? ఊరుకో, లేచి ముఖం కడుక్కురా. నిన్నిలా చూస్తే పిల్లలు బెంబేలు పడతారు" అంటూ అతికష్టంమీద ఆవిణ్ణి ఊరడించి బయటకు వచ్చాడతను.

"అసలు నాన్నగారిననాలి. మొదటి నుంచి అమ్మేమన్నా సరే 'ఊఁ' కొట్టి ఊరుకునేవారు. అంతా ఆవిడ ఇష్టారాజ్యంగా సాగింది. ఎల్లకాలం అలాగే సాగాలంటే ఎలా కుదురుతుంది? చిన్న పిల్లలం. అప్పుడు అమ్మ అరుస్తుందని నోరు మూసుకుని ఊరుకునేవాళ్లం. నాన్నగారికేమయింది? 'ఇలా కాదు అలా' అని చెప్పొచ్చుగా" అంటోంది భార్గవి, ఖాళీ టిఫిను ప్లేటు ముందు అలాగే కూర్చుని. హరి, ప్రమీల వింటున్నారు శ్రోతలలాగా! అవును కాదు అనకుండా.

ఇంకా ఏమేమి వినాల్సివస్తుందోనని గోపాలకృష్ణ గబగబా వాళ్ల దగ్గరకు వచ్చాడు.

హరి, ప్రమీల భార్గవి మాటలు తండ్రి విన్నాడేమోనని కంగారు పడ్డారు. భార్గవి మాత్రం 'వింటే మంచిదే' అన్నట్టుగా తొణ

క్కుండా, బెదరకుండా కూర్చుంది. తండ్రి ముఖంలో ఏ భావమూ లేదు. విన్నాడో లేదో తెలియడంలేదు.

"భార్గవీ! మరో రెండు రోజులుండ కూడదూ" అన్నాడు గోపాలకృష్ణ.

హరి, ప్రమీల తెరిపిగా ఊపిరి పీల్చు కున్నారు-హమ్మయ్యా నాన్నగారు భార్గవి మాటలు వినివుండరనుకుంటూ.

"కష్టం నాన్నగారూ! ఈ సెలవు కూడా ఒక్కరోజే కనుక ఇచ్చారు. రేపెలాగూ ఆది వారం, రేపు రాత్రి వెళ్లిపోవాలి. హరి నీ స్నేహితుణ్ణి సాయంత్రం టీకి పిలుచుకురా. నాన్నగారు కూడా చూశారో లేదో. అందరం చూడాలిగా"

"ప్రదీప్ నా కోసం వచ్చినప్పుడు ప్రమీల చూసింది, అమ్మ కూడా ఒకటి రెండుసార్లు చూసింది"

"కాని ఈ ఉద్దేశంతో ఎవరూ చూడలేదు. ఊరికే చూడటం వేరు, పెళ్లికోసం చూడటం వేరు. సాయంత్రం పిలుచుకురా" అంటూ లేచింది భార్గవి. "కాసేపు పడుకుంటాను రాత్రంతా బస్‌లో నిద్రలేదు" అని గదిలోకి వెళ్లింది.

మధ్యాహ్నం భోజనాలయ్యాక "అమ్మా ఇవాళ హరి స్నేహితుణ్ణి టీకి పిలిచాం. వాళ్లమ్మగారికి ఒంటరిగా ఇంట్లో ఏమీ తోచ డం లేదట. మనకు నాలుగవ ఆపార్ట్‌మెం ట్‌లోనే వాళ్లుంటారు. ఒకసారి నీతో పరి చయం చేసుకుంటే అప్పుడప్పుడు వస్తూండొ చ్చునుకుంటున్నారట అతనూ, వాళ్లమ్మ. అమ్మా, నువ్వు కాబేజి పకోడీలు, రవ్వకేసరి బ్రహ్మాండంగా చేస్తావ్. ఆ రెండూ చెయ్య మ్మా సాయంత్రానికి.

"అమ్మా నిజంగా సాయంత్రం అయిందంటే ఆఫీసు నుంచి గదికి రాగానే నువ్వు గుర్తుకొ స్తావ్ రోజూ. మేం కాలేజీనుంచి వచ్చేటప్ప టికి ఏదో ఒక కొత్త టిఫిన్ చేసి మా కోసం ఎదురుచూసేదానివి. అసలు ప్రమీలకు, హరికి పెళ్ళి చేసేసి నాన్నగారు రిటైరయిపో



## అవన్నీ మావేలే

హైదరాబాదులో ఓసారి రాజేశ్వరరావుగారు, ఆరుద్ర కారులో వెళ్తున్నారు. మాటల సందర్భంగా రాజేశ్వరరావు, 'మీకీ ఊళ్లో భూములున్నాయా?' అని ఆరుద్రను ప్రశ్నించారు. 'లేకేం? ఆ రుద్రభూములన్నీ మావేగా!' అంటూ రోడ్డు పక్కన కన్పించిన శ్మశానాలను చూపారు ఆరుద్ర.

యాక మీరిద్దరూ వచ్చి నా దగ్గరుండండి" అంటూ ఎంతో బెంగగా భార్గవి మాట్లాడేటప్ప టికి తల్లి కళ్ళల్లో నీళ్లు తిరిగాయి.

'పిచ్చిది. గడుసుగా మాట్లాడడమే కాని మనసు మెత్తన. ఒంటరిగా ఉండి బెంగ పెట్టుకొన్నట్టుంది మా మీద' అనుకుంది.

"అమ్మా, నువ్వు కాసేపు రెస్టు తీసుకో. భోజనం అయ్యాక కొంచెంసేపైనా పడుకోవా లట. మళ్లీ సాయంత్రం ఎలాగు పని తప్పదు కదా" అంది భార్గవి.

"నా కెక్కడ కుదురుతుందే పడుకోవడా నికి? "

"అమ్మా! నాకు అందుకే చిరాకు వేస్తుంది. ఇప్పుడు నీకు వచ్చిన బాధేమిటి? మళ్లీ సాయంత్రం వరకు నిజానికి పనేముంది. పూర్వం అంటే అన్ని పనులు చేసుకునేదానివి. శరీరానికి మించిన పనిచేస్తూ ఉండడం వల్ల ఎప్పుడు చిరాకు పడుతూ ఉండేదానివి. నీ పట్ల నువ్వు శ్రద్ధ తీసుకునేదానివి కాదు. ఇప్పుడు ఆ పని వత్తిడి తగ్గడం వల్ల నువ్వెలా ఉన్నావో తెలుసా? ఏమే ప్రమీలా అమ్మకి కాస్త ఫేషియల్ చేస్తే ఇంకా చిన్నాదానిలా

కనపడదూ"

"ఫేషియలూ వద్దూ, ఏమీ వద్దు కాని నన్ను నా మానాన వదిలేయ్ తల్లీ"

"అలా అంటావేంటమ్మా. అందంగా కనపడేటట్టుగా ఉండాలనుకోవడంలో తప్పే మిటి? నీ నుదురు, జుట్టు ఎం తందంగా ఉంటాయో తెలు సా? అవి రెండూ ప్రమీలకొ చ్చాయి. రంగు మిగతా పోలి కలు నాన్నగారి వొచ్చా యి. మీ ఇద్దరిలోని అందమైన పోలి కలన్నీ దానికి వచ్చాయి. చూడ గానే ఆకట్టుకుంటుంది ఎవరిన యినా".

తన నుదురు, జుట్టు గురించి కూతురలా అని, చిన్న కూతురుకి ఆ రెండూ రావడం వల్ల అందం ఎక్కువయిందని అనడంతో కా త్యాయనికి మనసులో ఎంతో సంతోషం వేసింది.

ప్రతిదానికి ఆంక్షలు పెట్టేదానివి. దాంతో చిరాకుగా ఉండేది. అంతేకానీ నీ మీద అప్పుడు కూడా నాకేమీ తక్కువ ప్రేమ ఉండేది కాదు అంటూ తల్లి దగ్గరకు వెళ్లి ఆవిడ భుజం మీద తల వాల్చుకుంది భార్గవి

"అవునే భార్గవీ! నీకు దూరం వెళ్ళాక నా మీద ప్రేమ పుట్టుకొచ్చినట్టుంది" అంది.

"ఇక్కడున్నప్పుడు ఎప్పుడూ ఉండేది. నీతో కాసేపు కూర్చొని మాట్లాడుదామంటే నీకు తీరి కుండేదా అసలు? రాత్రి భోజనాల దగ్గర కూడా ఇది తిను, అది తినొద్దు అంటూ ఆంక్ష లు పెట్టేదానివి. దాంతో చిరాకుగా ఉండేది. అంతేకానీ నీ మీద అప్పుడు కూడా ఎంతో ప్రేమ ఉండేది" అంటూ తల్లి దగ్గరకు వెళ్లి ఆవిడ భుజం మీద తల వాల్చుకుంది భార్గవి.

ప్రేమతో కూతురి వీపు నిమిరింది తల్లి. వాళ్లిద్దర్నీ ప్రమీల ఆశ్చర్యంగా అలా కళ్ళప్ప గించి చూస్తూ కూర్చుంది.

సాయంత్రం ఆరు గంటలకు ప్రదీప్ తల్లిని తీసుకువచ్చాడు. వాళ్లు రాగానే భార్గవి తండ్రికీ, అన్నకూ ఫోను చేసింది. త్వరగా వచ్చేయమని. వాళ్లిద్దరూ వచ్చేవరకూ ప్రదీ ప్ని మాటల్లో పెట్టి ఉద్యోగ వివరాలూ అవీ సేకరించింది. అలాగే ప్రదీప్ తల్లి నుంచి కుటుంబ భోగట్టాలు లాగడానికి ప్రయత్నించింది భార్గవి. "మీదేవూరండీ" అంటూ.

"మాదసలు... ఉత్తరప్రదేశ్ లోని గోరఖ్‌పూర్ అండి. ప్రదీప్ నాన్నగారిది ఆంధ్రా కేడర్. అందుచేత ఇక్కడే ఉండి పోయాం ఇన్నేళ్లూ" అందావిడ నవ్వు ముఖంతో.

అంతలో గోపాలకృష్ణ, హరి ఒకరి తర్వాత ఒకరు వచ్చారు. కాత్యాయని లోపలకు వెళ్లి అంద రికీ టిఫిన్లూ, కాఫీ పట్టుకొ చ్చింది.

"ఎందుకండీ ఇంత శ్రమ పడతారు. కాఫీ సరిపోతుంది కదా" అంటూ ప్రదీప్ తల్లి మొహమాటప డింది.

"మా ఇంట్లోకయినా ఈ మాత్రం చేసుకో వాలి కదండీ అందులో మా భార్గవి వచ్చింది. దానికి ఈ రెండు ఫలహారాలు ఇష్టం" అంది కాత్యాయని టీపాయి దగ్గరకు జరిపి ఆ ప్లేట్లు ఆవిడముందు పెట్టింది.

గోపాలకృష్ణ, హరి ఫ్రెషప్ అయి వచ్చారు.

"నాన్నగారూ ఆఫీసులో మొదట నాకు తర్ఫీదిచ్చింది ప్రదీపే. త్వరలో తను అమెరికా వెళ్లిపోతున్నాడు ప్రమోషన్ మీద" అంటూ ప్రదీప్‌ని, అతని తల్లిని పరిచయం చేశాడు హరి.

"అదేనమ్మా నాకు చింతగా ఉంది" అంది అతడి తల్లి.

"అదేమిటండీ చక్కగా ప్రమోషన్‌మీద అమెరికా వెళుతుంటే" అంది కాత్యాయని.

"అలా అని కాదు... వెళ్లేముందు పెళ్లి చేసుకుని వెళ్లిపోతే బాగుంటుంది. లేకుంటే అక్కడ తిండీ తిప్పలకు ఇబ్బందిపడి సరిగా

తింటున్నాడో లేదో అనే భయం ఉంటుంది.
"చాలా సంబంధాలే వస్తూ వుండాలి" అంది భార్గవి.
"రాకేమమ్మా. ఎవరినీ చూడ డు. పెళ్లి చూపుల తతంగం నాకు నచ్చదు అంటాడు".
"తెలుగమ్మాయయినా పరవాలేదా? " అడిగింది భార్గవి.
"మేమూ తెలుగువాళ్లమే అయిపోయాంగా. ఇన్నేళ్లూ ఇక్కడుండి, బ్రాహ్మలయితే మరీ మంచిది. కాకపోయినా నేను సరిపెట్టుకోవడానికి సిద్ధమే. బాబూ! హరీ! మీరిద్దరూ ఒక చోటే పనిచేస్తున్నారు కదా! అక్కడే అమ్మాయి అయినా నచ్చిందా వీడికి? "
"అలా ఎవరూ లేరండి" అన్నాడు హరి తననావిడ హఠాత్తుగా అడిగేటప్పటికి కాస్త తడబడుతూ.
"పోనీ నీ స్నేహితుడి మనసేమో తెలుసుకో కాస్త. నీకు పుణ్యముంటుంది"
భార్గవి క్రీగంట ప్రదీప్‌ని కనిపెడుతూనే ఉంది.
'హుందాగానే ఉన్నాడు. కాకపోతే తల్లి అందం రాలా. తండ్రి పోలిక లొచ్చాయేమో? తెల్లగా, ఆకర్షణీయంగా ఉన్నాడు కాని పెద్ద అందగాడని చెప్పలేం. ఎత్తు ఇంచుమించు ఐదు అడుగుల పది అంగుళాలకు తక్కువ ఉండదు. ప్రమీల కూడా అయిదడుగుల నాలుగంగుళాలేకదా' అంటూ తనలో తను అన్ని అంచనాలూ వేసుకుంటోంది భార్గవి.
"హరీ, నీ స్నేహితుడెప్పుడు వెళ్ళాలిట అమెరికా..." అని ప్రశ్నించింది భార్గవి.
"వీసా అదీ వచ్చి వెళ్ళేటప్పటికి రెండు నెలలవుతుందేమో భార్గవీ. ముందు పదిహేను రోజుల్లో వెళ్ళిపోవాలన్నారు. ఇంతలో మా మేడమ్‌గారికి ఏదో మెసేజ్ వచ్చింది, రెండు నెలలైనా పరవాలేదని" అన్నాడు.
"అయితే ఇకనేం. వాళ్ళమ్మ గారన్నట్టు నీ స్నేహితుడి మనసులో ఎవరైనా ఉన్నారేమో కనుక్కో. పెళ్ళి చేసుకునే వెళ్ళొచ్చు" అంది భార్గవి.
ఎంత ఆరిందా అయిపోయింది భార్గవి అని ఆశ్చర్యపోతున్నాడు గోపాలకృష్ణ. వాళ్ళందరూ మాట్లాడుకుంటూ ఉంటే మౌనంగా వింటున్నాడు.
"హరి పెద్దవాడు, తరవాతిది భార్గవి. ఆ తర్వాత ప్రమీల" అంటూ మురిపెంగా చెప్పింది కాత్యాయని ప్రదీప్ తల్లితో.
"మీ ఆడపిల్లలిద్దరు కూడా బొమ్మల్లా ఉన్నారు. సామాన్యంగా తెలుగువారిలో ఇంత తెల్లటివాళ్ళని చూడలేం" అందావిడ వారి అందం, వంటి రంగు మెచ్చుకుంటూ.
"ఎర్రతోలు ఏడువంకర్లను కప్పుతుందంటారులెండి" అంది కాత్యాయని.
"కాని మీ అమ్మాయికి ఏ వంకరా లేదు. నాకే కనక కూతురుంటే హరికిచ్చి చేసేవరకు నిద్రపోయేదాన్ని కాదు. మీ హరి అంటే ఇష్టం నాకు. ఎంత నమ్రత... చక్కగా పలకరిస్తాడు, ప్రదీప్ కోసం వచ్చినప్పుడు. అందంలో మీ ముగ్గురి పిల్లలు ఒకరిని మించిన వారొకరు" అందావిడ మహా మెచ్చుకుంటూ.
"వాళ్ళకి నా రంగు, పోలికలు రాలేదు. వాళ్ళ నాన్నగారి రంగు పోలికలు వచ్చాయిలెండి" అంది కాత్యాయని.
"రంగు ఆయనదే అయినా పోలికలు మీవీ ఉన్నాయి. మీ రంగు మాత్రం నలుపేమిటి? చామనఛాయ. మా వారెప్పుడూ 'చామనఛాయలో కళెక్కువ అనేవారు" అందావిడ.
కాత్యాయనికి ముందసలు ఆవిడేమంటోందో అర్థం కాలేదు. తెల్లబోయినట్టు చూసింది ఆవిడ వంక.
అదే అదననుకుని "ఆ మాటే నేనంటే మా అమ్మ నమ్మదు. తానేదో నల్లగా బాగోననుకుంటుంది. అసలు మా ప్రమీలకు మా అమ్మ పోలికలొచ్చి కొట్టొచ్చినట్టు ఉంటుంది" అంది భార్గవి.
కాత్యాయనికి కూతురి మాటలకి ఏమనాలో తెలియలేదు. కాస్త సిగ్గనిపించింది. గోపాలకృష్ణ క్రీగంట కాత్యాయని వంక చూశాడు. భర్త అలా చూడగానే కాత్యా

యని "వక్కపొడి తెస్తానం"టూ లోపలికి వెళ్ళిపోయింది, ఆ వంకన కాస్త తమాయించుకు బయటకు వద్దామని.

కాసేపు కూర్చుని వెళుతూ వెళుతూ ప్రదీప్ తల్లి "ఈ ఫ్లాట్ అమ్ముతారట. వాళ్ళు కొడుకు దగ్గరకు వెళ్ళిపోతారట. మాది అలాగే కొనుక్కున్నాం. ఈ ఫ్లాట్‌లు వీలుగా వున్నాయి. ఎంతైనా ఇక్కడి సౌకర్యం మరోచోట దొరకడం కష్టం. వీలయితే కొనుక్కోండి" అని సలహా ఇచ్చింది.

భార్గవి ఆవిణ్ణి పంపడానికి తల్లితో పాటు కారిడర్‌లోకి వచ్చి,

"మీ అపార్ట్‌మెంట్‌ని ఏం చేస్తారు? తాళం పెట్టి వెళ్ళిపోతే పాడయిపోదా? " అంది భార్గవి.

"ఎందుకు కాదమ్మా... అది వాడు ఆఫీసులో లోన్ తీసుకుని కొనుక్కున్నాడు. లోన్ తీర్చేవరకు అమ్మడానికి వీలులేదేమో మరి... ఏమోనమ్మా ఈ విషయాలన్నీ వాడే చూసుకోవాలి. అన్ని విషయాలలోను నేనొట్టే కల్పించుకోను. పిల్లలు మనంతటివాళ్ళయ్యాక అడిగితే సలహా ఇవ్వాలి తప్పితే ఊరికే నస పెడితే వాళ్ళకి విసుగ్గా ఉంటుంది. మన గౌరవం కూడా మనం కాపాడుకోవాలి కదా!" అన్నారావిడ వెళ్ళిపోతూ.




"నాకు బలే నచ్చిందావిడ- పెద్దవాళ్ళంటే అలా ఉండాలి" అంటూ లోపలికి వచ్చి సోఫాలో తండ్రి పక్కన కూర్చుంది భార్గవి.

హరి, ప్రదీప్ వాళ్ళతో పాటు వాళ్ళ అపార్ట్‌మెంటు వరకూ వెళ్ళి తిరిగి వచ్చాడు.

"అన్నయ్యా... ఇటురా. నీతో కాస్త మాట్లాడాలి" అని పిలిచింది భార్గవి అతణ్ణి.

"నువ్వు పిలిచావంటే భయమే నాకు" అంటూ నవ్వుతూ వచ్చి సోఫాకు దగ్గరగా ఒక కుర్చీ లాక్కుని కూర్చున్నాడు.

"ఇంతకీ ప్రదీప్ గురించి అభిప్రాయం ఏమిటి? " అడిగాడు తండ్రి.

"పెద్ద అందంగా లేకపోయినా ఆకర్షణీయంగా ఉన్నాడు. మంచి ఉద్యోగం, మంచి వాడు. తనంతట తానే కావాలని అడుగుతున్నాడు. మీరు నెమ్మదిగా చెబితే అమ్మ కూడా ఒప్పుకుంటుంది. కాస్త మారింది మనిషి. మరీ మూర్ఖంగా మాట్లాడటం లేదిప్పుడు" అంది భార్గవి.

"ఏమిటి 'మూర్ఖం' అంటున్నారు. నన్ను కాని కాదుకదా" అంటూ కాత్యాయని వచ్చింది వంటింట్లో నుంచి.

"అన్నింటికీ భుజాలు తడుముకోకు" అన్నాడు భర్త భార్గవి ఏమంటుందోనని భయంవేసి.

"అమ్మా! కూర్చో నీతో ఒకమాట మాట్లాడాలి. ఎన్నాళ్ళు అద్దె ఇంట్లో ఉంటారు? ప్రదీప్ అమ్ముతానంటే మనమే అది కొనుక్కోవడం మంచిది"

"అంత డబ్బెక్కడిది? లక్షల మీద మాట కదా? " అంది తల్లి.

"పాపం పెరిగినట్లు ధరలు పెరిగిపోతున్నాయి సరే, నాన్నగారూ, పెళ్ళి కోసం దాస్తున్న డబ్బులోంచి కొంత తీసికట్టండి. మిగతా దానికి నెలనెలా ప్రదీప్ వాయిదాలు మన హరి కడతాడు ఆఫీసులో"

"ఎంత దానివయ్యావే. ఇన్నేళ్ళుగా ధైర్యం చేసి మీ నాన్నగారు చేయలేని పని నువ్వు చేసేటట్టున్నావు. నువ్వు కొడుకువై పుడితే బాగుండేది" అంది తల్లి.

"దేనికీ! నాకు సంబంధాలొస్తే ముందు అన్నయ్య హరికి పెళ్ళి కావాలి, తరవాతే నాది, అనే దానివి అంతే కదా? " అంది

నవ్వుతూ.

"నీకంతా నవ్వులాటగా ఉంది. అయినా నా పిచ్చిగాని ఇప్పుడు కొడుకైతే ఏమిటి, కూతురయితే ఏమిటి? ఈ రోజుల్లో కూతుళ్లు కూడా తలకొరివి పెడుతున్నారని చదువుతున్నాం కదా!" అంది కాత్యాయని.

"అమ్మా! అన్నయ్యా... నాన్నగారూ ముగ్గురూ వినండి జాగ్రత్తగా. అతడు అమెరికా వెళ్లే లోపలే ప్రమీలకు పెళ్ళి చేసేయడం ఉత్తమం. అప్పుడు దాని వీసా కూడా కంపెనీ వాళ్లే తెప్పించి ఇస్తారు" అంది భార్గవి.

కాత్యాయనికి పిడుగుపడ్డట్టనిపించింది. "ఏమిటి నువ్వనేది? ప్రమీలకు ఎవరితో పెళ్ళి...? " అందావిడ అమితాశ్చర్యంగా.

"నీకింకా అర్థం కానట్టు నటించకమ్మా... ప్రదీప్‌తో" అంది భార్గవి కాస్త విసుగ్గా.

"పెళ్ళంటే అంత సులభంగా ఉందా? మన తెలుగు వాడెవరూ దొరకడా దానికి? " అందావిడ విసురుగా.

"ఆ దొరుకుతాడు తాడూ బొంగరం లేని వాడు, సవాలక్ష షరతులతో. అవకాశాలు రానే రావు. వచ్చిన వాటిని కాలదన్నుకుంటే ఇక అయినట్టే" అంది కూతురు.

"ఏమిటి మీరు మూగనోము పట్టారు. తన సంగతి తన ఇష్టం వచ్చినట్టు చూసుకుంటోంది. మిగతా వాళ్ల సంగతులు కూడా తనిష్టమేనా? మీరూ నేనూ ఉండి దేనికి? సంబంధం చూడలేనంత అసమర్థులా మీరు? " అని భర్త మీద ధ్వజమెత్తింది కాత్యాయని.

"అమ్మా! నాన్నగారిని నువ్వేమన్నా అన్నావంటే ఊర్కోను. నీ మూర్ఖత్వాన్ని నాన్నగారు కనుక భరిస్తూ వస్తున్నారు. ఆయనని ఇప్పటికైనా శాంతంగా బతకనీయి" అంది భార్గవి.

కాత్యాయని నిర్ఘాంతపోయి, బిగుసుకుపోయినట్టు కూర్చుండిపోయింది. తండ్రి లేవబోతే వద్దన్నట్టు చేయి పట్టుకు ఆపేసింది భార్గవి.

"ప్రమీలా! అమ్మకు మంచినీళ్లు తెచ్చివ్వు" అంటూ లోపలున్న చెల్లెలికి వినపడేలా గట్టిగా అంది.

ప్రమీల హడావిడి పడుతూ మంచినీళ్లు తెచ్చిచ్చింది. కాత్యాయని గ్లాసు పట్టుకొని కూర్చుందే కాని తాగలేదు.

"తాగమ్మా! కాస్త తేరుకుంటావు. తరువాత కాసేపు పడుకో. ఈ పూట వంట నేను, ప్రమీలా చేస్తాంలే" అని ప్రమీలను వెంటపెట్టుకొని వంటింట్లోకి వెళ్ళిపోయింది భార్గవి.

గోపాలకృష్ణ "లే కాత్యాయనీ! మంచినీళ్లు తాగి, కాసేపు పడుకో గదిలోకి వచ్చి" అని మంచినీళ్లు తాగించి లోపలకు నడిపించుకుని తీసుకువెళ్లాడు. హరి వంటింట్లోకి వెళ్లి- "అమ్మకు షాక్ తగిలినట్టుగా ఎలా అయిపోయిందో చూశావా? మరీ నువ్వలా అనాల్సింది కాదు భార్గవీ" అన్నాడు.

"మరి అలాంటప్పుడు ప్రదీప్ సంగతి నాకు చెప్పివుండాల్సింది కాదు నువ్వు. మీ అవస్థ లేవో మీరు పడాల్సింది. నా పద్ధతి ఇంతే. అసలు మొదటి నుంచీ నాన్నగారు 'ఏడుస్తుంది, అరుస్తుంది, చచ్చిచెడీ మనకు సేవ చేస్తోందీ' అంటూ మెత్తగా ఊరుకోబట్టి ఇలా ప్రతిదానికీ మూర్ఖంగా ప్రవర్తిస్తోంది. తనకు తోచదు, ఒకళ్లు చెబితే వినదు. ఇంతకంటే మంచి సంబంధం తను వెయ్యి జన్మలెత్తినా తేలేదు. అత్తయ్య అంత అందంగా ఉన్నా ఎంత అనాకారి భర్త దొరికాడో చూశావా? కేవలం అందం కోసమే మంచి మంచి సంబంధాలు రావు. నాన్నగారు ఎంత అందంగా ఉంటారో చూడు. మరి అమ్మ నాన్న ముందు తీసికట్టే కదా! అలా కాకుండా ప్రమీలకు అన్నివిధాలా చక్కటి సంబంధం వస్తే కాలదన్నుకోవటం అవివేకం' ఈసారి నాన్నగారు కనుక అమ్మకు తాళం వేస్తే, నేనొచ్చి ప్రమీలను నావెంట తీసుకుపోతాను. అక్కడే దానికేదైనా ఉద్యోగానికి ప్రయత్నిస్తాను" అంది భార్గవి ఉద్వేగంగా ఏకబిగిని.



హరి కూడా బిత్తరపోయాడు భార్గవి మాటలకి. స్వతంత్రంగా ఉండటంతో ఇంకాస్త ధైర్యం, తన మీద తనకు విశ్వాసం పెరిగాయి అనుకున్నాడు.

కాత్యాయని మునగతీసుకుని పడుకుంది. గోపాలకృష్ణ ఎంత బతిమాలినా నోరు కూడా విప్పలేదు. అతడికి కూడా విసుగొచ్చి పిల్లల తోపాటు భోజనం చేసి, హాలులో సోఫాలో పడుకుని నిద్రపోయాడు. అలా తండ్రి తమ గది వదలి బయట పడుకోవడం అన్నేళ్లల్లో పిల్లలెప్పుడూ చూడలేదు.

తండ్రి మీద పిల్లలకి జాలేసింది. తల్లి మూర్ఖత్వానికి చిరాకు వేసింది.

భార్గవి మాత్రం రాత్రి రెండుసార్లు గది లోకి వెళ్లి తల్లినీ, హాలులో తండ్రినీ చూసి చడీచప్పుడు చేయకుండా వచ్చి పడుకుంది.

పొద్దుటే వాడిపోయిన ముఖంతో కాఫీ చేసి పట్టుకొచ్చింది హాలులోకి కాత్యాయని. అప్ప టికే పిల్లలు ముగ్గురూ లేచి తండ్రి దగ్గర కూర్చుని ఉన్నారు.

"అమ్మా! కూర్చో. మాతోపాటు కాఫీ తాగు. నీకంతగా ఇష్టం లేకపోతే ఈ సంబంధం గురించి ఇక మర్చిపోదాం. చూడు నాన్నగారు ఎంత బాధపడుతు న్నారో? నీకిష్టమైతే ప్రమీలను నాతో తీసు కువెళతాను. తనకి కూడా అక్కడేదయినా ఉద్యోగానికి ప్రయత్నిస్తాను. నీకు నచ్చిన సంబంధం ఏదైనా వస్తే అప్పుడే దాని పెళ్ళి చేద్దువుగాని" అంది భార్గవి.

"నా ఇష్టానికేముంది? ఇంతవరకూ ఎవ రున్నా లేకపోయినా మీ నాన్నగారున్నారు నాకు అనుకున్నాను. ఇవాళ ఆయనా విసిగి పోయా రని తెలిసింది. ఇక నన్ను పోషిస్తున్నందు కు నా డ్యూటీ ఏదో నేను చేస్తాను. మీ పెళ్ళిళ్ళు, మీ ఉద్యోగాలు, మీ ఇష్టం, మీ నాన్నగారి ఇష్టం. నన్ను సంప్రదిం చాల్సిన పనిలేదు. నాకేం తెలు సునని అసలు? పెద్ద చదువా సంధ్యా, అందమా, డబ్బా, ఏదీ లేకపోయినా నా మూర్ఖత్వాన్ని ఇన్నాళ్ళూ ఆయనా, మీరు కూడా భరించారు. ఇక నేను మీకెవరికీ ఎలాంటి భారం కాను. మీరనుకున్నట్టే ప్రమీల పెళ్ళి ఖాయం చేయండి" అనేసి విస విసా లోపలకు వెళ్లిపోయింది.



* * *

ఆ రాత్రి భార్గవి బెంగుళూరు వెళ్ళిపో యింది. అనుకున్న నెల లోపలే ప్రమీలకు ప్రదీప్‌తో పెళ్ళయిపోయింది. మనసులో ఏమున్నా పైకి మామూలుగానే ఉన్నట్టుగా తిరిగింది కాత్యాయని. పెళ్ళికి నాలుగు రోజులు సెలవుపెట్టి వచ్చింది భార్గవి.

పెళ్ళయిన నాల్గవ రోజున వేదవల్లి నూతన వధూవరుల్ని, గోపాలకృష్ణ కుటుంబాన్ని భోజనానికి పిలిచింది.

"రాను అని బతిమాలించుకోకుండా, మారిన ధోరణిలో కాత్యాయని బయలుదేరింది. భార్య ధోరణి కాస్త మారాక గోపాలకృష్ణ తెరిపిగా ఊపిరి పీల్చుకుంటున్నాడు. కాని లోపల భయంగానే ఉంది, ఈ ధోరణి ఎక్కడికి దారితీస్తుందోనని.

తన ముగ్గురి పిల్లల్లో ఏయే ప్రతిభలు దాగున్నాయో అంతగా పరిశీలించే అవకాశం తనకెప్పుడూ లేకపోయింది. పిల్లల్ని తన చుట్టు తిప్పుకునేందుకు ప్రయత్నించేది కాత్యాయని. ఎప్పుడైనా పిల్లలు దేనికోసమయినా "నాన్నగారూ" అని దగ్గరకు రాబోతే, 'నాన్నగారిని విసిగించకండి. అసలే అలసిపోయి వస్తారు' అంటూ దగ్గరకు రానిచ్చేది కాదు. అందుకే తనకిప్పుడు వాళ్ళను చూస్తుంటే అబ్బురంగా వుంది. నెమ్మదిగా ఉండే హరి ఎంత నైపుణ్యంగా అపార్టుమెంటుకు మకాం మార్పించాడు. తను అన్నేళ్ళుగా చేయలేని పని చేశాడు. ఇక భార్గవి సరేసరి. మొదటి నుంచి ధైర్యంగానే ఉండేది. ఉద్యోగానికి వెళ్లాక మరీ వ్యవహారకర్త అయిపోయింది. ప్రమీల పెళ్ళి కుదిర్చేసింది. భార్గవి లేకపోతే తన వల్ల ఆ పని అయ్యేది కాదు. పెళ్ళికూతురుగా ప్రమీల అంత అందంగా మెరిసిపోతుందనుకోలేదు తను. అందరి దృష్టి దాని పైనే ఉంది. 'విశ్వసుందరి పోటీలో నిలబడితే జడ్జీలు ఆ అందాన్ని ఎలా నిర్ణయించాలో తెలియక కళ్ళార్పకుండా చూస్తూ ఉండిపోయేవారు' అన్నాడు ప్రదీప్ స్నేహితుడు, పెళ్ళిలో తనకు అభినందనలు తెలుపుతూ అనుకుంటూ కారు డ్రైవ్ చేస్తున్నాడు గోపాలకృష్ణ.

"ఏమిటి నాన్నగారూ అంతగా ఆలోచిస్తున్నారు? " అంది భార్గవి.

"ఏమీలేదు మీరందరూ ఎంతగా ఎదిగిపోయారా అని ఆలోచిస్తున్నాను" అన్నాడు.

ప్రదీప్ కారులో అతడి తల్లి, కాత్యాయని కూర్చున్నారు. "ఆవిడొక్కతే కూర్చుంటే ఏం బాగుంటుంది. నేనూ అక్కడే కూర్చుంటాను" అంటూ భార్గవికి నవ్వొచ్చింది. "చూశారా నాన్నగారూ అమ్మ నాతో కూర్చోవడానికి భయపడిపోతోంది, ఏమేం మాటలంటానోనని. నేనూరికే ఎందుకంటాను. మరీ మొండిగా మాట్లాడితే ఏం చేయాలి చెప్పండి నాన్నగారూ! మీకున్న ఓపిక నాకు లేదు. ప్రమీల మీలాగానే నోరెత్తదు ఏమన్నా"

"అందుకే నిన్ను అమ్మ మేనత్త లక్షణాలు వచ్చాయి అంటుంది. తమాషా చూడు నాకు మా నాన్నగారి లక్షణాలు వచ్చాయి. మా అక్క అంతా మా అమ్మలాగ. మనింట్లో ప్రమీలకు నా లక్షణాలు వచ్చాయన్నమాట" అన్నాడు గోపాలకృష్ణ.

"అమ్మ లక్షణాలు ఎవరికీ రాలేదు. కాని నాన్నగారు! అమ్మ నిజంగా ఉత్త పిచ్చిది. అలా భయపెట్టో బతిమాలో బుట్టలో వేసి ప్రమీల పెళ్ళి చేసేశాం"అని నవ్వింది భార్గవి.

"దిగండి ఇల్లు వచ్చేసింది" అన్నాడు హరి వెనక సీట్లోనుంచి.

పోర్టికోలో నిలబడి ఉన్నారు వేదవల్లి, మనోహర్. అందర్నీ నవ్వుతూ ఆహ్వానించి సాదరంగా లోపలకు తీసుకువెళ్లారు.

"ఇప్పుడే వస్తాను" అంటూ మనోహర్ చేతిలోని సెల్ మోగగానే లోపలికి వెళ్లాడు. అలా వెళ్లినవాడు తిరిగి అరగంటకు వచ్చాడు.

"సారీ, న్యూజెర్సీ కంపెనీ నుంచి ఫోను. ప్రదీప్ అక్కడికి వస్తే నాకెవరూ ఇక్కడికి ఇలా ఫోను చేయకుండా తను చూసుకుంటాడిక" అంటూ కూర్చున్నాడు.

"ఫరవాలేదులెండి. ఈ లోపున మేము చల్లటి నిమ్మరసం తాగాం" అంది భార్గవి.

"సాఫ్ట్‌వేర్ కంపెనీలో పని చేస్తున్నారు కనుక మీకు నా అవస్థ అర్థమయింది" అన్నాడు తను కృతజ్ఞతా పూర్వకంగా.

భార్గవి, మనోహర్ కబుర్లలో పడిపోయారు.

"ఒకసారి న్యూజెర్సీకి రండి. బెంగుళూరు నుంచి వచ్చిన వాళ్లు న్యూజెర్సీలో చాలామంది ఉన్నారు"

"బెంగుళూరుకు నేనీ మధ్యే వెళ్లానండీ. ఇంకా అక్కడ నాకు కొంచెం కొత్తే. అయినా న్యూజెర్సీ ఏదో సికింద్రాబాద్ అంత దగ్గర అన్నట్టు మాట్లాడుతున్నారేమిటి? నిన్నకాక మొన్న ఉద్యోగంలో చేరిన దానిని. ప్రమీల పెళ్లికి అర్జంటుగా రావడానికి ప్లేను టిక్కెట్టు కొనుక్కోవడానికి తటపటాయించవలసివచ్చింది"

"సారీ... నేనలా ఆలోచించలేదు. మీరు చాలా సూటిగా మాట్లాడతారు. అలా మాట్లాడేవారంటే నాకిష్టం. వల్లి మాత్రం మరీ అంత సూటిగా మాట్లాడితే ఎదుటి వాళ్ళు మనసు కష్టపెట్టుకుంటారు. అంటుంటుంది" అన్నాడు.

"ఏమిటి ఆయన నామీద పితూరీలు చెబుతున్నారా?" అంటూ వచ్చి "ఇక లేవండీ భోజనాలకి" అని అందర్నీ లేపింది వేదవల్లి.

"మీరింతసేపూ లోపలికి వరండాలోకి తిరుగుతూనే ఉన్నారు ఏదో పనిమీద. కాసేపు కూడా కూర్చోలేదు" అంది భార్గవి.

"ఆ మాటే నేనంటుంటాను. ఒకటే హైరాన పడిపోతుంది అనవసరంగా. పైకి మాత్రం నిబ్బరంగా కనపడుతుంది. అంతే... పని వాళ్లున్నారు కదా వాళ్లకి వదిలేయొచ్చుగా" అన్నాడు మనోహర్.

"అది సామాన్యంగా ఆడవాళ్ల అలవాటనుకుంటా... ఎంత మంది చేతికింద ఉన్నా వాళ్లు కూడా కాస్తన్నా కల్పించుకోకపోతే తృప్తి ఉండదు" అంది భార్గవి.

"ఎంతమంది ఆడవాళ్లని చూశావు? భార్గవి" వేదవల్లి నవ్వుతూ అంది.

"అన్నం అంతా పట్టి చూడక్కర్లేదు కదండీ! ఒక్క మెతుకు చాలు అన్నం ఉడికిందో లేదో చూడడానికి"

"అదీ... అలా చెప్పు. తనకి అసలు విశ్రాంతిగా ఉండడం ఇష్టం ఉండదు. ఏదో పనన్నా పెట్టుకుంటుంది. లేదా ముందు ఇన్ని పుస్తకాలు వేసుకుని కూర్చుంటుంది. చెబితే వినదు" అన్నాడు మనోహర్.

ఆ మాటలు విని, వేదవల్లిని భర్త ఎంతో ప్రేమగా, బాధ్యతగా చూసుకుంటున్నాడని గోపాలకృష్ణ సంతోషించాడు.

వేదవల్లి దంపతులు కొత్త జంటకు వెండి పళ్ళాలలో బట్టలు తెచ్చి పళ్ళాలతోపాటు బట్టలు పెట్టారు.

చేతులు కడుక్కొంటూ చూస్తే మూలగా టేబుల్ మీద కాత్యాయని చెప్పిన ఫొటో కనపడింది గోపాలకృష్ణకి. 'అంతకు పూర్వం ఒకసారి టీకి పిలిచినప్పుడు ఆ రెండో ఆవిడ్ని నా పార్టనర్ అంటూ తనకు పరిచయం చేశాడు మనోహర్. నిజానికి ఫొటోలో కంటే మామూలుగా చూస్తేనే ఎక్కువ బాగుంటుందావిడ అనుకొన్నాడు.




మరుసటి రోజు వేదవల్లి గోపాలకృష్ణ ఆఫీసుకు ఫోను చేసింది. "మధ్యాహ్నం భోజనానికి రా. మీ యింట్లో తెలియకుండా తీసుకురాగలిగితే భార్గవిని కూడా తీసుకురా" అంది.

"నిన్న రాత్రే భోజనం చేసి వచ్చాం. ఇంతలో ఏమిటి మళ్ళీ భోజనం" అన్నాడతను.

"ఇది మరోకందుకులే"

"క్రితం సారి పిలిచి ప్రమీల పెళ్ళి సంగతి ఎత్తావు. ఈ సారి ఎవరి పెళ్ళి సంగతి ఎత్తబోతున్నావ్" అన్నాడు నవ్వుతూ.

"నీ పెళ్ళి సంగతి"

"నా పెళ్ళి సంగతా... ఏనాడో అయినదా

ని సంగతి ఇప్పుడెందుకు? ".

"ఏనాడయితేనేం పెళ్ళిపెళ్ళే కదా ఆనాటి పెళ్ళికబుర్లు నెమరు వేసుకోవచ్చుగా"

"అంతగా నెమరు వేసుకోవలసిన గొప్ప విషయమేం కాదులే నా పెళ్ళి"

"ఎవరి పెళ్ళయినా తర్వాత ఆలోచించు కుంటే అంత గొప్పగా అనిపించదు"

"నీ పెళ్ళి కూడానా? ... ఆరోజు కొంతవ రకే చెప్పావ్ నీ పెళ్ళికి ముందు కథ"

"పోనీ ఆ తర్వాత కథ విందువుగాని... విందుకు కాదు నిన్ను పిలుస్తున్నది. కొంచెం అర్జెంటుగా నీతో మాట్లాడాలి"

"భార్గవి రాత్రి బస్సుకి వెళ్ళిపోతుంది. మా యిద్దరిని మాత్రమే మళ్ళీ వెంటనే పిలిచా వంటే కాత్యాయని ఏమనుకుంటుందో"

"ఆవిడకు చెప్పకుండా రమ్మనే నేననేది. భార్గవి నిన్న ఆఫీసు చూస్తానందట మనోహ ర్‌తో. మనోహర్ ప్రొద్దుటి ఫ్లైటుకు వెళ్ళి పోతూ హరిని పిలిచి చూపించమని చెప్పారు. అందుకోసమైనా రావచ్చు హరితో తనకి ఫోను చేయించి కారు పంపించి పిలిపి స్తానులే. నువ్వు నేరుగా వచ్చేయ్" అని ఫోను పెట్టేసింది, మళ్ళీ "కాదు" అన్నమాట వినదల చుకోనట్లు.

గోపాలకృష్ణ ఎంత తల పగలగొట్టుకున్నా సంగతేమిటో అర్థం కాలేదు.

మధ్యాహ్నం పన్నెండున్నరకు వచ్చాడు. వచ్చీ రావడమే "భార్గవి వచ్చిందా? " అని అడిగాడు వేదవల్లిని.

"వచ్చింది. ఆఫీసులో ఉంది. పద. మా ఆఫీసు ఎలా ఉంటుందో, నీ సుపుత్రుడెక్కడ కూర్చుంటాడో, అతని కొలీగ్స్ ఎవరెవరో? నువ్వు కూడా చూద్దువుగాని" అంటూ వెంట పెట్టుకు వెళ్ళింది.

## పురుషులకు మాత్రమే

ఇదేమిటి; 'ఎ' సర్టిఫికేట్ సినిమాలా... 'పురుషులకు మాత్రమే' అంటున్నారు అను కుంటున్నారా? అవునండీ! సులువైన పెల్విక్ వ్యాయామం వల్ల పురుషుల్లో లైంగిక సామర్థ్యం పెరుగుతుందని బ్రిటీష్ శాస్త్రవేత్తలు పరిశోధించి చెప్తున్నారు. ఇంతకీ వీళ్ళు చేసిందేమిటంటే...

అంగస్తంభనా లోపం (ఎరక్టైల్ డిస్‌ఫంక్షన్)తో బాధపడ్తున్న 55 మంది పురుషుల్ని రెండు వర్గాలుగా విభజించారు. మొదటి వర్గం వాళ్ళకి పెల్విక్ కండరాల్ని గట్టిగా బిగ బట్టే విధానం నేర్పారు. అది ఎలాగంటే మన శరీరంలోని గ్యాస్‌ని బహిర్ద్వారం ద్వారా బయటకి వెళ్ళనీయకుండా బిగబట్టినట్టు రెండో వర్గం వాళ్ళకి ఆల్కా హాలు, ధూమపానం వంటి వాటి జోలికి వెళ్ళకుండా, సాధా రణ వ్యాయామం వంటి కొన్ని మంచి అలవాట్లను నేర్పారు. మూడు నెలల తర్వాత పెల్విక్ కండరాన్ని బిగబట్టే వ్యాయామం చేసిన వారిలో అంగస్థంభ నల్లో మెరుగుదల గమనించారట. రెండో గ్రూపు వాళ్ళలో ఎలాంటి మార్పు గోచరించలేదు. అయితే అంగస్తంభనా లోపం వాస్క్యులార్ వ్యాధి మాత్రమే కానీ, కండరాల సమస్య కాదని కొంతమంది వాదిస్తున్నా, పెల్విక్ ఎక్సర్‌సైజు చేస్తున్న వాళ్ళు మాత్రం సమస్య నుండి బయ టపడి సంతోషంగా సుఖజీవనం సాగిస్తున్నారు.



హరి కూర్చునే గదిలో హరీ, మరో చాకు లాంటి అమ్మాయి, భార్గవి నిలబడి ఉన్నారు.

"ఇది హరి గది. ఈ అమ్మాయి అదితి" చెప్పింది వేదవల్లి.

బయటకు వచ్చాక "అదితి హరి చేరిన రెండు నెలల తర్వాత చేరింది. తల్లి బెంగాలీ, తండ్రి అసలు సిసలు తెలుగు బ్రాహ్మణులు. ఇక్కడ యూనివర్శిటీలో సైకాలజీ శాఖకు డీన్‌గా వుండేవారు. అదితి తెలుగు, బెంగాలీ రెండూ మాట్లాడుతుంది" అని చెప్పింది వేద వల్లి.

తనకెందుకు అవన్నీ చెబుతోందో అతని కర్థం కాలేదు.

"పద... మళ్ళీ నువ్వు ఆఫీసుకు పరుగెత్తా లంటావు" అంటూ భోజనాల గదికి తీసుకువె ళ్ళింది.

"బంగాళదుంపలు కాకుండా నీకు ఏ కూరలు ఇష్టమో తెలియదు. ఏవో చేయిం చాను ఈసారికి సరిపెట్టుకో" అంది ప్లేటులో బెండకాయ వేపుడు వడ్డిస్తూ.

"వేదా నిన్ను మీ ఆయన 'వల్లి' అని పిలు స్తాడా? "

"అవును... నిన్నందరూ సామాన్యంగా ఏమని పిలుస్తారు అన్నారు. 'వేద' అన్నాను. అయితే నేను వల్లి అని పిలుస్తాను, అన్నారు. అప్పట్నుంచి అలాగే పిలుస్తారు. ఇంతకీ నేను పిలిచింది మా పెళ్ళి గురించి, ఆయన సంగతుల గురించి చెప్పడానికి కాదు. ఇందాక హరి గదిలో చూశావే ఆ బెంగాలీ తెలుగు పిల్ల. ఎలా ఉంది? "

"బాగానే ఉందేమో"

"అంటే నువ్వు సరిగా చూడలేదా? "

"ఊరికే అలా ఎలా చూస్తాం. కనపడిన వాళ్ళనల్లా"

"భోజనం అయ్యాక పిలుస్తాను. చూడు అప్పుడైనా జాగ్రత్తగా"

"దేనికట? "

"అయితే గియితే నీ కోడలు కాబోతుంది గనుక"

నోట్లో ముద్ద పెట్టుకోబోయిన వాడల్లా ఆవిడ మాటలకి ఆశ్చర్యపడి ఆగిపోయాడు.

"ఎందుకంత ఆశ్చర్యం... అన్నం తిను. ఒకనెల క్రితం నేను హరి సీటు దగ్గరకు వెళ్ళాను, ఏదో అర్జంటు మెసేజ్ పంపాల్సి వచ్చి.."

"పూర్తి చేయి ఆగావేం"

"కంప్యూటర్ ముందు హరి కూర్చుని ఉన్నాడు. ఆ అమ్మాయి హరి భుజాల మీద చేతులు వేసి నుంచొని కంప్యూటర్‌లో ప్రోగ్రాం చూస్తోంది. నన్ను హఠాత్తుగా చూసి ఉలిక్కిపడింది. నేను ఏమీ జరగనట్టు గానే మెసేజ్ పంపేయమని చెప్పి వచ్చేశాను. ఆ తరవాత ప్రదీప్‌ని పిలిచి వాళ్ళిద్దరి మధ్య ఏదైనా ప్రేమాయణం నడుస్తోందా? అతడికే మయినా తెలుసా అని వాకబు చేశాను."

"అతనేం చెప్పాడు."

"అలానే ఉంది ఇద్దరి వ్యవహారం. ఆఫీసు లో అందరికీ తెలుసుననిపిస్తోంది అన్నాడు. నేను హరిని పిలిచి అడిగితే నిజమేనని ఒప్పు కున్నాడు. నెమ్మదిగా మీ అందరికి చెబుదామ నుకుంటున్నాడట. అదితి తన తల్లిదండ్రుల కేమీ అభ్యంతరం ఉండదని చెప్పిందట. ఇద్దరి ప్రేమా పెళ్లివరకు వచ్చిందంటే వాళ్లి ద్దరూ కలిసి జీవించాలనుకుంటున్నట్టేగా. అయితే పెళ్లయ్యేవరకూ, ఆ తరువాత కూడా ఆఫీసులో కాస్త జాగ్రత్తగా మసులుకోవాలని హెచ్చరించాను."

"గట్టిగా మందలించాల్సింది"

"అంత అవసరం లేదులే. నేను గదిలోకి వెళ్లడానికి రెండు నిమిషాల ముందు, పెళ్లికి తన తల్లిదండ్రులు ఒప్పుకున్నారని చెప్పి ఆ సంతోషంలో అంత సన్నిహితంగా వచ్చిందట. మామూలుగా అయితే అంత దగ్గరకు ఎప్పు డూ రాదట. హరి చెప్పిన విషయాల ప్రకా రం-చాలా నెలల నుంచి వాళ్లిద్దరూ కలిసి ఒకే గదిలో కూర్చుని, ఒకే ప్రాజెక్టు మీద గంటల తరబడి పనిచేస్తూ, మధ్యమధ్యలో సరదగా క బుర్లు చెప్పుకుంటుంటే వాళ్ల మీద వదంతులు

మొదలయ్యాయి. ఆ విషయం హరికి తెలియదు. ఒక రోజున అదితి ఈ ప్రాజెక్టు వదిలేద్దామనుకుంటున్నానని, మరో కొలీగ్‌ను చూసుకోమని చెప్పింది. మధ్యలో వదిలేస్తే ఎలా కుదరదన్నాడు హరి. అప్పుడు వాళ్లద్దరి మీద షికారు చేస్తున్న పుకార్ల గురించి చెప్పి ఏడ్చేసింది. ఎవరో ఏదో అనుకుంటున్నారని ప్రాజెక్టు వదిలితే ఇక ఉద్యోగం చేయలేవు అని అదితిని ఓదార్చాడట. ఆ తరువాతే నెమ్మది నెమ్మదిగా ఇద్దరికీ ఒకరంటే ఒకరికి ఇష్టం ఏర్పడినట్టుంది. ప్రమీల పెళ్లికి ముందే నాకీ విషయం తెలిసినా పెళ్లి హడావిడిలో వున్న సమయంలో నీకు చెప్పటం దేనికేలే అని ఊరుకున్నాను. ఇప్పుడు ప్రమీల పెళ్లయి పోయింది కనుక, వీళ్లిద్దరికీ కూడా చేసేస్తే సరిపోతుంది. అంది.

"అదంత తేలిక కాదు. ప్రమీల విషయంలో రాజీపడ్డా హరికి కూడా ఇలాంటి సంబంధానికి కాత్యాయని ఒప్పుకోకపోవచ్చు"

"కులం ఒకటయితే చాలేమో! ప్రమీలను ఉత్తరప్రదేశ్ బ్రాహ్మణ కుర్రాడికిచ్చింది కదా! ఈ పిల్ల తలిదండ్రులు ఒకళ్లు తెలుగు రెండో వాళ్లు బెంగాలీ అయితే మాత్రమేం ఇద్దరూ బ్రాహ్మలయినప్పుడు? "

"ఏమో... వేదా నాకిక ఓపిక లేదు ఆవిణ్ణి ఒప్పించేటందుకు... ప్రమీల సంగతి కూడా హరి, భార్గవే చూసుకున్నారు. వాళ్లిద్దరే తల్లిని ఒప్పించుకోవాలి. నాకా నేర్పు లేదు"

"నిజంగా అదృష్టవంతుడివి గోపాల్. నీ సమస్యలను పరిష్కరించడానికి నీ పిల్లలు పెరిగి పెద్దవారయ్యారు. సరైన నిర్ణయాలు తీసుకోవడానికి తోడ్పడుతున్నారు."

"వాళ్లే చక్కటి నిర్ణయాలు తీసుకుంటున్నారు. నాకు తోడ్పడడం కాదు"


అసలు పెళ్లి చూపులంటే నాకు అసహ్యంగా ఉండేది. పాపం ఒక అమాయకపు పిల్లని చూడడం, వద్దనడం, ఆ తర్వాత ఆ పిల్ల మానసిక పరిస్థితి ఎలా ఉంటుందో ఆలోచించరు

"నీకు బాధగా, చిన్నతనంగా ఉందా. వాళ్లలా నిర్ణయాలు తీసుకుంటుంటే? "

"లేదు, లేదు. హాయిగా వుంది. నేను సరైన నిర్ణయం తీసుకోలేనేమోనని నా భయం? "

"భయమా? దేనికి? "

"జీవితంలో తీసుకోవలసిన అతి పెద్ద నిర్ణయాన్ని అమ్మ, అక్కయ్యల మీద పంతంతో సరిగా ఆలోచించకుండా తీసుకున్నాను"

"ఇప్పుడు చింతిస్తున్నావా? "

"అలా అని చెప్పలేను. ఒక్కోసారి అనిపిస్తుంది. తెలివితక్కువగా పెళ్లిని తేలికగా తీసుకున్నానా అని"

"ఎందుకనిపిస్తోందలా"

"పెళ్లంటే ఇద్దరు వ్యక్తులు అతిదగ్గరగా రావాలి. అలా వచ్చినా రాకపోయినా కలిసి బతకాలి. పిల్లలు పుట్టుకొస్తారు. పెరిగేకొద్దీ వారెలా తయారవుతారో ఊహించలేం. భార్యని పిల్లల్ని పోషించడానికి ఇష్టమున్నా లేకపోయినా ఏదో ఒక పనిచేయాలి యాంత్రికంగా. చివరికిదా జీవితం అనిపిస్తుంది"

"అయితే పెళ్లి చేసుకోకుండా ఉండటంలోనే సుఖం ఉందంటావా? "

"అలా అనలేను. కానీ పెళ్లి విషయంలో కొద్దిగా ముందు వెనకలు ఆలోచించాలి"

"మరి నీ విషయంలో ముందు ఎందుకు ఆలోచించుకోలేకపోయావు? "

"ఏవో ఆశయాలు. అమ్మ, అక్కయ్య అందం, కట్నం అంటూ వచ్చిన సంబంధాలు చెడగొడుతుండేవారు. వాళ్ల డబ్బు వ్యామోహానికి అంతం లేదు. తాహతును కూడా మర్చిపోయారు. సిమెంటు కంపెనీలో అసిస్టెంటు లక్షలు, కోట్ల వెల పలకడు. పెళ్లి మార్కెట్టులో" అని నవ్వాడు.

వేద కూడా నవ్వాపుకోలేకపోయింది.

"నిజం కాదా వేదా? నాలాంటి అసిస్టెం టుకు ఎంత కట్నం ఇచ్చేవారు? వాళ్లూ చూస్తారుగా పిల్లవాడి హోదా. అన్నీ పరవా లేదంటే ముక్కు పొట్టి అనో, రంగు తక్కు వనో వంకలు. అసలు పెళ్లి చూపులంటే నాకు అసహ్యంగా ఉండేది. పాపం ఒక అమాయకపు పిల్లని చూడడం, వద్దనడం. ఆ తర్వాత ఆ పిల్ల మానసిక పరిస్థితి ఎలా ఉంటుందో ఆలోచించరు. అందుకని చిరాకెత్తి ఆ చివరిసారి ఎవరిని చూస్తే ఆ అమ్మాయిని చేసేసుకుంటానని చెప్పి, అమ్మాయికంటే ఎక్కువగా నేనే తలవంచుకు కూర్చుని ముహూర్తం పెట్టేయండి అని మా వాళ్లని కట్నం మాట ఎత్తనీయకుండా బయటకు లాక్కొచ్చినంత పనిచేశాను"

"ఏమయినా ఇన్నేళ్లూ ఆవిడ నిన్నూ, పిల్లల్నీ కనిపెట్టుకుని చూసుకుంది. ఇంటి వ్యవహారం అంతా నీకే బాధా లేకుండా ఆవిడే చూసుకుంటోంది"

"అది నిజమే. ఆవిడ ఒక్కరోజు జ్వరం వచ్చి పడుకున్నా ఇంట్లో అంతా గందరగో ళమే. నాకు ప్రొద్దుట కాఫీ తాగాలని కూడా గుర్తురాదు. అంతా అయోమయంగా ఉంటుంది. కాత్యాయని చాలా నిపుణతతో నా చాలీచాలని జీతంతోనే ఇన్నేళ్లుగా నడుపు కువచ్చింది. దాంతోనే పిల్లలకి బట్టలనీ, నగలనీ ఏవో సమకూర్చుతుంటుంది. తన సుఖం చూసుకోదు. నాకూ, పిల్లలకూ చచ్చీ చెడీ సేవలు చేస్తుంది. ఎంత చెప్పినా తన పద్ధతి తనదే. ఎలాగో నీ పుణ్యమా అని మెల్లకన్ను, ఎత్తుపళ్ల సత్తెమ్మ దొరికింది. ఆ సత్తెమ్మని పనికి పెట్టుకోవడానికి ఒప్పుకుంది. ఏ అనుమానాలు లేకుండా" అని నవ్వాడు. వేదవల్లి కూడా అతడి నవ్వులో నవ్వు కలి పింది.

ఇంతలో ప్యూను హరిని, అదితిని, భార్గవిని వెంట పెట్టుకువచ్చాడు.

"రండి రండి కూర్చోండి" అంటూ సరిగ్గా చూడు అన్నట్లుగా కళ్లతో సైగచేసింది గోపా లకృష్ణకు వేదవల్లి.

బెంగాలీ స్త్రీలు సామాన్యంగా జుట్టును వది లేసినట్టుగానే పొడుగాటి వెంట్రుకలు అదితి వీపుమీద వేలాడుతున్నాయి. పల్చటి చెక్కిళ్ళ, కోలముఖం, తగిన అంగ సౌష్టవంతో పచ్చగా మెరుస్తున్న శరీరంతో సున్నితంగా ఉంది.

హరి ఎంపిక బాగానే ఉందనుకున్నాడు తండ్రి.

"నాన్నగారూ! మీరు కాసేపు కూర్చొని ఆంటీతో మిగతా విషయాలు మాట్లాడండి. అమ్మకి నచ్చచెప్పడానికి అన్ని వివరాలూ కావాలిగా. ఈసారి బాధ్యతంతా అన్నయ్యదీ, మీది" అంది నవ్వుతూ భార్గవి.

"అంటే నీకు విషయం తెలిసిపోయిందా?" అని అడిగాడు గోపాలకృష్ణ.

"ఆ. ఆంటీ నన్ను రమ్మన్నదే ఈ విషయం తెలుసుకోవడానికి".

"అవును గోపాల్. భార్గవి అయితే వ్యవ హారం చక్కబెడుతుంది. తను వెళ్లేలోగానే మీ ఇద్దరికీ ఈ విషయం చెప్పాలనే రమ్మన్నాను. ప్రమీల పెళ్లి అవుతూనే వీళ్ల గురించి మాట్లా డాల్సి వస్తుందనుకోలేదు. కానీ మీ కుటుంబా నికి ఏదో అదృష్టం పట్టినట్లు ఇలాంటి పరిస్థి తులు తన్నుకు వస్తున్నాయి" అంది వేదవల్లి నవ్వుతూ.

"ఏం అదృష్టమో ఏమో" అంటూ గోపాల కృష్ణ కూడ నవ్వాడు.

వేదవల్లి భార్గవి వైపు చూసి నీకు అదితి అన్ని విధాలా నచ్చినట్టే గదా" అనడిగింది.

"నాకు చాలా నచ్చింది- అసలు అన్న య్యకు అదితికీ నచ్చాక నాకు నచ్చితే ఎంత, నచ్చకపోతే ఎంత? కలిసి బతకాల్సింది వాళ్లిద్దరూ" అని అందరికీ బై చెప్పి వెళ్లిపో బోయింది భార్గవి.

"నేను దించేసి వస్తాను" అంటూ లేచాడు తండ్రి.

"నాన్నగారూ అమ్మకి కాళ్లూ, చెవులూ, బుర్రా చాలా వాడి. మీ

కారు చప్పుడు వెంటనే గుర్తించేస్తుంది. మనం ఎక్కడికో కలిసివెళ్లి తనకు తెలియకుండా ఏదో పన్నాగం పన్నుతున్నామనుకుంటుంది. ఏమిటి నాన్నగారూ, ఇన్నేళ్లు అమ్మతో కలిసుండి కూడా ఈమాత్రం తెలుసుకోకపోతే ఎలా? " అంటూ నవ్వుతూ అందరికీ మరోసారి చెప్పి వెళ్లిపోయింది భార్గవి. ఆమె వెంటే హరి, అదితి కూడా వెళ్లిపోయారు.

"భార్గవి చాలా చురుకైన పిల్ల. ఇంతకీ అదితి ఎలా ఉంది? " అనడిగింది వేదవల్లి గోపాలకృష్ణని.

"తుని తమలపాకులా ఉంది." అన్నాడతను

"భలే చక్కగా వర్ణించావు. మీరు అనవసరంగా జాప్యం చేస్తే వాళ్లిద్దరూ రిజిస్టర్డ్ మ్యారేజ్ చేసుకునే ప్రమాదముంది"

"నువ్వు ఇందాక అదృష్టమన్నావుగానీ ఈ ప్రేమలు, పెళ్లిళ్లు అన్నీ మా ఇంట్లో విప్లవం, సమస్య తెచ్చే విషయాలే. మేం కష్టపడకుండానే బాధ్యతలు తీరే మార్గాలే ఇవన్నీ అయినా వెంటవెంటనే వస్తున్న తుఫాన్లే... అదిసరే రిజిస్టర్డ్ మ్యారేజ్ అంటున్నావేమిటి? "

"అదితి తల్లికి క్యాన్సర్. మూడవ స్టేజీలో ఉంది. కూతురి పెళ్లిచూసి చనిపోవాలని ఆవిడ కోరిక"

"అయ్యో... ఈ క్యాన్సర్ నిజంగా ఎంత మంది ప్రాణాలను తీస్తోందో"

"భార్గవి చెప్పినట్టు నువ్వు, హరీ మీ ఆవిడతో చెప్పేసే



యండి వెంటనే"

"ప్రమీల పెళ్లితోనే మనిషి గాభరా పడింది. వెంటనే ఇది కూడా చెబితే ఏమవు

తుందో"

"ఏమీ కాదు. ఆడవాళ్లకి సర్దుకుపోగల శక్తి ఉంటుంది. వేడిలో వేడిగా వెంటనే చెప్పేయడం మంచిదని నా ఉద్దేశ్యం"

"సరే... హరికి కూడా పాఠం నేర్పి పంపు" అని లేచాడు గోపాలకృష్ణ.

## 15

రాత్రి భోజనాలయ్యాక కాత్యాయని "భార్గవి బెంగుళూరు వెళ్లిపోయింది. అది ఎప్పుడు ఎలా ఏం చేస్తుందో నాకర్థంకాదు ఎప్పటికీ. ప్రమీలా వెళ్ళిపోయింది. ఇక మనం ముగ్గురమే మిగిలాం. ఏమీ తోచడం లేదు. ఇంట్లో ఎవరూ లేనట్టే ఉంది" అంది దిగులుగా.

"అందుకే ఒక కోడల్ని తెచ్చుకుంటే మళ్లీ ఇల్లు కళగా ఉంటుంది" అన్నాడు గోపాలకృష్ణ.

"కోడలు... ఒక్కసారి ఎక్కడినుంచి ఊడిపడుతుంది?" అందావిడ.

"కళ్యాణం వచ్చినా కక్కొచ్చినా ఆగదని... ఏమో ఎవరు చెప్పగలరు? ఊడిపడినా ఊడిపడవచ్చు"

"అదేమిటి? మీ దృష్టిలో ఎవరైనా ఉన్నారా?"

"నా దృష్టిలో కాదు"

"మరింకెవరి దృష్టిలోనన్నా ఉన్నారా?"

"హరి దృష్టిలోనే ఉన్నట్టుంది"

"ఎలా తెలుసు మీకు... హరి చెప్పాడా?"

"హరి మేడమ్ చెప్పింది"

"మీ స్నేహితురాలు నడుపుతున్నది సాఫ్ట్‌వేర్ కంపెనీయా, పెళ్ళిళ్ళ కంపెనీయా?" చాలా కోపంగా తీవ్ర స్వరంతో అంది.

"అంటే"

"మొన్నటికి మొన్న తన కంపెనీలో పని చేసే ప్రదీప్‌కి మన ప్రమీలనిచ్చి పెళ్లి చేసేవరకు వదలలేదు. ఇప్పుడు పెళ్ళి చేయడానికి మన హరే దొరికాడా?" ఆమె గొంతులో ఇంకా అదే తీవ్రత.

"మంచి పిల్ల దొరికితే పెళ్ళి చేసుకోమని చెప్పడంలో తప్పేముంది?"

"అసలెవరండీ ఆవిడ... మన కుటుంబ



విషయాల్లో జోక్యంచేసుకోవడానికి. మనం అందరం ఆవిడ చేతి కింద పనిచేస్తున్నామా? ఆవిడ మోచేతి నీళ్ళు తాగుతున్నామా? హరీ... అంతపాటి ఉద్యోగం మరెక్కడా దొరకదా నీకు" అంది కొడుకు వైపు తిరిగి.

"దొరకడం చాలా కష్టం. అయినా అసలు అంత మంచి కంపెనీలో ఉద్యోగం ఎందుకు వదులుకోవాలి" అన్నాడు హరి.

"అయితే మీ మేడమ్‌ని నీ వ్యక్తిగత విషయాలలో కల్పించుకోవద్దని చెప్పు. మీ నాన్నగారు లేరా? ఆవిడే మనకు ఇలవేల్పు అన్నట్టుగా అన్నింట్లోనూ ఆవిడ సలహాలను శిరసావహిస్తున్నారు" అంది రోషంతో.

"అమ్మా! నాన్నగారి తప్పేమీ లేదు ఇందులో. అసలు నాన్నగారు కల్పించుకోనన్నారు. నాతోపాటే పనిచేస్తున్న అదితి అంటే నాకిష్టం. మేమిద్దరం అదితి తల్లిగారు ప్రాణం వదిలేలోగా పెళ్ళి చేసుకుందామనుకుంటున్నాం" అన్నాడు హరి.

పిడుగు పడ్డట్టు ఉలికిపడింది. వెంటనే తెప్పరిల్లి "అంటే ఇక మేమెవ్వరమూ నీకేమీ కామా? " అంది ఏదో నిస్సత్తువ కమ్మేసినట్లు హఠాత్తుగా ఆమె స్వరం దీనంగా మారిపోయింది.

"అందుకే చెబుతున్నాను నీకిప్పుడు. నాన్నగారికీ మధ్యాహ్నమే తెలిసింది. భార్గవి మా ఆఫీసుకు వచ్చినపుడు చెప్పాను, అదితిని చూసింది. తాను ఒప్పుకుంది"

"నాన్నగారు ఒపుకున్నారా? "

"అభ్యంతరం లేదు. మా ప్రేమ సంగతి ప్రదీప్‌కి తెలుసు. అతడు చెబితే అది కాదనదు."

"అయితే, నాకు అభ్యంతరం వుందంటే కూడా చేసుకోవడానికి నిర్ణయించేసుకున్నావన్నమాట"

"అన్ని విషయాలు వింటే నువ్వూ అభ్యంతరం చెప్పవు. ఆ నమ్మకం నాకుంది. అమ్మా నీకు ఇష్టం లేని పెళ్ళి చేసుకుని నిన్ను బాధపెట్టలేను. వద్దంటే మానేస్తాను. అయితే ఒకటి. ఇక నేనెవరినీ చేసుకోను"

"అయితే పెళ్లి పెటాకులు లేకుండా మోడులా ఉండిపోతావన్నమాట"

"నువ్వు ఒప్పుకోకపోతే అంతే ఇక" అంటూ హరి లేచి తన గదిలోకి వెళ్ళిపోయాడు.

"చూశారా హరి కూడా ఎంత ఎదిగిపోయాడో" అంది ఏడుపు గొంతుతో కాత్యాయని.

"లే రేపు మాట్లాడుకుందాం ఈ విషయం. నువ్వీ మధ్య చాలా నీరసంగా వుంటున్నావ్. సరిగా నిద్ర లేకపోతే నీ ఆరోగ్యం చెడుతుంది" అంటూ చేయి పట్టుకు లేవదీసి తమ గదిలోకి తీసుకువెళ్ళాడు గోపాలకృష్ణ.

ప్రొద్దుటే యధాప్రకారం తల్లి కాఫీ కప్పు హరి చేతికిచ్చింది. ఆవిడ ముఖం పీక్కుపోయివుండటం గమనించిన హరి "అమ్మా! నువ్వు బాధపడకు. నేను అదితిని చేసుకోను, నీకిష్టం లేదు కనుక. నాన్నగారూ, నువ్వూ కూడా పెద్దవారయిపోతున్నారు. మీ ఇద్దర్నీ చూసుకోవాలి. ఎవర్ని పడితే వారిని అవగాహన లేకుండా చేసుకుంటే, మీకు ఎలాంటి కోడలు వస్తుందో తెలియదు. అవన్నీ ఆలోచించుకుని అదితిని చేసుకుందామనుకున్నాను. ఎందుకంటే ఇన్ని రోజులూ తనని జాగ్రత్తగా పరిశీలిస్తూ వచ్చాను. మనతో కలిసిపోతుందనిపించింది. ఇప్పుడు మునిగిపోయిందేమీ లేదు. మీకిష్టం లేకపోయినా చేసుకుంటానని ఆమెకు వాగ్దానం చేయలేదు. నేను మిమ్మల్ని ఒప్పించలేకపోయాను అని చెప్పేస్తాను" అన్నాడు.

కాత్యాయని హరి మాటలు విని మారు మాట లేకుండా వంటింట్లోకి వెళ్ళిపోయింది నెమ్మదిగా. గోపాలకృష్ణ తల్లీ కొడుకుల సంభాషణ విన్నాడు. భార్య సత్తువ లేనట్టుగా నెమ్మదిగా అడుగులేసుకుంటూ వెళ్ళడం కూడా గమనించాడు.

* * *

ఆఫీసు నుంచి భార్గవికి ఫోను చేశాడు హరి. "నువ్వు చెప్పమన్నట్టుగానే చెప్పాను.

చూద్దాం చివరికేమవుతుందో" అన్నాడు.

"చివరికి మీ ఇద్దరి పెళ్ళి అవుతుంది. అమ్మ మాటలకి నిరాశపడిపోయి అదితికి మరెవర్నినైనా చేసుకో అని చెప్పకు. రెండు రోజులవరకూ చూడు. అప్పటికీ మారకపోతే నేను ఆదివారం పొద్దుటే ఫ్లైట్లో వస్తాను" అని ఫోను పెట్టేసింది.

ఇక ఆ తర్వాత అందరూ ఎవరి మానాన వారున్నారు. ఉలుకూ పలుకూ లేదు. గోపాలకృష్ణ కూడా ఎప్పటిమాదిరిగా భార్యను అనునయించడంలాంటివి చేయ లేదు.

'ఆఖరికి ఆయనకు కూడా నామీద విరక్తి పుడుతున్నట్టుంది' అనుకుంది కాత్యాయని. మనసులో మథనం మొదలయింది. ఒక నిశ్చయానికి వచ్చింది. ఆదివారం పొద్దుట కాఫీ కప్పు చేతికిస్తూ "హరీ! అదితితో చెప్పు మీ పెళ్ళికి నాకేమీ అభ్యంతరం లేదని" అంది.

హరి ఆశ్చర్యంతో తల్లివంక చూశాడు. "అవునురా! నా జీవితం మూడు వంతుల యిపోయింది. నీకు మూడు వంతుల జీవితం ముందుంది. నా కోసం మీరు మీ నిర్ణయాలను మార్చుకోమని చెప్పడం మూర్ఖత్వం అవుతుంది. నాతో వేగడం మీ నాన్నగారికి తప్పదు. ఆయనకు కూడా వయసు పైబడ్డకొద్దీ విసుగ్గా ఉంది, నా అర్థంలేని పట్టుదలలు చూస్తే" అంది.

వాళ్ళ మాటలు వింటూ హాలులో కూర్చొని పేపరు చదువుతున్న గోపాలకృష్ణ 'హమ్మయ్య' అనుకుని తెరిపిగా ఊపిరి పీల్చుకొన్నాడు.

భార్గవి కోసం ఫోను చేస్తే ఆమె స్నేహితురాలు మాట్లాడింది. భార్గవి తెల్లవారుఝామునే ఫ్లైటులో హైదరాబాద్‌కు బయలుదేరి వెళ్ళిందని, ఈ పాటికి ఇంటికి చేరి ఉంటుందనుకుంటున్నానని చెప్పింది.

ఇంతలో కాల్ బెల్ శబ్దం, వెంటనే "అమ్మా" అంటూ భార్గవి గొంతు వినబడింది.

మీరన్నట్టే "వచ్చేసింది భార్గవి" అని ఫోను పెట్టేసి, హాలులోకి వచ్చాడు హరి ఆతృతగా.

"అన్నయ్యా... నిన్ను పెళ్ళికొడుకుని చేయడానికి వచ్చాను" అంది నవ్వుతూ భార్గవి, తండ్రి పక్కనే కూర్చొంటూ. కాఫీ కప్పుతో హాలులో ప్రత్యక్షమయింది కాత్యాయని. "ఇక్కడెవరైనా వాణ్ణి పెళ్ళికొడుకుని చేయకుండా అడ్డుకుంటారని ఆఘమేఘాల మీద వచ్చావా? " అంది కప్పు కూతురి చేతి కందిస్తూ. కళ్ళెగరేసింది హరివంక చూస్తూ. "ఏమిటి సంగతి అన్నట్టు."

"ఆ సంజ్ఞలు దేనికి? నేరుగా నన్నే అడగొచ్చుగా!" అంది కాత్యాయని.

* * *

ఆ మధ్యాహ్నమే అదితి తల్లిదండ్రులతో సహా ఇంటికి వచ్చింది, గోపాలకృష్ణ ఫోను చేసి ఆహ్వానించడం వల్ల.

అదితి తల్లి చాలా నీరసించిపోయింది. "ఎందుకమ్మా మీరు శ్రమపడి వచ్చారు. రేపు మేమే వచ్చి చూద్దుముగా" అన్నాడు గోపాలకృష్ణ.

## ష్ గట్టిగా అనకు



ఆరుద్ర గడ్డం పెంచడం మొదలెట్టిన తొలిరోజుల్లో ఓ మిత్రుడు 'ఈ చిన్ని గడ్డంలో మీరు అచ్చం షాజహాన్‌లా ఉన్నారు' అని వర్ణించాడు. వెంటనే ఆయన 'ష్.. గట్టిగా అనకయ్యా బాబూ! మా ఆవిడ వింటే తాజమహల్ కట్టించమంటుందిప్పుడు' అన్నారు చిలిపిగా.

"ఉన్న నాలుగు రోజులూ మంచం మీదనే గడపకుండా శక్తి ఉన్నంత వరకూ తిరగాలనీ, నలుగురినీ కలవాలని ఉంది" అందావిడ నీరసంగా నవ్వుతూ.

కాత్యాయనికి ఆవిణ్ణి చూస్తే జాలి వేసింది. త్వరలో చచ్చిపోతానని తెలిసి కూడా కాబోయే అల్లుడి ఇంటికి వచ్చి అందర్నీ చూసి తృప్తిపడే ఆవిడ మనస్తత్వం చూస్తే కాత్యాయనికి అబ్బురంగా అనిపించింది. ఆవిడ ముఖంలో ఎక్కడా చచ్చిపోతాను అన్న బాధ కాని, విచారం కాని కనపడలేదు, నీరసం తప్ప. తనకి అలాంటి బాధలు లేకున్నా ఏమిటో ఎప్పుడూ ఏదో పోగొట్టుకున్నట్టుగా, అందరూ తన చేతి నుంచి జారిపోతునట్టుగా బాధపడి అందరినీ ఎందుకు బాధ పెట్టాలి' అని తనలో తనే మధన పడింది. భార్గవి ఆవిడ పక్కనే వెళ్ళి కూర్చుని కబుర్లు మొదలుపెట్టింది.

"ఆంటీ మీకు పెళ్ళయి ఎన్నేళ్లయింది?"

"పాతికేళ్ళపైనే అయింది" అందావిడ.

"మీ ఇద్దరిదీ ప్రేమ వివాహం కదా! ఎవరు ముందు ఆ మాట చెప్పారు?"

'నేనే'అంటూ కాస్త సిగ్గుపడింది ఆవిడ. అందరూ గొల్లున నవ్వారు.

కాత్యాయని లోపలికి వెళ్ళింది వాళ్లకు మర్యాదలు చేయడానికి. భార్గవి కూడా తల్లికి సాయం చేయడానికి లోపలికి వెళ్లింది.

"బెంగాలీలకు ఇష్టమయ్యే సందేష్, రసగుల్లాలు తెచ్చాడు హరి. ఇప్పటి నుంచే అత్తింటివారిని ఆకట్టుకొంటున్నాడు" అంది కాత్యాయని నవ్వుతూ.

"అమ్మా! నీకెలా అన్పించింది. అదితి. నువ్వు కావాలనుకున్న కోడలు లాగా ఉందా?"

"అమ్మాయికేం. బంగారు బొమ్మలా ఉంది. జుట్టలా విరబోసుకుని ఉంటే సరస్వతీదేవి విగ్రహంలా ఉంది"

కాత్యాయని ఒక ట్రే, భార్గవి ఇంకో ట్రే పట్టుకుని హాలులోకి వచ్చారు.

"ఇవన్నీ ఎందుకమ్మా ఇప్పుడు?" అంది అదితి తల్లి.

"అమ్మా అన్నీ బెంగాలీ స్వీట్లే" అంది అదితి నవ్వుతూ.

కాసేపు ఆ కబురూ ఈ కబురూ చెప్పుకుని, "త్వరలో ముహూర్తాలు పెట్టుకుందాం" అంటూ లేచారు, అదితి తలిదండ్రులు. ఆ రాత్రి అదితి తండ్రి ఒక్కడే వచ్చాడు అర్జంటుగా ఏదో మాట్లాడాలని.

భార్గవి ఆ సాయంత్రం ఫ్లైట్‌కి వెళ్లిపోయింది. ఇంట్లో అందరూ ఆయన ఏం చెప్పబోతున్నారోనని ఆతృతగా చూస్తున్నారు ఆయన వంక.

"ఇక్కడి నుంచి నేరుగా మేం డాక్టరు దగ్గరకు వెళ్ళాం. ఆయన అదితి తల్లి ఇంకా ఎక్కువలో ఎక్కువ పదిహేను రోజులు మించడం కష్టమన్నాడు. అందుచేత వారం పది రోజుల్లో ముహూర్తం పెట్టుకుంటే మంచిదనుకుంటున్నాం. ఇంట్లో ఆవిడ ఏమీ చేయలేని స్థితిలో ఉంది- అన్ని విషయాలు మావైపు, మీవైపు కూడా మీరే చూసుకోవాలి మాకు పెద్దగా ఆస్తిపాస్తులు లేవు. ఉన్న క్యాష్ అంతా మా ఆవిడ జబ్బుకు ఖర్చుపెడుతున్నాను. నాకు పెన్షన్ వస్తుంది. నా కాలక్షేపానికి సరిపోతుంది, మీ అబ్బాయికి వస్తున్నంత జీతం అదితికీ వస్తుంది. మేమున్న ఇల్లు అదితికిద్దామనుకుంటున్నాను. పెళ్ళికి ముందే అదితి పేరున పెట్టేద్దామనుకుంటున్నాను. వెయ్యి గజాల స్థలంలో నాలుగు గదుల ఇల్లు. మా ఆవిడకు ఒంట్లో బావుండకపోబట్టి ఊరుకున్నానుగాని, లేకపోతే అందులో ఓ అయిదు వందల గజం డెవలపర్‌కి ఇద్దామనుకున్నాను. అది ఇక అదితి హరి చూసుకోవాలి కావాలనుకుంటే. ఏమయినా అది వాళ్ళ ఇష్టం. నేను ఇక్కడ అపార్టుమెంటులోకి మారదామనుకుంటున్నాను. నాకు డయాబిటీస్‌తో కిడ్నీలు సరిగా పనిచేయడం లేదు. నేను మా ఆవిడకంటే ముందే పోతాననుకున్నాను. కాని తనే ముందుంది.

"పెళ్ళికి నేనే ముందున్నాను. ఇప్పుడు పోయే ముందు కూడా మీకంటే నేనే ముందుంటా నంటోంది" అని గొంతు దుఃఖంతో పూడుకు పోగా కళ్లు తుడుచుకున్నాడాయన.

"మీరు అపార్ట్‌మెంటుకు మారడం దేనికి? అసలు ఇల్లు అదితి పేరున ముందే రాయడం ఎందుకు? మేమేమీ ఆస్తిపాస్తుల గురించి అడగలేదు కదా" అన్నాడు గోపాల కృష్ణ.

"అసలు మావారు ఆ రోజుల్లోనే కట్నం తీసుకోకుండా నన్ను చేసుకొన్నారు" అంది కాత్యాయని.

గోపాలకృష్ణ కృతజ్ఞతతోనూ, అబ్బురం గానూ చూశాడు భార్య వంక, ఆవిడకీ కట్నం ఆశ లేకపోవడం చూసి.

"నాకు ఇక దిగులేమీ లేదు. మేమిద్దరమూ పోయినా హరి, మీరుభయులూ ఉన్నారు, అదితిని చూసుకోవడానికి" అన్నాడాయన కృతజ్ఞతతో, కళ్లలో నీళ్లు నిండగా.




ఆ మరుసటి రోజు ఆఫీసు నుంచి ఫోన్ చేసి వేదవల్లి దగ్గరకు వెళ్లాడు గోపాలకృష్ణ-ఎప్పటి మాదిరిగానే మధ్యాహ్నం వేళ అతణ్ణి చూడగానే, "పెళ్లికి ముహూర్తం కుదిరిందా..." అనడిగింది.

"అందుకే వచ్చాను. వారంలోనే పెళ్లి మా ఆపార్ట్‌మెంట్ కాంపౌండ్‌లో ఉన్న హాల్ లోనే చేస్తే వీలుగా ఉంటుందంటోంది కాత్యాయని."

"బావుంది. మనోహర్, రేచల్ కూడా కంపెనీ పనిమీద వస్తున్నారు. అక్కడ ఆఫీసు ప్రదీప్ చాలా బాగా చూసుకుంటున్నాడట. ప్రమీల కూడా ఏదో కోర్స్ చేస్తోందట. అన్నట్టు గోపాల్, మీ ఆవిడకు రేచల్ విషయంలో ఏదో సందేహం వచ్చిందన్నావు? ఏమిటా సందేహం? "

"నువ్వు బాధపడతావు. పోనీలే కాత్యాయని కన్నీ సందేహాలే. అనుమానాలే. నువ్వు నీ పెళ్లి సంగతి ఎత్తావు ఆరోజు. కానీ పూర్తిచేయలేదు. వీటిని అలా ప్రశ్నలుగానే ఉండిపోనీయ్"

"ఎందుకు మిగలాలి? నీ సంగతులు నాకు తెలుసు. నా సంగతులు నీకు చెప్పకుండా దాచడంలో అర్థం లేదు. నేనొకసారి చదివాను' ఎక్కడో'. ఏ వ్యక్తికైనా ఎన్ని రకాలైన సంపదలు, సౌకర్యాలు ఉన్నా మనసు విప్పి మాట్లాడుకోవడానికి స్నేహం పంచే వ్యక్తి లేకపోతే ఆ వ్యక్తి జీవితం నిస్సారం అన్నాడొక విదేశీ ఉర్దూ కవి. మనిద్దరి స్నేహం అలాంటిదనిపిస్తుంది నాకు.

"చాలా సంతోషం వేదా. ఆనాటి వేద, ఈనాటి వేదకీ మధ్య ఎన్నెన్నో ఘటనలు జరిగిపోయాయి. మనిద్దరి మధ్య అంతరాలు మరింత పెద్దవయ్యాయి. అయితే నీలో ఇసుమంత మార్పు కూడా లేదు నాపట్ల. నీలాంటి వ్యక్తిని స్నేహితురాలిగా పొందటం నా అదృష్టం"

"నువ్వు చాలా పెద్ద మాటలు అంటున్నావు. పద భోజనం చేస్తూ మాట్లాడుకుందాం"

"భోజనం నువ్వు చేయి. నేను కాఫీ మాత్రం తాగుతాను. ఇవాళెందుకో ఆకలిగా లేదు"

"నేను నమ్మను. కాత్యాయని ఏమన్నా అని ఉండాలి"

"అది కాదు వేదా. కాత్యాయనికి కాస్త అనుమానం పాలు ఎక్కువ. మనోహర్ గారు కూడా లేరు. నేను నీ దగ్గరకు వచ్చి భోజనం చేస్తే అనవసరమయిన రాద్ధాంతం చేస్తుంది. అయితే ఈ మధ్య తనలో రానురాను మార్పు

వస్తోంది. అది మంచికో, చెడ్డకో తెలియడం లేదు. పూర్వం కోపంతో అరిచేది. ఏడ్చేది. ఇప్పుడు అట్టే మాట్లాడదు. ఏదో దిగులుగా ఉంటోంది"

"ఆ మార్పు మంచికే అనుకోవాలి. అంత ర్మథనం మొదలయి ఉంటుంది"

"అది ఏ మథనమో కాని, ఈ సంసార మథనంతో నాకు విసుగెత్తిపోతోంది. పూర్వం ఉన్న ఓపిక ఇప్పుడు లేదు. బతిమాలడాలు బామాలడాలు నావల్ల కావడంలేదు"

"సారీ గోపాల్. నావల్ల నీకు బాధ కలగ కూడదు".

"నాకేం బాధలేదు. నీ భోజనానికి ఆలస్య మవుతోంది. పద నువ్వు భోజనానికి కూర్చు న్నాక నేను వెళ్లిపోతాను"

భోజనాల గదిలోకి వెళ్లగానే గోపాల్ దృష్టి మళ్లీ అక్కడి ఫొటోమీద పడింది.

అది గ్రహించి వేద "ఎలా వుంది రేచల్?" అంది.

"చాలా అందంగా ఉంది. అసలావిణ్ణి ఇక్కడ ఇదివరకే చూశానుగా, మీ పిల్లలు వచ్చారని నువ్వు టీకి పిలిచినప్పుడు"

"ఆ! అవును కదూ! రేచల్ ఎవరని కదా మీ ఆవిడకు అనుమానం"

"అది మర్చిపో, దానికన్నీ అనుమానాలే"

"అనుమానం కాదు. కాత్యాయని తెలివి అనవసరంగా వక్రమార్గంలో నడుస్తుంది. కానీ, రేచల్ విషయంలో మాత్రం సరిగ్గానే నడిచింది. ఆవిడకు చెప్పు, 'రేచల్ వేదవల్లి సవితి అని"

"ఏమిటి నీవనేది?" ఆశ్చర్యపోతూ దగ్గరే ఉన్న కుర్చీలో కూలబడ్డాడు గోపాలకృష్ణ.

"ఎందుకంత డీలాపడిపోయావ్?"

"అకస్మాత్తుగా నువ్వలా చెప్పేటప్పటికి ఎలాగో అనిపించింది. హాస్యానికి అన్నావు కదూ?"

"ఉహుఁ... నిజంగానే అన్నాను. పెళ్లి చేసుకోకపోయినా, జంటగా కలిసి ఉన్నప్పుడు ఇద్దరూ భార్యాభర్తల కిందే చలామణి అవు తారు కదా!"

"అయితే పెళ్లిచేసుకోలేదన్నమాట?"

"ఎలా చేసుకోగలరు. నేనింకా బ్రతికి ఉన్నాను కదా? పెళ్లిమీద పెళ్లి ఎలా కుదు రుతుంది భార్య బతికుండగా"

"ఇంతకీ నీకూ మనోహర్‌కీ పెళ్లెప్పుడ యింది? ఆ కథ పూర్తిచేయి"

"మా అన్నయ్య ఆఫీసులో నన్ను చూసి రెండు రోజుల తర్వాత నా వివరాలు తెలు సుకుని పెళ్లి చేసుకుంటానన్నారట. ఒక వారం రోజుల్లో పెళ్లి జరగాలన్నారట"

"అంత త్వరగా నిర్ణయం తీసుకుంటే మీ అన్నయ్యకీక అతని వివరాలు తెలుసుకునే వ్యవధి లేకపోయి ఉండాలి"

"కాదు. మా అన్నయ్యకు న్యూజెర్సీలో ఒక స్నేహితుడున్నాడు. అతనికి ఫోన్‌చేసి తెలుసు కున్నాడు. అతని తల్లీతండ్రీ కారు యాక్సిడెం ట్‌లో ఆరునెలల క్రితమే పోయారనీ, మనో హర్‌కీ, అతని కంపెనీకి మంచి పేరుందని చెప్పాడట."

"అయినా వారం రోజుల్లోనే చెయ్యాలనడం ఎందుకు?"

"నేను ఎమ్.కామ్‌లో జాయిన్ అయ్యేపని మీదే కదా అన్నయ్య ఆఫీసుకు వెళ్లింది. అన వసరంగా ఇక్కడ కాలేజీలో చేరితే చదువు పూర్తయితేనే కాని పెళ్లి కుదరదంటారనుకు న్నారట"

"చూడగానే నచ్చేసి ఉంటావు"

"ఫరవాలేదు. బాగానే ఉంటాననుకున్నా రట. ఆయనకు పెయింటింగ్ పిచ్చి ఫిగర్ బావుంటే ఇష్టం ఆయనకు. అప్పుడు నేనలాగే ఉండేదానినని ఇంట్లోనూ, నా స్నేహితులూ అనేవారు. అంతే పెళ్ళయిపోయింది. మా అన్నయ్యా, తనూ కలిసి నాకు కూడా వీసా సంపాదించారు. ఆయన్ని తీసుకెళ్ళడానికి రేచల్ న్యూయార్క్ ఏరోడ్రోముకు పెద్ద పడవ లాంటి కారులో వచ్చింది. నన్ను చూసి తెల్లబోయినట్లుగా అనిపించింది. ఆయన 'ఈవిడ రేచల్... నా పి.ఎస్' అని

పరిచయం చేశారు"

"ఆడవాళ్ళు పి.ఎస్.గా పనిచేయడం పరిపాటే కదా అని నీకేమి అనిపించి ఉండకపోవచ్చు"

"అయినా నాకు త్వరగా అనుమానాలు రావు ఎవరి మీదా. నువ్వు చూశానన్నావుగా ఆ రోజు... ఎలా కనిపించింది నీకు? "

"నేను ఆట్టే ఎవరినీ పరికించి చూడను. అందంగానే ఉందనుకుంటా"

"అందంగానే కాదు, చాలా అందంగా ఉంటుంది. సన్నజాజి మొగ్గలా చాలా నాజూకుగా ఉంటుంది. తల్లి ఫ్రెంచావిడ. తండ్రి అమెరికన్"

"ఓ! అలా రెండు దేశాలలో ఉన్న రెండు రకాల వాళ్లకు పుట్టిన పిల్లలు అందంగా తెలివిగా ఉంటారంటారు. మరి నిన్ను చేసుకోక ముందునుంచీ సంబంధం ఉంటే నిన్నెందుకు పెళ్ళి చేసుకున్నాడు? "

"ముందు నుంచీ లేదు. నన్ను చేసుకోవడానికి కారణం ఢిల్లీ వాతావరణం. 'రెండేళ్లయినా చూసిన దానిని కదా! అక్కడి వాతావరణానికి తట్టుకోగలనని ఒకటి. రెండవది మా అన్నయ్య ఐ.ఎ.ఎస్. కావడం' తను ఇండియాలో కంపెనీ పెడదామనుకుంటున్నారు. అన్నయ్య సాయం ఉంటుం ది. పర్మిషన్లకూ వాటికీ"




"పెళ్ళయ్యాక కూడా రేచల్‌తో సంబంధం ఎందుకు పెట్టుకున్నట్టు? "

"విను పూర్తిగా. రేచల్ నిద్రమాత్రలు మింగి ప్రాణం మీదకు తెచ్చుకుంది. మొత్తానికి బతికి బయటపడింది. మనోహర్ ఆవిడ బాస్ కదా. పోలీసులు, హంగామా అంతా నడిచింది, మీ బాస్ మిమ్మల్నేమయినా బాధ పెడుతున్నారా? " అంటే "ఆయనకు దీనితో ఏమీ సంబంధం లేదు. నేను పెయింటర్‌ని. మా అమ్మ కూడా పేరుమోసిన చిత్రకారిణి ఫ్రాన్సులో. నాకు అప్పుడప్పుడు డిప్రెషన్ వస్తుంది. నిద్ర పట్టదు. నిద్ర మాత్రలు వేసుకుంటాను. ఏదో చిత్రం గీస్తూ మర్చిపోయి ఒకటికి నాలుగో మరెన్నో వేసుకున్నానో తెలియదు కూడా. తెల్లవారే వరకూ పెయింటింగ్ వేస్తూనే ఉన్నాను. చాలా మగతగా అనిపించి బాస్‌కి ఫోను చేశాను. నేను ఆఫీసుకు రాలేననీ చాలా మగతగా ఉందని చెప్పానంటూ వాఙ్మూలం ఇచ్చింది.

"ఆసుపత్రికి ఎవరు తీసుకువెళ్ళారు? " అడిగాడు గోపాలకృష్ణ.

"మనోహర్. రేచల్ తనకలా ముద్ద ముద్దగా మాట్లాడుతూ ఫోను చేసేటప్పటికి ఏదో చేసుకుని ఉంటుందని హడావుడిగా నేను బాత్‌రూమ్‌లో ఉంటే కేక వేసి చెప్పి వెళ్ళిపోయారు. ఆసుపత్రిలో పరిస్థితి చూసి వెంటనే నన్నక్కడికి రమ్మని నాకు ఫోను చేశారు. హడావిడిగా వెళ్లాను. రేచల్ నా చేయి పట్టుకుని ఏడ్చింది. మనిషి చాలా నీరసంగా ఉంది. ఎంతో చిక్కిపోయినట్టుగా కనిపించింది.

నన్ను కూడా పోలీసులు రేచల్ మీకెప్పటి నుంచి తెలుసు... లాంటి మామూలు ప్రశ్నలు వేశారు. పోలీసుల గొడవ తప్పింది. ఆవిణ్ణి ఆసుపత్రి నుంచి మా ఇంటికి తీసుకువచ్చాం. సూపు, తేలికపాటి భోజనం పంపించాను. సూప్ మాత్రం తాగి భోజనం అలాగే పంపేసింది. నేను వెళ్ళి చూసేసరికి రెండు చేతుల్లో ముఖం పెట్టుకుని ఏడుస్తోంది. నేను కాసేపు కూర్చుని ఓదార్చాను. ఆసుపత్రికి వెళ్ళడం వల్ల మధ్యాహ్నం భోజనం చేయలేదు. దాంతో వికారంగా అనిపించింది. మనోహర్‌ని పిలిచి వెళ్ళి రేచల్ సంగతి

చూడమని, నేను నిద్రమాత్ర వేసుకున్నాను. అదే నేను మొదటిసారి నిద్రమాత్ర వేసుకోవడం. ఇక తెల్లవారే వరకూ ఒళ్లు తెలియని నిద్రతో ఏం తెలియలేదు.



మరుసటిరోజు పొద్దున రేచల్ వచ్చి "నాకిప్పుడు బావుంది. ఇక నేను మా ఇంటికి వెళ్ళిపోతాను. రేపటి నుంచి ఆఫీసుకు కూడా వెళ్ళగలను" అంది.

కాస్త నీరసంగా వున్నట్టనిపించినా రేచల్‌లో కొత్త కళ వచ్చింది. సంతోషం వెల్లివిరుస్తోంది. రాత్రంతా విశ్రాంతి తీసుకోవడం వల్ల అలా తెరిపిగా ఉందేమోననుకొన్నాను. వరసగా మిత్ర, మైత్రా పుట్టడం, వాళ్ల ఆలనా పాలనా చూసుకోవడంతోనే నాకు సరిపోయేది. అక్కడ మనలా ఆయాలు దొరకడం కష్టం. మాకు పెట్టుకొనే స్థోమత ఉన్నా, ఆయా మీద వదలడం ఇష్టం లేక వాళ్ల సంగతి నేనే చూసుకునేదాన్ని.

మనోహర్ ఎక్కడ ఏ చిత్రకళా ప్రదర్శన ఉన్నా వెళ్లి వస్తుండేవాడు. రేచల్ కూడా చిత్రకారిణి అవడం వల్ల తనూ వెంట వెడుతూ ఉండేది.

మనోహర్ తరచూ టూర్లు వెళుతూ ఉంటారు. పి.యస్.గా రేచల్ వెంట వెళుతుంది. నాకు వెళ్లే అవకాశమే ఉండేది కాదు. నాకు పెళ్లయిన ఏడెనిమిదేళ్ళ వరకు ప్రెగ్నెన్సీలు, ప్రసవాలు పిల్లల్ని చూసుకోవడంతో సరిపోయింది. ఆ తర్వాత ఒకసారి పిల్లలతో సహా చైనా వెళ్లొచ్చాం. రేచల్ మామూలుగానే ఎప్పటిలాగే తన బాస్ పని చూడడం కోసం మాతో వచ్చింది. వాళ్లమ్మ న్యూజెర్సీ రావడంతో పెద్దిల్లు తీసుకుంది రేచల్. ఎక్కువగా మా యింటికి వచ్చేది కాదు. ఇంట్లో తన అవసరం కూడా లేదు. ఇంటి దగ్గర ఫోన్‌కాల్స్ వగైరాలు నేను చూసుకునేదానిని. ఇంటికే ఎక్కౌంటు పుస్తకాలు వచ్చేవి. నేను చూసి పెట్టేదానిని. ఎప్పుడైనా మనోహర్ ఆఫీసుకు వెళ్లేదా

నిని. రేచల్ నన్ను వెంట తీసుకువెళ్లి మర్యాద చేసేది. మనోహర్ పి.ఎస్.గా. వాళ్లిద్దరూ ఎంత తెలివిగా మెలిగేవారంటే నాకు ఏమాత్రం అనుమానం కలిగేది కాదు. అయితే నాకొకసారి అంటే మూడేళ్ల క్రితం వాళ్లిద్దరి సంబంధం చూచాయగా పొడగట్టింది. ఆయనని న్నాకై నేను అడగడానికి నా అహం అడ్డు వచ్చింది"

"నీకు అహం ఉందంటే నేనొప్పుకోను" అన్నాడు గోపాలకృష్ణ.

"పోనీ... నా వ్యక్తిత్వం అడ్డువచ్చిందనుకో. రేచల్ తల్లి చచ్చిపోయినప్పుడు-'రేచల్ ఒంటరిగా ఉంటోంది. నేను రెండురోజులు తనతో ఉండి వస్తాను' అన్నారాయన. రేచల్‌ని మనింటికి తీసుకొస్తాననో, లేక నన్నూ తన దగ్గర ఉండి సముదాయించమనో అనకుండా - ఎంతైనా రేచల్‌కి బాస్ కదా- తనెలావెళ్లి ఉందామనుకుంటున్నారు! అంతకంటే దగ్గర సంబంధం ఏర్పడిందనుకుంటూ ఇద్దరి మధ్యా" అనిపించింది.

"మీ యిష్టం. మీరు స్వయంగా వెళ్లి ఉంటే అంత బావుండదేమో" అన్నాను. ఆయన నా వంక తేరిపార చూసి, నేను ఎద్దేవాగా అనడం లేదని అమాయకంగా అంటున్నాననిపించి "వేదా! నిజంగా మేమిద్దరం బాస్ పి.ఎస్.లుగానే అనిపిస్తున్నామా నీకు. ఎప్పుడూ నీకు తట్టలేదా అంతకు మించిన సంబంధం మా యిద్దరి మధ్య ఏర్పడే అవకాశం ఉందని" అన్నారు.

"లేదు" అన్నట్టు తల అడ్డంగా ఊపాను.

"తర్వాత చెబుతాను. నీ కన్ని విషయాలు" అంటూ వెళ్లిపోయారాయన.

ఏమనుకున్నారో! ఏమో మరుసటి రోజే ఆఫీసు నించి నేరుగా ఇంటికి వచ్చేశారు. ఇద్దరం కలిసి టీ తాగాం. 'రేచల్ దగ్గరకు వెళ్లారా? ఎలా ఉంది కాస్త తేరుకుందా? " అనడిగాను.

"ఫర్వాలేదు. ఈ రోజు నేను రానవసరంలేదంది. ఆడవాళ్లు ఏ కష్టం నుంచైనా త్వరగా తేరుకోగలరనుకుంటాను"

"చాలా ఏళ్ళుగా నీతో రేచల్ సంగతి చెబుదామనుకుంటున్నాను. పూర్తిగా విని నువ్వే నిర్ణయించుకో. మన పెళ్ళికి కొద్ది నెలలకు ముందు నేను కంపెనీ పనిమీద ప్యారిస్ వెళ్ళాను.



ప్యారిస్ చిత్రకళకు, చిత్రకళాకారులకు ప్రసిద్ధి కదా! ఒకరోజు సాయంత్రం తీరికగా ఉండి బయటకు ఎక్కడికైనా వెళదామనుకుంటూ నేను బసచేసిన హోటలు గది తాళాలు ఇవ్వడం కోసం రిసెప్షన్ దగ్గరకు వెళ్లాను. అక్కడ ఒకమ్మాయి నిలబడి ఉంది తనని పరిచయం చేసుకుంటూ "నాపేరు రేచల్. నేను, మా అమ్మ వేసిన చిత్రాల ప్రదర్శన పక్క హాలులో జరుగుతోంది. చూస్తా రా? ' ' అనడిగి లోపలకు తీసుకువెళ్లింది. చిత్రాలన్ని ఎంతో బాగున్నాయి. తల్లి వీల్ చెయిర్‌లో కూర్చుని ఉంది. కీళ్లనొప్పులట. ఆవిడ వేసిన చిత్రం ఒకటి, రేచల్ వేసిందొకటి కొన్నాను. నాతోపాటు రిసెప్షన్ దగ్గరకు వచ్చింది రేచల్. కృతజ్ఞతగా అనుకున్నాను. రిసెప్షన్ దగ్గర నేనిచ్చిన నోటు మార్చి చిల్లర నాకిచ్చింది, చెప్పిన ధరకంటె ఎక్కువ ఇచ్చారంటూ. వాళ్ళు చెప్పిన ధరకంటే కావాలనే ఎక్కువ ఇచ్చాను. ఆమె తల్లిని అలా వీల్ చెయిర్‌లో చూసి జాలివేసి. మీ చిత్రాలు ఇంకా ఎక్కువ ధరే చేస్తాయి అంటూ చిల్లర తీసుకోలేదు నేను. చాలా సంతోషపడింది. 'మీ కభ్యంతరం లేకపోతే మీరిద్దరూ నాతో డిన్నరు తీసుకోండి' అన్నాను. లోపలికి వెళ్ళి వాళ్ళమ్మని అడిగివచ్చి సరేనంది.

మాట మధ్యలో వాళ్ళమ్మ, రేచల్ తండ్రి అమెరికన్. ఒకసారి మీలాగే వచ్చి నా చిత్రాలు చూసి అమెరికా తీసుకువెళ్ళాడు తన తోపాటు. కాని వెళ్ళిన కొద్దికాలానికే క్యాన్సరుతో చచ్చిపోయాడు. అప్పటికి రేచల్‌ని కడుపుతో ఉన్నాను. అక్కడే పుట్టింది. అక్కడ నన్నాదుకొనే వాళ్ళు లేక తిరిగివచ్చేశాను. ఇక్కడివాడినే మళ్లీ పెళ్లి చేసుకున్నాను. కాని నా జీవితం సాఫీగా సాగలేదు. దాంతో రేచల్‌కి బతుకంటే ఒక లాంటి భయం ఏర్పడింది. అప్పుడప్పుడూ డిప్రెషన్‌లోకి వెళుతుంది. అమెరికాలో పుట్టింది కనుక రేచల్ అమెరికా సిటిజన్' అని చెప్పింది. డిన్నరయ్యాక నేను లేచి వస్తుంటే 'రేచల్‌కి కంప్యూటర్ పని తెలుసు. చిత్రకళ మీద జీవనం గడవదని నేర్పించాను. తనకేమయినా మీ కంపెనీలో ఉద్యోగం దొరుకుతుందా? " అని అడిగిందావిడ.

"చూస్తాను. నేను వెళ్లాక రాస్తాను" అని కార్డిచ్చి ఆవిడ అడ్రసు తీసుకున్నాను.

మళ్ళీ రెండు నెలల్లోనే నేను ఫ్రాన్సు వెళ్ళవలసి వచ్చింది. అప్పుడు రేచల్ నాతో పాటు అమెరికా వచ్చింది, నా పి.ఎస్.గా. పని బాగా చేసేది. అయిదారు నెలలకే నేను ఇండియాకు రావడం నిన్ను చేసుకోవడం గబగబా జరిగిపోయాయి. మనసులో రేచల్‌కి నేనంటే అంత ఆరాధనా భావం ఉందని నాకు తెలియదు. తను నిద్రమాత్రలు వేసుకోవడానికి కొంత నేను కూడా కారణమే. జీవితకాలం తను నాతో ఉండిపోదామని వచ్చిందట. కాని హఠాత్తుగా పెళ్ళి చేసుకురావడం చూసి మనిషి ఛిన్నాభిన్నమైపోయింది. పైకి మామూలుగా ఉన్నా లోపల మధనపడి డిప్రెషన్‌లోకి వెళ్ళిపోతూ వచ్చిందనుకుంటా. ఒక సాయంత్రం నా ఒళ్ళో అకస్మాత్తుగా తల పెట్టుకుని ఏడ్చింది, ఆఫీసులో. నాకర్థం కాలేదు. "నువ్వులేందే నేను బతకలేను. నాకు నీపట్ల ఉన్న ప్రేమని, ఆరాధనని నువ్వర్థం చేసుకుంటావనుకున్నాను. ఆరోజు త్వరలోనే వస్తుందనుకున్నాను. కాని నువ్వు హఠాత్తుగా పెళ్ళి చేసుకువచ్చేశావు. నీ భార్యకు విడాకులివ్వమని నేనడగను. నన్ను పెళ్ళి చేసుకోమనీ అడగను. కాని నన్ను నీతోనే ఉండనీయి. లేకపోతే నేనేమయిపోతానో నాకే తెలియదు" అని ఏడ్చింది నా భుజం మీద తల పెట్టుకుని.

"రేచల్ చవకరకం మనిషిగా నాకు కనపడలేదు. చాలా గంభీరంగా ఉంటుందందరి దగ్గర. గొప్ప భావుకురాలు. ఆఫీసులో కూడా వీలు చిక్కినప్పుడల్లా చిత్రాలు గీస్తూ ఉంటుంది. ఆమె చిత్రాలు ఒంటరితనం, దుఃఖం, వేదన నేపథ్యంగా కలిగి ఉన్నట్టుంటాయి.

ఆఫీసు పనిలోను, టూర్లలోనుపడి పనిగట్టు

కుని రేచల్ వంక చూడలేదు నేను. నిద్రమాత్రలు మింగడానికి ముందు సాయంత్రం ఆమె నాతో తన భావాన్ని చెప్పుకుని ఏడ్చేటప్పుడు చూశాను. మనిషి సగం అయిపోయింది. ఆమెను ఎలా ఓదార్చాలో తెలియలేదు. ఉద్యోగం వచ్చింది కదా, తనకు తగినవాడినెవర్నో చేసుకుంటుందనుకున్నాను. కాని ఇలా నామీదే ప్రేమ పెంచుకుంటోందని తెలుసుకోలేకపోయాను.

ఆరోజు రాత్రే నిద్ర మాత్రలు మింగింది.

రేచల్‌ను ఆసుపత్రి నుంచి మనింటికి తీసుకువచ్చిన రాత్రి నుంచి ఇద్దరికీ దగ్గర సంబంధం ఏర్పడిందని చెప్పారాయన. 'నీకు నిజంగానే మా ఇద్దరి మధ్యా లైంగిక సంబంధం ఉందని కూడా తట్టలేదా? ' అని ఇంకా ఆశ్చర్యపోతూనే అడిగారు.

**మీరు నేలను విడవకుండా ఆకాశాన్నందుకోవ డానికి ప్రయత్నిస్తారు. నేను నేల లాంటిదాన్ని, ఆకాశాన్ని అందు కోవాలన్న కోరిక, శక్తి నాకు లేవు. ఇన్నాళ్ళూ మీరు నా దగ్గర ఈ విషయం దాచి ఉండాల్సింది కాదు**



"పది దేశాలు తిరిగే మగవాళ్లకి ఎప్పుడైనా చపలచిత్తం రేగి ఎవరితోనో గడిపితే దానిని పట్టుకుని ఏడ్చి రాద్ధాంతం చేసే తత్వం కాదు నాది. అది మీలోని ఒక బలహీనత అని ఊరుకుంటాను. అలాంటివారు భార్యని ప్రేమించరనీ, విడాకులు పుచ్చుకుంటారనీ అనుకోను. అలాగే టూర్లకు వెళ్లినపుడు మీరిద్దరు ఏ బంధంలో ఇరుక్కున్నారో అని ఆలోచించి ఆలోచించి మంచమెక్కేరకం కాదు నేను. మీ ఇద్దరి మధ్య ఉన్న సంబం ధం పెళ్లి వరకూ వచ్చిందా అనడిగాను.

"లేదు నువ్వుండగా నేనెలా తనని చేసుకోగలను. తను కూడా పెళ్లి చేసుకోమని అడగలేదు" అన్నారాయన.

"నన్ను పెళ్లి చేసుకోకుండా ఉంటే రేచల్‌ని చేసుకుని ఉండేవారా? " అన్నాను.

"బహుశా అలా జరిగి ఉండేదేమో" అన్నారాయన సాలోచనగా.

"ఇప్పుడు నేను విడాకులిస్తే మీరిద్దరూ పెళ్లి చేసుకోవచ్చు కదా" అన్నాను నేను.

"ఆ మాట పొరపాటున కూడా అనకు. నీ మీద ప్రేమ, గౌరవం రెండూ ఉన్నాయి నాకు. రేచల్‌కి కూడా నువ్వంటే ఇష్టం, గౌరవం. మన పిల్లల్ని తన స్వంత పిల్లలుగా చూసుకుంటుంది. నువ్వు విడాకులిచ్చినా నేను రేచల్‌ను పెళ్లి చేసుకోదలచుకోలేదు. 'ఇద్దరు మనసులు కలిసిన వాళ్లు పెళ్లి అనే బంధం లేకుండా కలిసి జీవించడంలో తప్పేముంది' అంటుంది రేచల్" అన్నారాయన.

"అలా మీరు రేచల్ కలిసి బతకటం మీ కిష్టం కావచ్చు అది నాకు కష్టంగా అనిపించవచ్చుగా" అన్నాను.

"నన్ను క్షమించు, మొదట రేచల్‌కే నేనంటే పిచ్చి ప్రేమ అనుకున్నాను. రాను రాను నాకూ తనంటే ప్రేమ ఏర్పడింది. నాకు పెళ్లయిందనీ, తనని పెళ్లి చేసుకునే అవకాశం లేదని తెలిసి కూడా తను నాపై ప్రేమను చంపుకోలేక, నాకు కూడా తన మీద అలాంటి ప్రేమ ఉందో లేదో కూడా తెలుసుకోకుండా నిరాశతో చావడానికి సిద్ధమయింది రేచల్. నువ్వు చెప్పు వల్లీ... నన్నేం చేయమంటావిప్పుడు. నిన్ను పోగొట్టుకోలేను. అలాగని రేచల్‌ని దూరం చేసుకుంటే తను పిచ్చిదయినా అయిపోతుంది లేదా ప్రాణం తీసుకుంటుంది.

తన ప్రేమావేశంలో నిరాశ ఎదురయితే ఏ అఘాయిత్యానికైనా ఒడిగట్టవచ్చు ఇప్పుడు నిరాశ, ఒంటరితనానికి బదులు అందం,

ఆనందం తన చిత్రాలకు నేపథ్యంగా ఉన్నాయి. నాకు చిత్రకారుడినవ్వాలని ఉండేది. కాని రేచల్‌కున్నంత భావుకత, నైపుణ్యం నాకు లేవు. ఏవో కొన్ని పిచ్చి చిత్రాలు వేసేవాణ్ణి. మహాచెత్తగా ఉన్నాయనిపించి వాటిని చించిపారేశాను. కాని నాకు చిత్రకళ పట్ల ఆసక్తి ఏమాత్రం తగ్గలేదు. అందుకే కంపెనీలో ఎంత పని ఉన్నా ఏ చిత్రప్రదర్శనకూ వెళ్లకుండా ఉండలేను. ఎంత డబ్బైనా అక్కడి చిత్రం ఒక్కటైనా కొంటాను. మనింట్లో అలాంటి చిత్రాలు ఎన్ని పోగయ్యాయో చూశావుగా. త్వరలో ఒక పెద్ద హాలులాంటిది కట్టించి దానిలో వాటన్నింటినీ భద్రపరచాలని ఉంది నీ సహకారంతో. అది ఒక చిత్రకళా ప్రేమికుడి వ్యక్తిగత మ్యూజియంలా నువ్వూ, పిల్లలూ కాపాడాలి' అన్నారాయన ఉద్వేగంతో.

"చిత్రాలేమిటీ, చిత్రకళ మీద పుస్తకాలు కూడా లెక్కలేనన్ని కొన్నారు. వాటిని కూడా దానిలో భద్రపరచవచ్చు కాని నాకంటే రేచలే ఆపని బాగా చేయగలదు. మన మిత్రకు కూడా చిత్రకళ అంటే ప్రాణం. రేచల్, మిత్ర చేపడతారు ఆ బాధ్యత. మీరు చిత్రాలు వేయడం మానివేసి వుండవచ్చు చిత్రకళని ప్రేమించే గుణం మీలో సజీవంగా ఉంది. నాకు సాహిత్యం అంటే పిచ్చి . అయితే నేను రాయలేను. ఎవరైనా రాస్తే చదివి ఆనందించడమే తెలుసు. మీరు నేలను విడవకుండా ఆకాశాన్నందుకోవడానికి ప్రయత్నిస్తారు. నేను నేల లాంటిదాన్ని. ఆకాశాన్ని అందుకోవాలన్న

## అది మీ బాధ్యతే

ఇవ్వాళ్టి కంప్యూటర్ కాలం పిల్లలు శారీరక వ్యాయామం తగ్గిపోయి పిన్న వయసులోనే చిన్న సైజు పీపాల్లా తయారవుతున్నారు.

అలా కాకుండా ఉండాలంటే వాళ్ళకు కనీసం రోజుకి ముప్ఫయి నిమిషాల పాటు శరీర వ్యాయామం అవసరమని అమెరికన్ హార్టు అసోషియేషన్ శాస్త్రజ్ఞులు చెప్తున్నారు. చదువుకు సంబంధించిన మానసిక ఒత్తిడి తగ్గటానికి ఇదివరకు పాఠశాలల్లో ఫిజికల్ ఎక్సర్‌సైజులూ, డ్రిల్లు వంటివి చేయించేవారు. దీనివల్ల మానసిక వత్తిడి తగ్గటమే కాక శరీర దారుఢ్యం పెరిగి రక్తంలో మంచి కొలెస్ట్రాల్ వృద్ధవుతుంది.

కానీ నేటితరం పిల్లల్లో పెరుగుతున్న ఒత్తిడి తగ్గడానికి అవసరమైన శారీరక శ్రమ పూర్తిగా మృగ్యమవుతోంది. వీడియో గేమ్స్, టి.వి. గేమ్స్, కంప్యూటర్స్, ఇండోర్ గేమ్స్, ఇంటర్నెట్ ఛాట్‌లు ఇవ్వాళ్టి పిల్లల్ని బాహ్య ప్రపంచానికి దూరం చేస్తున్నాయి. ఇలాంటి నిర్జీవమైన సెకండరీ జీవన విధానం వల్ల పిల్లల్లో ఆరోగ్య సమస్యలు తలెత్తుతున్నాయి. చిన్న వయసులోనే అధిక బరువు, రక్తపోటు, గుండె జబ్బులు, మధుమేహ వ్యాధి వస్తున్నాయి. శారీరక వ్యాయామం వల్ల ఈ జబ్బులనే గాక కార్డియోవాస్క్యులర్ వ్యాధుల్ని కూడా తరిమికొట్టవచ్చు.



చిన్న సైజు పెద్ద మనిషిలా మీ పిల్లల్ని చూసుకునే కంటే చదువుతోపాటు వారు క్రీడల్లో పాల్గొనేలా చేసి ఆరోగ్యవంతులుగా మలచడం తల్లిదండ్రుల బాధ్యతేనని చెప్తున్నారు డాక్టర్ క్లిమెంట్ జోసఫ్.

కోరిక, శక్తి నాకు లేవు. ఇన్నాళ్ళూ మీరు నా దగ్గర ఈ విషయం దాచి ఉండాల్సింది కాదు. నేను ఏడ్చి రాద్ధాంతం చేస్తానని ఎలా అనుకున్నారు? ఎలాంటి పరిస్థితినైనా బేరీజు వేసుకుని, తట్టుకోగల శక్తి, ధైర్యం నాకున్నాయి. నేను మీ ఇద్దరి ప్రేమకు అడ్డు వచ్చే దాన్ని కాదు. రేచల్ ఆకాశం లాంటిది. ఆవిణ్ణి అందుకున్నారు మీరు. ఇన్నేళ్ళు మీతో కలిసి సంసారం చేసినా మీలోని ఈ కళా తృష్ణ ఇంత లోతైనదని నేను గ్రహించలేకపోయాను. అది రేచల్ గుర్తించింది" అన్నాను.

"కవిత్వం చెబుతున్నట్టుగా ఉంది, నువ్వలా మాట్లాడుతూ ఉంటే. నువ్వు రాయాలనుకుంటే గొప్పగా రాయగలవు. రాయాలనుకోవు అంతే" అన్నారాయన. నేను నవ్వి ఊరుకున్నాను.

ఆ రోజు నుంచీ నేనూ ఆయన స్నేహితులుగా మిగిలాం. భార్యాభర్తల సంబంధం తెగిపోయింది, కాగితం మీద విడాకులు లేకపోయినా రేచల్‌కి అతనితో జీవిస్తే అదే మహా భాగ్యం, అదే జీవితం అనుకుంది. నేను ఆయనను ప్రేమించి పెళ్ళిచేసుకోలేదు. ఆయన నన్ను ఇష్టపడి పెళ్ళిచేసుకున్నారు, తనకు సరిపడతానని. మాది బేరీజుల వ్యవహారమే కాని, ప్రేమ వ్యవహారం కాదు. ఆయనను పెళ్ళిచేసుకుని ఆయనకు అన్నివిధాలా సహకరిస్తూ వచ్చాను. ఆయన సంపర్కంలో ఇద్దరు పిల్లల తల్లినయ్యాను. కంపెనీ వ్యవహారాల్లో కూడా భాగస్వామినయ్యాను. ఇప్పుడు నాకు యాభయ్యారు ఏళ్ళు. ఆయనకు అరవై ఏళ్ళు. రేచల్‌కు యాభై ఉంటాయేమో! తండ్రి కోసం అల్లాడిన రేచల్, భద్రత లేకుండా బాధలు పడ్డ రేచల్ తనకంటే పదేళ్ళు పెద్దవాడైన మనోహర్ తానూ, తన తల్లీ వేసిన చిత్రాలను కొని వారిపై ఆర్ద్రత చూపేసరికి తన వ్యక్తిత్వాన్ని, సర్వస్వాన్ని ఆయనకు అప్పగించింది. ఇన్నేళ్ళు కలిసి కాపురం చేసినా నేను ఆయనకు భార్యగా నా విధులు నిర్వర్తించానే కాని అంతటి ప్రేమను, ఆరాధనను పెంచుకోలేదు. నా వ్యక్తిత్వాన్ని నేను విడనాడలేదు. ఇక్కడ ఎప్పటినుంచో కంపెనీ పెడదామనుకున్నారాయన. ఇప్పటికి జరిగింది. అన్నీ కలిసి వచ్చాయి. నేనిక్కడికి వచ్చేశాను. పిల్లలిద్దరి పేరున పెట్టారు ఈ కంపెనీ" అంది.

"న్యూజెర్సీ కంపెనీతో నీకేమీ సంబంధం లేదా? " అడిగాడు గోపాలకృష్ణ.

"సగభాగం నాది, మిగతా సగం రేచల్‌దీ, మనోహర్‌దీ"

"రేచల్‌కి కూడా పిల్లలున్నారా? "

"మిత్ర, మైత్రాలే మా ఇద్దరికీ. నిజానికి మా పిల్లలిద్దరికీ నాకంటే రేచల్ దగ్గరే ఎక్కువ చనువు. మా మిత్ర రేచల్ దగ్గర చిత్రలేఖనం నేర్చుకుంటోంది కూడా. దాన్ని క్రితంసారి వచ్చినప్పుడు చూశావుగా. తండ్రి పోలిక. అలవాట్లూ, లక్షణాలూ ఆయనవే. ఇక మైత్రా నాలాగ, ఉండడమే కాకుండా పుస్తకాల పురుగు. కనపడిన పుస్తకమల్లా చదువుతాడు. ఇద్దరు పిల్లలూ తరచూ కంపెనీకి ఆఫీసుకు పోయి రేచల్ తెప్పించి పెట్టే ఐస్‌క్రీమ్ వగైరాలు మెక్కి వస్తూ ఉంటారు. ఆమె ఇంటికి వెళ్ళి ఫ్రెంచి భోజనం చేసి వస్తూ ఉంటారు. ఫ్రెంచివాళ్ళ వంటకాలు బావుంటాయి. నేనిక్కడికి వచ్చేసినప్పటినుంచి రేచల్ అయినా మా ఇంటికి రావాలట, లేకపోతే వాళ్ళయినా రేచల్ ఇంటికి పోవాలట"

"నువ్వు నిజంగా అమాయకురాలివి వేదా... అన్నేళ్ళుగా పసిగట్టలేని వాళ్ళిద్దరి సంబంధం మా కాత్యాయని ఫొటో చూడగానే పసిగట్టేసింది. ఆవలిస్తే పేగులు లెక్కపెట్టగలదు" అన్నాడతను నవ్వుతూ.

"నిజమే గోపాల్... వాళ్ళిద్దరి మధ్య జరుగుతున్న వ్యవహారం ఆఫీసులో అందరికీ తెలుసుననుకుంటాను. అయితే అక్కడ ఇలాంటి వాటిని గురించి ఎవరూ ఎక్కువ మాట్లాడరు. అన్నేసి గంటలతరబడి కలిసి పనిచేసి, రాత్రి పగలూ అనక టూర్లలో వెంట వుండి కంపెనీ ఆంతరంగిక విషయాలు

చూసుకుంటూ ఉండే స్త్రీతో, అందులోనూ రేచల్ లాంటి అందగత్తె, భావుకురాలి ఆకర్ష ణలోపడి సంబంధం పెట్టుకోకపోతే ఆశ్చర్యప డాలి కాని, ఇద్దరూ దగ్గర అయితే ఆశ్చర్యపడ నక్కర్లేదు? .

"నీలా ఎందరు ఆలోచించగలరు? " అన్నాడు గోపాలకృష్ణ.

టైమ్ చూసుకొని గబుక్కున లేచి "వేదా చూశావా టైమెంత అయిందో మనం భోజనా నికి కూర్చుని గంటయింది. చేతులు ఎండిపో యాయి. పద చేతులు కడుక్కుందాం" అన్నా డు. వాష్ బేసిన్‌కి దగ్గరలో మళ్లీ ఆ ముగ్గురి ఫొటో. అతడికి ఒక్కసారిగా వేద మీద ఎక్క డలేని జాలి పుట్టుకొచ్చింది. అంతలోనే భర్తని, అతడి బలహీనతల్నీ అర్థం చేసుకోగ లిగిన భార్యని పొందిన మనోహర్ గొప్ప అదృష్టవంతుడు అనుకున్నాడు.

గోపాలకృష్ణతో బయటవరకు వెంట వచ్చి పంపుతూ "ఇది కేవలం మనిద్దరిమధ్యే ఉండాలి. కాత్యాయనికి కూడా చెప్పొద్దు. అనవసరంగా ఎవరూ నేను భర్తచేత వంచించపడ్డానని జాలి చూపడం భరించ లేను. అదీకాకుండా నేను వంచించబడ లేదు. కాకపోతే మొదటే చెబితే బావుండే దనిపించింది" వేదవల్లి.

"మనోహర్ చేసిందీ కరెక్ట్. అప్పుడే చెబితే నువ్వింకా అప్పటి వయసులో ఎలాంటి నిర్ణయం తీసుకునేదానివో. ఇప్పుడున్నంత జీవితానుభవం అప్పుడు ఉండేది కాదుకదా!. మనోహర్ చాలా తెలివైనవాడు. అదృష్టవం తుడు. రేచల్ వల్ల నువ్వు అతడి జీవితం నుంచి వెళ్లిపోలేదు. ఏమయినా వేదా నాకు చాలా బాధగా ఉంది. ఏ స్త్రీ అయినా భర్త మరొకరితో అంతటి దగ్గరి సంబంధం పెట్టు కున్నాడంటే సహించలేదు. సామాన్యంగా"

"భర్తమీద ఆధారపడి బతుకుతుంది కనుక"

"అలా కొట్టిపారేయకు. నువ్వు బాగా చదువుకున్నదానివి. నీ కాళ్లమీద నువ్వు నిలబడగల శక్తి ఉన్నదానివి. అయినా నువ్విది సహిస్తున్నావు"

"ఒక సంగతి మర్చిపోతున్నావు గోపాల్. నాకు ఇద్దరు పిల్లలున్నారు. వాళ్లిద్దరు తండ్రి పట్ల విముఖత పెంచుకోకూడదు. పిల్లలు సామాన్యంగా ఇలాంటి సందర్భాలలో తల్లి పక్కనే చేరతారు. తల్లిమీద జాలిపడతారు. నాకు వాళ్ల జాలి వద్దు. తండ్రిమీద విము ఖత రాకూడదు. అంత ప్రేమగా చూస్తున్న రేచల్ మీద వాళ్ల ద్వేషం పెంచుకోకూ డదు. అందుకే నేనీ నిర్ణయం తీసుకు న్నాను... గోపాల్ నువ్వు కారెక్కు. అనవ సరంగా బయట నిలబెట్టి మరీ సోది మొద లుపెట్టాను. నువ్వు బాధపడొద్దు. జాలిప డొద్దు. నాకెంతో తెరిపిగా, హాయిగా ఉంది. భార్యత్వం అనేది గొప్ప బాధ్యతతో కూడి నది. ఆ బాధ్యత తప్పింది"అంటూ నవ్వేసిం ది గలగలా.




హరి, అదితిల పెళ్ళయిపోయింది. రేచల్, మనోహర్ రాలేకపోయారు.

అదితి తండ్రి ప్రదీప్ అపార్ట్‌మెంట్‌కు మారాడు. పెళ్ళయిన వెంటనే మారదాం అనుకొన్నారు కాని, అదితి తల్లి సొంత ఇంట్లోనే ప్రాణం వదులుతానంది. ఆసుప త్రిలో చేరడానికి ఒప్పుకోలేదు. కర్మకాండ అయిపోయాక అదితి, తండ్రితోపాటు ప్రదీప్ అపార్ట్‌మెంట్‌కు వచ్చేసింది. అందుచేత హరి ఇటు తల్లిదండ్రుల్ని వదిలి దూరంగా వెళ్ళిపో వలసిన అవసరం కాని, అదితి తండ్రిని వదిలి అత్తింటికి రావలసిన అవసరం కాని

రాలేదు.

పెళ్ళయిన మరుసటిరోజే భార్గవి బెంగుళూరు వెళ్ళిపోయింది. చూస్తూ చూస్తూ ఉండగానే అదితి తల్లి చనిపోయి సంవత్సరం దాటింది. ఎంతో ప్రేమతో నిండిన జీవితాన్నిచ్చిన భార్య ఎడబాటును భరించలేక అనుకున్నదానికంటే ఎక్కువే దిగులుపడిపోయాడు అదితి తండ్రి. ఒకరాత్రి ఎప్పుడు కన్ను మూశాడో తెలియదు, ప్రొద్దుటే కూతురు తండ్రికి టీ చేసి తీసుకువచ్చి చూసేటప్పటికి శవమై కనిపించాడు.

అదితి తండ్రి మరణంతో కాత్యాయనిలో మరీ కొట్టొచ్చినట్టు మార్పు కనపడింది. అదితిపట్ల అత్తగా వ్యవహరించకుండా, తల్లిగా ఓదార్చింది మనసారా. గోపాలకృష్ణ ఆశ్చర్యపోయాడు. ఆనందపడ్డాడు. అసలు హరి అపార్ట్‌మెంటు తీసుకొన్నప్పుడే కాత్యాయనిలో కొంత అలజడి ప్రారంభమయింది. తన చుట్టూ, తన కుటుంబం చుట్టూ కట్టుకున్న కోటని లోపలినుంచే, తన కడుపున పుట్టిన కొడుకే పగలగొట్టడానికి ప్రయత్నించాడనిపించింది. భార్గవి ఉద్యోగం పేరుతో మొండిగా బెంగుళూరు వెళ్ళిపోవడం, ప్రమీల పెళ్ళి ప్రదీప్‌తో చేయించడం కోసం భర్త పిల్లలు తన అభీష్టాన్ని లెక్కచేయకపోవడంతో కోటగోడలు బలహీనపడ్డాయి. అదితి, హరిల పెళ్ళితో అసలు తన ఉనికినే వారికి తెలియజేయకుండా ఉండడానికి ప్రయత్నించినప్పుడు ఆ కోట ఒకవైపుకు కుంగిపోయినట్లనిపించింది.

'తన ప్రపంచం కేవలం భర్తా పిల్లలతోనే అనుకొని కుంచించుకుని బతికిన తనకి ఏం మిగిలింది? వాళ్ళ అభీష్టానికి తల ఒగ్గితే వాళ్ళు హృదయపూర్వకంగా 'అమ్మా' అని ప్రేమతో పిలిచినట్టనిపించింది. భర్త కళ్ళల్లోనూ ఎన్నడూ కనపడని సంతోషం కనిపించింది.

భర్త అందం, పిల్లల అందం ఇవేనా ముఖ్యం... అందం, అందం అంటూ ఆరడి



## వర్జించు పుగాకు

ఆరుద్ర ధూమపాన ప్రియుడు. వేళ్లమధ్య సిగరెట్ ఉంచి గుప్పిట మూసి పట్టుపట్టడంలో శ్రీశ్రీ ఫక్కీనే అనుసరించేవారు ఆయన. ఆరోగ్య కారణాలవల్ల దాన్ని మానేయాల్సి వచ్చినప్పుడు,'ఇది వర్జీనియా పుగాకు.. అనగా వర్జించవలసిన పుగాకు' అంటూ మాటల గారడీ చేసి అందరినీ నవ్వించారు.

పెట్టిన తన భర్త కుటుంబీకుల మాటలకు న్యూనతపడి తన జీవితాన్నే నరకప్రాయం చేసుకుంది. ఇంటి వాళ్లకి సేవ చేసింది కాని, అర్ధయుతమైన ఆనందాన్ని అందించలేకపోయింది. తనకు లేని అందాన్ని తలచుకుంటూ రాత్రింబవళ్ళూ తన సేవలతో తన ఇంటి వాళ్ళకి ఆనందాన్ని అందించి, తన లోటుని పూరించుకుందామనుకుంది. కారణం ఏదైనా అక్కా, తల్లి మాట వినకుండా తనని పెళ్ళి చేసుకున్న భర్త ఏనాడూ తను అందగత్తె కాదని అనలేదు. అసలు ఆయన మనసులో అలాంటి భావన ఉన్నట్లు ఏనాడూ కనపడలేదు. పిల్లలకు తల్లి అందంతో పనిలేదు. తల్లి అందంగా లేదని ఈసడించుకునే పిల్లలుండరు. తల్లి ప్రేమ చాలు వాళ్ళకి. అదే పెన్నిధి. అయినా తను అర్థం లేని న్యూనతాభావంతో ఎన్నెన్నో ఊహించుకుని, వాళ్ళందరూ తనకు ఎక్కడ కాకుండా పోతారో అన్న భయంతో వాళ్ళని అనవసరంగా బంధించినట్టుగా ప్రవర్తించి వాళ్ళకు దూరమైపోతూ వచ్చింది. ఎందుకు తని

న్నాళ్ళూ ఇలా పిచ్చిగా ప్రవర్తించింది' అని అనుకుంటూ అపార్ట్‌మెంట్ పిట్టగోడనాను కుని నిలబడి తనను తాను సమీక్షించు కుంటూ ఉండిపోయింది కాత్యాయని చాలా సేపు.

ఇంతలో ఎవరో సమ్మె చేస్తూ నినాదాలు చేస్తూ వెళ్తూ ఉంటే రోడ్డవంక చూస్తూ నిల బడింది. తమ బిల్డింగ్‌లోనే నాలుగు ఫ్లాట్స్ అవతలినుంచి ఒక పధ్నాలుగేళ్ళ పిల్ల వీల్ చెయిర్ తనకు తాను తోసుకుంటూ వచ్చింది "అంటీ" అంటూ.

కాత్యాయని "ఎవరమ్మా నువ్వు?" అని అడిగింది.

అడిగిందే తడవుగా ఎనిమిదో ఏటనే పోలియో వచ్చి రెండు కాళ్ళు చచ్చుపడిపో యాయని, అప్పటినుంచి వీలు చెయిర్‌లోనే ఎక్కువగా ఉంటున్నానని, ఇంట్లో అయితే దేక్కుంటూ తిరుగుతానని, తన తల్లి కింద మహిళా మండలి మీటింగ్‌కు వెళ్ళిందని, బయట ఆ స్లోగన్స్ వినబడి ఏమిటా అని బయటికి వస్తే మీరొక్కరూ నిలబడి కనప డ్డారని అందుకని మీ దగ్గరకు వచ్చానని చెప్పిందా పిల్ల.

"మహిళా మండలా? అదెక్కడుం దమ్మా?" ఆశ్చర్యపోతూ అడిగింది కాత్యా యిని.

"మన అపార్ట్‌మెంటులో ఉన్న ఆడవాళ్ళం దరూ కలిసి ఒక మండలి పెట్టుకున్నారు. ఎవరింట్లో అవసరం వచ్చినా అందరూ వచ్చి సాయం చేస్తారు. అప్పుడప్పుడూ, పండగలప్పుడు ఒక్కొక్కళ్ళు ఒక్కొక్క రకం పిండి వంట చేసి, అవి తీసుకుని వృద్ధాశ్ర మానికో, అనాథాశ్రమానికో, వికలాంగుల నిలయానికో వెళ్ళి వాళ్ళకి పెట్టి వస్తూ ఉంటారు. ఊరగాయలు పెట్టి అమ్మకానికి పెడతారు. అవన్నీ మన అపార్ట్‌మెంట్‌లో వాళ్ళే కొనేసుకుంటారు. ఇంట్లో మళ్ళా వేరే ఊరగాయలు పెట్టుకోవడం ఎందుకని" ఆరిందాలాగా చెప్పిందా పిల్ల.

"ఇవన్నీ నాకు తెలియవే" అంది.

"నిజంగానా ఆంటీ. మీరు మెంబరవ్వ లేదా దాంట్లో?" ఆ పిల్ల ఆశ్చర్యంగా అడి గింది.

"లేదమ్మా" అంది, కానీ వెంటనే గుర్తు తెచ్చుకుంది. తాము ఈ అపార్ట్‌మెంటుకు మారిన కొత్తల్లో ఎవరో కొందరు ఆడవాళ్ళు వచ్చి మెంబరవమని అడిగితే 'నాకు ఇంటి పనే సరిపోతుంది. నేను మీ మండలిలో చేరి చేయగలిగిందేమీ లేదని' పంపేసింది. ఆ రోజుల్లో మరీ తాను కూపస్థమండూకం లాగానే ఉండేది. అదే గొప్ప అనుకునేది. ఇంటి సేవే గొప్ప సేవ అనుకునేది. బయట కూడా ఏ కొద్దో సేవ చేయడానికి అవకాశం ఉందనే విషయం తనకి తట్టలేదు అప్పుడు.

"ఆంటీ... మా ఇంటికి రండి... మా ఇల్లు చూద్దురుగాని. నేను బొమ్మలు వేస్తా ను. చూపిస్తాను" అని కాత్యాయని చేయి పట్టుకుంది ఆ అమ్మాయి.

ఆ పిల్ల వంక ఒక్క క్షణం సాలోచనగా చూసి "పదమ్మా" అని వెంట వెళ్ళింది, వద్ద న్నా వీల్ చెయిర్ తోస్తూ. ఇంతలో ఆ పిల్ల తల్లి కూడా వచ్చింది. ఆ మాట ఈ మాట మీద మండలి సభ్యులందరూ వంతులవా రీగా తన కూతుర్ని బస్‌స్టాపుకు తీసుకువెళ తారని. మళ్ళీ సాయంత్రం అలాగే తీసుకు వస్తారనీ, అందువల్లనే తను కూతుర్ని చది వించుకోగలుగుతున్నానని చెప్పింది.

"మీ వారేం చేస్తారు? ఆయన తీసుకువె ళ్ళరా" అడిగింది కాత్యాయని.

"ఆయన పోయి రెండేళ్ళయింది. ఆయ నకు వచ్చిన కొద్దిపాటి డబ్బుతో అపార్ట్ మెంట్ ఆఖరి వాయిదా కట్టేశాను. ఇక నా జీతంమీదనే గడవాలి ఇల్లు. నేను గవర్న మెంటు స్కూలులో పనిచేస్తున్నాను. నా టైమింగ్స్ వేరు. పొద్దుటే ఎనిమిది గంట లకు స్కూలులో ఉండాలి. పాప విషయంలో మండలివాళ్ళే నాకు సాయం చేస్తున్నారు"

"మధ్యాహ్నం నేను ఖాళీగానే ఉంటాను.




మీ కభ్యంతరం లేకపోతే నేను తీసుకువస్తాను మీ అమ్మాయిని"

"చాలా సంతోషమండీ. మీరూ మహిళామండలిలో ఎందుకు చేరకూడదు? ఫంక్షన్ హాలు పక్కనే ఉన్నదా హాలు. మన మండలికిచ్చారు. ఫీజేమీ లేదు. వీలున్నప్పుడు తగిన సేవ చేయడం అంతే. వీలు కాకపోతే ఎవరూ ఏమీ అనరు. చేయలేదేమనీ అడగరు"

"రేపు నన్ను మహిళామండలికి తీసుకువెళ్ళండి" అని కాత్యాయని ఇంటికి వచ్చేసింది. వచ్చినప్పటినుంచీ ఒకటే ఆలోచనలు. ఆడబిడ్డ, అత్తగారు తను అనాకారి అని, కట్నం ఇవ్వలేరు కనుక తనని పెళ్ళి చేసుకోవద్దని అన్నారని అనవసరంగా కసి పెంచుకుంది. ఆ కసి వల్ల తనకు కాని, తన ఇంట్లోని వాళ్ళకి కాని ఒరిగిందేమిటి అశాంతి తప్ప అనుకుంటూ వంటింట్లోకి వెళ్ళింది. కాఫీ కలుపుకోవడానికి ఫిల్టర్‌లోని డికాక్షన్ గిన్నెలో పోయబోతుంటే గుమ్మం అవతల నిలబడిన సత్తెమ్మ "సాయంత్రం చాయ్ తాగితే మంచిదమ్మా" అని సలహా ఇచ్చింది.

మామూలుగా అయితే 'నిన్నడిగానా? నోరు మూసుకో' అనేది కాత్యాయని.

ఎందుకో ఆరోజు అలా అనిపించలేదు. "సరే నీకు చాయ్ ఎలాగూ చేయాలి కదా, నేనూ అదే తాగుతాలే" అంది.

"వేదవల్లమ్మగారు నేను చాయ్ మంచిగా చేస్తానని తాగేవారమ్మా" అంది సత్తెమ్మ కాస్త ధైర్యం తెచ్చుకుని.

కాని కాత్యాయనికింకా సత్తెమ్మకు వంటింటి పని అప్పగించడం ఇష్టం లేదు.

"భార్గవమ్మ గారికి చాయ్ ఇష్టం. ఆమె వచ్చినప్పుడు చేద్దువుగానిలే" అని రోజూలాగా టీ గ్లాసు గుమ్మం అవతల కింద పెట్టకుండా అక్కడ నిలబడి ఉన్న సత్తెమ్మ చేతికిచ్చింది. సత్తెమ్మ ముందు గాభరాపడిపోయినా, తర వాత తెగ ఆనందపడిపోయింది.

మరుసటి రోజు కాత్యాయనిని క్రితం రోజు పరిచయం అయిన స్కూలు టీచరుమహిళా మండలికి తీసుకువెళ్ళింది. కాసేపు ఆ మాటా ఈ మాటా అయ్యాక "మీ జుట్టు స్వంత మేనా? సవరం పెట్టుకొన్నారా? " అనడిగింది ఒకావిడ.

కాత్యాయని ఆ అనుకోని ప్రశ్నకి సిగ్గుప డుతూ "నాదే బాగా లేదా? " అంది.

"అయ్యో. అది కాదండీ. మెడ మీదుగా మీ ముడి ఎంత బాగుందో. ఎంతైనా మీ జుట్టు లాంటి నొక్కుల జుట్టు చాలా అందంగా ఉంటుంది. ఈ రోజుల్లో నొక్కులు తీయించే సుకుంటున్నారు అమ్మాయిలు" అందావిడ.

'నీ కళ్ళు, జుట్టు వచ్చి ప్రమీల ఇంకా అందంగా ఉంది' అన్న భార్గవి మాటలు గుర్తుకొచ్చాయి కాత్యాయనికి. అప్పుడు తనని బోల్తా కొట్టిస్తే వాళ్ళన్నవాటికన్నింటికీ తను తలూపుతుందనే ఆలోచనతో ఎకసెక్కంగా అందనీ, భార్గవి నిజంగా మనస్ఫూర్తిగా అన లేదని అనుకుందప్పుడు, తనని ప్రశ్నించినా విడ మాటలు విని. 'అయ్యో పాపం అది నిజంగానే అంది. ఎంత తప్పుగా అనుక న్నాను దాన్ని' అనుకుంది కూతురి మాటలు గుర్తొచ్చి

మరొకావిడ హడావిడిగా వచ్చి "60వ నెంబరు రామాయమ్మ గారి బంధువులెవరో పోయారట. ఆవిడగారు వెళ్ళాలట ఈవేళ. వాళ్ళాయన గుండెకాపరేషనై మంచంమీదు న్నాడు. ఆయనకు కాస్త పొద్దుటా సాయంత్రం తక్కువ నూనె వేసి భోజనం వండివ్వగలరా ఎవ్వరైనా? " అనడిగింది.

ఎవరో ఇద్దరు ముందుకు వచ్చారు. ఒకా విడ సాయంత్రం పంపడానికి, రెండో ఆవిడ మధ్యాహ్నం పంపడానికి అంగీకరించారు.

కాత్యాయని అందుకుని "నేను ప్రొద్దుట ఇడ్లీ, కాఫీ పంపుతాను" అంది తనకలా ఎందు కనాలనిపించిందో ఆమెకే అర్థం కాలేదు. అందరూ ఆవిడవంక చూశారు.

"ఒక్కరోజు వచ్చారో లేదో అందరితో కలి సిపోయి ఎలా అందుకున్నారో సేవాకార్యక్ర మాలు" అన్నారందరూ మెచ్చుకుంటూ.

కాత్యాయనిలో నిద్రాణమై ఉన్న అంశాలన్నీ ఒక్కొక్కటే బయటపడుతున్నాయి. వాటిని చూస్తున్న గోపాలకృష్ణకు చాలా ఆనందంగా ఉంది.




ఒకరో జున భార్గవి హఠాత్తుగా ఊడిపడింది- అయిదు నెలల పండంటి బాబు నెత్తుకుని- ప్రొద్దుట కాఫీ తాగుతున్న కాత్యాయనీ గోపా లకృష్ణ భార్గవిని, చేతుల్లోని బాబుని చూసి తెల్లబోయారు.

"అమ్మా! నీ మనవణ్ణి తీసుకుంటావా కాస్త. ఆటోవాడు సామాను బయటపెట్టాడు. ఈ బుడ్డిగాడి కోసం మరో సంచి ఎక్కువ తీసుకు రావలసి వచ్చింది" అంటూ బాబుని కాత్యా యని ఒళ్ళోపెట్టి విసవిసా బయటకు వెళ్ళిపో

యింది. ఆ మాటలతో బిత్తరపోయిన భార్యా భర్తలిద్దరూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు. భార్గవికి ఎప్పుడు పెళ్లయిందీ, ఎప్పుడు హైదరాబాద్ వచ్చిందీ, ఎప్పుడు కడుపుతో ఉందీ, ఎప్పుడు పిల్లాణ్ణి కన్నది అర్థం కాలేదు కాత్యాయనికి.

బయటి సామానుతో లోపలికి వచ్చిన కాత్యాయని వాటిని హాలులో ఒక పక్కగా పెట్టి, "నాకు తెలుసులే. మీకెన్నెన్ని ఆలోచనలు వస్తున్నాయో! నేను వచ్చి ఏడాదిపైనే అయింది. కిందటిసారి వచ్చినప్పుడు "నువ్వు కాస్త లావయ్యావే భార్గవీ" అన్నారు గుర్తుందా అమ్మా. అప్పుడు నేను కడుపుతో ఉన్నాను. నీకు తెలియకుండా ఏమిటి జాగ్రత్తగా కప్పుకున్నాను. ఆరోజు... లెక్కవేసుకోండి. నీ మనవడికి వయసు అయిదు నెలలు. అర్థమయింది కదా! పెళ్ళెప్పుడయిందంటారా? పెళ్ళి కాలేదు. సింగిల్ పేరెంట్ ని" అంది.

అది వింటూనే తల్లిదండ్రులిద్దరూ నోరెళ్ళబెట్టారు. గోపాలకృష్ణ కంటే ముందు కాత్యాయని తెప్పరిల్లి "ఇంత ఘనకార్యం చేసినవాణ్ణి పెళ్ళి చేసుకోలేకపోయావా? " అంది కాస్త ఎద్దేవగా.

"ఏమోనమ్మా... అలా తట్టలేదు. చూస్తాలే. వీలయినప్పుడు వాడొప్పుకున్నప్పుడు చేసుకుంటాలే. అప్పటికి ఇంకో పాప కూడా పుడితే ఇద్దరం చెరొక్కరిని ఎత్తుకుని మీకు పాదాభివందనం చేయడానికి వస్తాంలే. ప్రస్తుతం నాకు కాఫీయో, టీయో ఇయ్యి. కాఫీ డికాక్షను అయిపోయి ఉంటుంది. నువ్వు కూర్చో మనవణ్ణి చూసుకుంటూ. నేను చేసుకొస్తాలే" అంది భార్గవి, వంటగది వైపు వెళ్లబోతూ.

"సత్తెమ్మా! భార్గవమ్మగారికి చాయ్‌చేసి తీసుకురా" అంది కాత్యాయని గట్టిగా సత్తెమ్మకు వినపడేటట్లు.

సత్తెమ్మ, భార్గవి, గోపాలకృష్ణ ముగ్గురూ అకస్మాత్తుగా ఇంటికప్పు ఊడి మీదపడినట్టు ఉలిక్కిపడ్డారు.

సత్తెమ్మ తేరుకుని ఆనందంతో చాయ్ చేసి తీసుకొచ్చింది. భార్గవి తండ్రి వంక చూసి ఏమిటీ మార్పు అని అడుగుతున్నట్లు సౌంజ్ఞ చేసింది.

"అంత సౌంజ్ఞలొద్దులే తల్లీ... మీరంతా రెక్కలు వచ్చినట్టు వెళ్ళిపోయారు. ఇక ఎవరి కోసం రెక్కలు ముక్కలు చేసుకోవాలి. అందుకనే సత్తెమ్మ చాయ్ బాగా చేస్తానంది ఒక రోజు. నువ్వొచ్చినప్పుడు చేయమన్నాను. నువ్వు వచ్చావు. సత్తెమ్మ టీ రుచి చూపిద్దామని చెయ్యమన్నాను దాన్ని. చాలా ఇంకా వివరాలేమయినా ఇవ్వాలా? మీ అందరికి సంజాయిషీలు ఇచ్చుకోవడంతోనే నా జీవితమంతా గడపాల్సిందేనా? " అంది కాత్యాయని.

ఇంతలో హరి, అదితి వచ్చారు. "సత్తెమ్మ చేసిన టీ బావుంది. తాగి చూడండి" అని సత్తెమ్మను కేకేసి మరో రెండు కప్పుల టీ చేసి తీసుకురమ్మని హుకుం జారీ చేసింది భార్గవి.

అది విని ఉక్కిరిబిక్కిరయ్యారు హరి. అదితి అంతలోనే భార్గవి "అడుగోరా నీ మేనల్లుడు. అమ్మమ్మ వడిలో ఎలా ఆడుకుంటున్నాడో దొంగ వెధవ. ఎంతైనా రక్తసంబంధం ఎక్కడికి పోతుంది" అనగానే శోష వచ్చి పడిపోయినంతపనయింది వాళ్లిద్దరికి.

ఎవరి నోటా మాట లేదు. ఇంతలో బాబు కేరుకేరుమని ఏడవడం మొదలుపెట్టాడు. "వాడికి పాలు సరిపోవడంలేదు. తిండిపోతు వెధవ... పోతపాలే' అని లోపలికి వెళ్ళింది. భార్గవి, వేడినీళ్ళ కోసం. ఒక గ్లాసులో వేడి నీళ్ళు తెచ్చి సంచిలోంచి పాలడబ్బా, పాల సీసా బయటకు తీసింది. పాలు కలిపి "ఇటివ్వమ్మా వాణ్ణి" అంటూ తీసుకుని వడిలో పడుకోబెట్టుకుని పాలసీసా వాడి నోటికందించింది.

అప్పటికీ ఎవరూ ఆ షాక్ నుంచి తేరుకోలేదు. సత్తెమ్మ టీ కప్పులు తెచ్చి హరికీ, అదితికీ అందించింది. వాళ్లు టీ కప్పులు చేతుల్లో పట్టుకొన్నారు కాని తాగడం మర్చిపోయారు.

భార్గవి వాళ్ళిద్దర్నీ క్రీగంట చూసి "మేన ల్లుణ్ణి చూస్తే కడుపు నిండిపోయిందా, టీ తాగడం లేదు" అంది హాస్యంగా. హరి, అదితి టీ కప్పుని పెదవులకు చేర్చుకొన్నారు.

"అమ్మా... ఆ అయ్యగారికి ఇడ్డెన్ల మాటే మర్సారా" అంటూ గుర్తుచేసింది సత్తెమ్మ. ఈసారి భార్గవి వంతయింది తెల్లబోయి చూడడం.

"ఏ అయ్యగారు? " అంది భార్గవి తండ్రి వంక చూసి.

"మీ అమ్మ ఈ అపార్ట్‌మెంటువాళ్ళు ఏర్పాటు చేసుకున్న మహిళా మండలిలో చేరింది. ఒకాయన గుండె ఆపరేషన్ చేయిం చుకుని మంచంమీద ఉంటే నాలుగు రోజ లుగా పొద్దున్న ఫలహారం, కాఫీ మీ అమ్మ పంపుతోంది" అన్నాడు తండ్రి.

తల్లి వంక ఎంతో మెచ్చుకోలుగా చూస్తూ, ఇంకా నమ్మలేనట్టూ "అమ్మ! నిజమేనా? " అంది.

ఆ ప్రశ్నకి సమాధానంగా సిగ్గుపడుతున్న ట్టుగా తల వంచుకుంది కాత్యాయని. ఒక క్షణం, మరుక్షణం భార్గవి కొడుకు గుర్తుకొచ్చి, నిట్టూర్చుకుంటూ వంటింట్లోకి వెళ్ళింది.

"ఏమిటమ్మా భార్గవీ. ఇదంతా అల్లరే కదూ" అన్నాడు తండ్రి- కూతురి ఒళ్ళోని పిల్లాడి వంక చూస్తూ.

"అమ్మ వింటుంది. అమ్మని గాభరా పెట్టడానికే ఈ నాటకమంతా" అంది భార్గవి.

అక్కడ వంటింట్లోకి వెళ్ళి స్థాణువులా నిల బడిపోయిన కాత్యాయని భార్గవి చేసిన పనిని

## లంగ్ క్యాన్సర్‌కి కొత్త మందు...

'క్యాన్సర్' మాట వింటేనే చాలామంది వణికిపోతారు. అందునా 'ఊపిరితిత్తుల క్యాన్సర్' అంటే వేరే చెప్పాలా...

అయితే ఇప్పుడా భయంలేదు. కెనడాకి చెందిన అంతర్జాతీయ పరిశోధన బృందం మొట్టమొదటిసారిగా అడ్వాన్స్‌డ్ లంగ్ క్యాన్సర్ బాధితుల కోసం టార్సినా అనే కొత్త మందు కనుగొంది. కీమో థెరఫీ కూడా నిరర్థకమైన దశలో ఈ మందు సత్ఫలితాల నిస్తోందని చెప్తున్నారు. ఊపిరితిత్తుల క్యాన్సర్ చివరి దశలో ఉన్న రోగులకి టార్సినా ఇవ్వగా వాళ్ల క్రమంగా కోలుకోవడమే గాక, జీవన ప్రమా ణకాలం పెరిగిందట. ఇప్పటివరకు ఈ వ్యాధి చికిత్సలో వాడుతున్న 'ప్లాసిబ్' అనే మందు కంటే టార్సినా వల్లే మంచి ఫలితాలు వస్తున్నాయని ఆ పరిశోధన బృందం పేర్కొంటోంది.

ప్రపంచ వ్యాప్తంగా కనీసం ఒకటి, రెండు రౌండ్లు కీమో థెరఫీ చేయించుకున్న 731 మంది రోగులపై ఈ బృందం పరిశోధనలు జరిపింది. వాళ్ళలో 31 శాతం మంది నాన్ స్మాల్ సెల్ లంగ్ క్యాన్సర్ (సాధా రణ రకం) రోగులు 'టార్సినా' వల్ల ఎక్కువ కాలం బతికారని పరిశోధక బృందం చీఫ్ డా॥ ఫ్రాన్సిస్ షెపర్డ్ చెబుతున్నారు. కీమోథె రఫీ కూడా నిష్ప్రయోజనమైన దశలో లంగ్ క్యాన్సర్ రోగులు ఎక్కువ కాలం బతకటం వైద్య చరిత్రలోనే ఇది ప్రథమం అంటు న్నారాయన.



జీర్ణించుకోలేకపోతోంది. అయినా కొంతసేప టికి తేరుకుని అలవాటు చొప్పున ఫలహారం, కాఫీ డికాక్షను వేయడం లాంటి పనులు ముగించింది యంత్రంలా.

భార్గవి సత్తెమ్మని పిలిచి "బాబుకి నీళ్ళు పోద్దాం పద" అని స్నానాలగదికి దారితీ సింది. స్నానం చేశాక వాడు హాయిగా నిద్ర పోయాడు. మాటామంతీ లేకుండా అందరూ టిఫిన్ చేయడానికి కూర్చున్నారు.

"అన్నయ్యా! నువ్వూ, అదితీ భోజనాలు, ఫలహారాలు ఇక్కడేనా. ఇంట్లో ఏమయినా వదినమ్మగారు మరో పొయ్యి రాజేశారా? " అంది భార్గవి హాస్యమాడుతున్నట్లు వాతావర ణాన్ని తేలికచేయాలన్న ఉద్దేశంతో.

"ఏమో! అమ్మనడుగు" అన్నాడు హరి. కాత్యాయని విని కూడా విననట్టు ఊరు కుంది.

"వాళ్ళు ప్రదీప్ ఇంట్లో ఉండడానికి మీ అమ్మ ఒక షరతు పెట్టింది. రోజూ టిఫిన్, భోజనాలు ఇక్కడే చేయాలని. అయినా కాఫీ టీలు వాళ్ళ అపార్టుమెంట్‌లో చేసుకుంటూనే ఉన్నారు" అన్నాడు గోపాలకృష్ణ. కాత్యాయని మౌనంగా పనిచేసుకుంటూపోయింది. భర్తకు కావలసినవి రోజులాగా అందిస్తూ ఉందే కాని భార్గవి ఇలాంటి పనిచేసిందేమిటనే ఊసే ఎత్తలేదు. గోపాలకృష్ణకి చాలా ఆశ్చర్యం వేసింది. భార్య అలా మౌనంగా ఉండిపో వడం చూస్తే. భార్గవి వెంటబెట్టుకు వచ్చిన ఆ చిక్కుముడిని తనే విడదీస్తుందిలే అని ఊరుకున్నాడతను.

సాయంత్రం వేదవల్లికి ఫోను చేశాడు గోపాలకృష్ణ. "వేదా మా యింట్లో ఒక ప్రహ సనం జరగబోతోంది. వస్తావా చూడడానికి" అన్నాడు.

"ప్రహసనమా? కాత్యాయని ఏమైనా అను కుంటుందేమో. నేను అకస్మాత్తుగా ఊడిప డితే" అందావిడ.

"కాత్యాయనిలో చాలా మార్పు కనపడు తోంది. చాలా నిబ్బరంగా, ధైర్యంగా ఉం టోంది. దేనికీ బెంబేలు పడిపోవడంలేదు. ఏడవడంలేదు. అపార్టుమెంటులోని మహిళ లందరితో కలిసి ఏవో చిన్నపాటి సేవా కార్య క్రమాలు మొదలుపెట్టింది. ఇంతలో భార్గవి వచ్చింది, ఒక బాబు నెత్తుకుని"

"బాబునెత్తుకునా? పెళ్ళెప్పుడయింది? " వేదవల్లి ఆశ్చర్యంగా అడిగింది.

"పెళ్ళి అవసరమా పిల్లవాణ్ణి కనడానికి అందిలే భార్గవి. రా! తమాషా చూద్దువు గాని"

"అది తమాషా ఎలా అవుతుంది? 'మిస్టరీ' అను" కాస్త సీరియస్‌గా అంది వేదవల్లి.

"పోనీ అదే అనుకో... రా. భార్గవికి నువ్వంటే చాలా ఇష్టం. ఇక హరికి అదితికీ నువ్వు మేడమ్‌వే కాదు. దేవతవి. నీ ఫొటో పెట్టుకుని పూజ కూడా చేస్తున్నారో ఏమో!"

"అయ్యయ్యో! వద్దని చెప్పు. నేనింకా బతికే ఉన్నాను. పోయిన వాళ్ళకే చేస్తారు పూజలని చెప్పు" గట్టిగా నవ్వేస్తూ అంది. మళ్ళీ తనే, "వస్తాలే. ఒకసారి వచ్చి వాళ్ల ఫ్లాట్‌ను చూ డమని హరి, అదితి మరీ మరీ కోరారు ఇం తకుముందు. అక్కడికొచ్చి వస్తానులే మీ దగ్గ రకు కూడా" అని ఫోను పెట్టేసింది. ఆ సాయంత్రం గోపాలకృష్ణ ఆగ గంటలకే ఇంటికి చేరాడు. కాసేపట్లో హరి, అదితి వేద వల్లితో కలిసి వచ్చారు.

"మేడమ్ వచ్చారు మా యింటికి. వెళ్లిపో తానంటున్నా బలవంతంగా ఆపి ఇక్కడికి తీసుకువచ్చాం" అని ఎంతో ఉద్వేగంతో చెప్పా డు హరి, హాలులో ఉన్న గోపాలకృష్ణతో.

వాళ్లని చూస్తూనే, "హలో ఆంటీ" అంటూ హాలులోకి వచ్చింది భార్గవి బాబు నెత్తుకుని.

"ఎవరీ బాబు? " అడిగింది వేదవల్లి.

"నా బాబే ఆంటీ... బావున్నాడా? " అంటూ వేదవల్లి చేతికిచ్చింది.

"బంతిలా బావున్నాడు. కంగ్రాచ్యులేషన్స్. పెళ్ళికి పిలిస్తే మేమంతా వస్తామని భయప డ్డావా? గప్‌చుప్‌గా చేసేసుకున్నావ్"

"పెళ్ళి ఇంకా చేసుకోలేదు. బాబుని వళ్ళో

పెట్టుకుని చేసుకుందామనుకుంటున్నాం"

వేదవల్లి తెల్లబోతున్నట్టు గోపాలకృష్ణ వంక చూసింది.

ఇంతలో కాత్యాయని లోపల్నించి వస్తూ "అంత తొందరదేనికి. మరో ఇద్దరో ముగ్గురో పుట్టాక చేసుకుంటే బావుంటుంది" అంది వెటకారంగా. వేదవల్లిని చూసి "మీరెప్పుడొచ్చారు? నేను చూడలేదు. క్షమించాలి" అంటూ నమస్కారం చేసింది.

"ఇప్పుడేనమ్మా. మా అపార్ట్‌మెంట్‌కి వచ్చారు. మేమే ఇక్కడికి తీసుకొచ్చాం" అన్నాడు హరి.

కాత్యాయని హడావిడి పడిపోతూ వంటింటి వైపుగా వెళ్లింది. వేదవల్లి కూడా ఆవిడ వెంట పరుగు పెట్టినంత పనిచేసి "మీరు ముందు హాలులోకి రండి. లేకపోతే అందరం వచ్చి వంటింట్లోనే సర్దేసుకుంటాం" అని చేయి పట్టుకుని కాత్యాయనిని హాలులోకి తీసుకువచ్చింది.

మేడమ్‌గారు భార్గవి విచ్చల విడితనాన్ని చూసి ఏవగించుకుంటారేమోనని హరికి, అదితికి చాలా సిగ్గుగా ఉంది.

ఇంతలో కాల్‌బెల్ మోగింది. భార్గవి వెళ్ళింది తలుపు తీయడానికి. ఎవరో ఆరడుగుల ఎత్తుతో సౌమ్యత ఉట్టిపడుతున్నట్టుగా ఉన్న వ్యక్తి లోపలకు అడుగుపెట్టాడు.

"ఈశ్వర్. ఆయన మా నాన్నగారు. ఆవిడ మా అమ్మ. ఆవిడ మా నాన్నగారి కాలేజ్‌మేట్. పెద్ద సాఫ్ట్‌వేర్ కంపెనీ యజమానురాలు వేదవల్లిగారు. వారి కంపెనీలో పనిచేస్తున్న దంపతులు మా అన్నయ్య, వదిన" అంటూ అందర్నీ అతనికి పరిచయం చేసింది.

అందరికి అతడు వినయంగా నమస్కారాలు చేశాడు. కానీ అక్కడున్న అందరికీ అతనెవరో అర్థం కాలేదు. ఆ సందిగ్ధ పరిస్థితిని గుర్తించి భార్గవి "ఈశ్వర్- బాబుని కాసేపు తీసుకో. మేడమ్‌గారు ఇంతసేపూ ఎత్తుకునే అమ్మ వెంట వంటగదికి పరుగెట్టినంత పని చేశారు" అని బాబుని తీసుకొని ఈశ్వర్ చేతికిచ్చింది. అప్పుడందరికీ అర్థమయింది అతనెవరో.

'మంచి ఎంపికే' అనుకున్నాడు గోపాలకృష్ణ. కాత్యాయని చూసీ చూడనట్టు చూసింది. హరి, అదితి అంచనా వేస్తూ అతణ్ణి పరీక్షిస్తున్నారు.

అప్పుడందరికీ అర్థమయింది అతనెవరో. మంచి ఎంపికే అనుకున్నాడు గోపాలకృష్ణ. కాత్యాయని చూసీ చూడనట్టు చూసింది. హరి, అదితి అంచనా వేస్తూ అతణ్ణి పరీక్షిస్తున్నారు

ఇక వేదవల్లి తనైనా సంభాషణ నడిపించాలని "ఏం చేస్తుంటారు మీరు? " అంది.

"మీరు అనకండి ఆంటీ... మీ కొడుకు లాంటి వాడు" అంది భార్గవి.

"నిజమే కాని అతడు మాకింకా కొత్త కదా!" అందావిడ.

"నేను విప్రోలో సాఫ్ట్‌వేర్ ఇంజినీరుగా చేస్తున్నానండీ" అన్నాడు బాబుని అందుకుని ముద్దు చేస్తూ.

'పెళ్ళి చేసుకుని బిడ్డను కంటే ఏం పోయిందటా' అనుకుంది కాత్యాయని మనసులో.

"ఈశ్వర్ చెల్లెలు, నేను ఇన్ఫోసిస్‌లో పనిచేస్తున్నాం. అమ్మా నీకు గుర్తుంది కదా, చదువుకునే రోజుల్లో నేను వాళ్ళింటికి వెళుతూండే దానిని నోట్సుకోసం. ఇద్దరం కలిసి చదివాం. అనుకోకుండా ఇద్దరం ఒకేచోట పనిచేస్తున్నాం. ఒకే గదిలో కలిసి ఉంటున్నాం. ఈశ్వర్ నా స్నేహితురాలి అన్నయ్య. ఆయన ఉంటున్న వాటా దగ్గరే మాకొక గది దొరికింది. ఆయనకు పెళ్ళయింది. అయితే అయిదు నెలల క్రితం ఆయన భార్య పురిటిలో గుండె ఆగిపోయి చనిపోయింది.

ఇక అప్పటి నుంచీ ఈ బాబుని నా స్నేహితురాలు,నేను చూసు కుంటూ వచ్చాం, ఒక ఆయా సాయంతో. వాడు పూర్తిగా నాకు అలవాటయిపోయాడు. రాత్రిపూట ఆయా ఉండదు. వీడు నా దగ్గరే పడుకుంటాడు. బాబు నీకెలాగూ మాలిమి అయ్యాడుగా. మా అన్నయ్యను కూడా చూసుకోరాదూ అనేది నా స్నేహితురాలు, ముందు నాకర్థం కాలేదు. తరువాత విషయం చెబుతూ పెళ్లికి నేనొప్పుకుంటే వాళ్ల అన్న య్యని కూడా ఒప్పిస్తానంది. మొదటి నుంచీ ఈశ్వర్ నాకు పరిచయమే కనుక అతని స్వభావం నాకు తెలుసు. భార్యను బ్రతికి నంత కాలం పువ్వుల్లో పెట్టుకుచూసుకు న్నాడు. ఆవిడలా పోవడంతో మనిషి కుంగి పోయాడు. అతని బాధ చూస్తే నాకు జాలి వేసింది".

"అయితే జాలితో చేసుకుందామనుకున్నా వన్నమాట" అంది వేదవల్లి.

"అంతేకాదు. అతని స్వభావం నచ్చడం వల్ల కూడా. అయితే నువ్వు ముందు మీ తల్లి దండ్రుల్ని ఒప్పించమన్నాడు. అతడి చెల్లెలు ఇప్పటికే తల్లిదండ్రుల్ని ఒప్పించింది. మేము ముగ్గురం కలిసే వచ్చాం"

"ఒకవేళ మీ అమ్మా నాన్న ఒప్పుకోకపోతే పెళ్ళి చేసుకోవడం మానేస్తారా? " ప్రశ్నించిం ది వేదవల్లి.

"మానేస్తాను. నాకంతగా నిజంగా పెళ్ళి మీద మనసు లేదు. అయితే ఈ పిల్లవాడిని మాత్రం పెంచుకుంటాను. వాడిమీద మమ కారం నాకు మొదలయింది"

కాత్యాయని నోరు విప్పింది. "నీకు ఈ కొద్ది నెలల్లోనే ఎవరికో పుట్టిన బాబు మీద మమకారం మొదలయిందే. మా రక్తం పంచుకున్న నీ మీద ఉన్న మా ప్రేమ, మమ కారం మాటేమిటి? " అంది.

"అందుకే కదమ్మా... మీ ఇద్దరిలో ఎవరి



## పాపకార్యం తగునా?

ఓ పెళ్లివిందు.. పాప్ మ్యూజిక్ హోరెత్తి పోతోంది. అతిథుల్లో కూర్చున్న ఆరుద్ర 'పుణ్యకార్యంలో ఈ పాప మ్యూజిక్కే మిటి మహాప్రభో!' అంటూ పక్కన ఉన్నవారికి పదాలతోనే గిలిగింతలు పెట్టారు.

కిష్టం లేకపోయినా నేను చేసుకోనన్నానుగా" అంది భార్గవి.

"అతను మాంసాహారుడయితే నువ్వు కూడా ఆ అలవాటు చేసుకుంటావా? " అందా విడ.

"అమ్మా. నాకు తెలుసు. నువ్వు తెలివిగా అతని కులం తెలుసుకుందామని ఆ ప్రశ్న వేశావని. వాళ్ళు శాకాహారులు. వాళ్ళు ఏ కులానికి చెందినా వీరశైవమతం పుచ్చుకుంటే శాకాహారులుగా మారాల్సిందే. మూడు తరా లుగా వీళ్ళ కుటుంబం ఆ సాంప్రదాయంలో ఉన్నారు. వీరిని లింగాయత్‌లంటారు"

ఈశ్వర్ నోరు విప్పలేదు. వాళ్ళ మాటలు వింటున్నాడు. కాసేపటికి లేచి అందరికీ నమ స్కారం చేసి బాబుతోసహా బయటకు నడి చాడు.

"ఉండు ఈశ్వర్. బాబు పాలడబ్బా, బట్టల సంచీ తీసుకువెళ్ళు" అంటూ లోపలి నుంచి సంచి తెచ్చి అతడికిచ్చింది. "పద" అంటూ బాబుని తనెత్తుకుని అతడితో బయటకు నడిచింది పంపించి రావటానికి.

తిరిగి ఏమీ జరగనట్టుగానే భార్గవి లోప లికి వచ్చి ఆ కబురూ ఈ కబురూ చెబుతూ అందర్నీ నవ్వించడానికి ప్రయత్నించింది. వేదవల్లికి అది వ్యర్థ ప్రయత్నంగానే అనిపిం

చింది. లోపల దుఃఖాన్ని దాచుకుని అలా పైకి మాట్లాడుతోందని గ్రహించింది.

మరుసటి రోజు ఈశ్వర్ చెల్లెలు బాబుని ఎత్తుకు వచ్చి "భార్గవీ... వీడు రాత్రంతా ఏడుస్తూనే ఉన్నాడు. పాలు పట్టినా కక్కేశాడు" అంది. భార్గవి ఎత్తుకోగానే వాడు హాయిగా నిద్రలోకి జారుకున్నాడు.

"వీడిని నా దగ్గరే ఉండనియ్యి. వాడి సరంజామా పంపు. సాయంత్రం బస్‌స్టాప్‌లో కలుసుకుందాం" అని స్నేహితురాల్ని పంపేసింది భార్గవి. ఆ తరువాత వాడి సేవలో పడిపోయింది.

గోపాలకృష్ణ కాత్యాయనితో "ఏం చేద్దామంటావ్. నీ ఉద్దేశమేమిటి? " అనడిగాడు.

"మీ ఉద్దేశమేమిటి? " అని ఎదురు అడిగిందావిడ.

"నాదాని కంటే నీది ముఖ్యం. భార్గవి మొండిది. ఆ పిల్లవాడిని పెంచుకోవడం ఖాయం. తను పెళ్ళి చేసుకోకుండా ఉండిపోవడం ఖాయం"

"ఒంటరిగా ఎలా పిల్లవాడితో బతుకుతుంది. ఎన్ని అపవాదులు వస్తాయి? ఏదయినా ఒక నిర్ణయం తీసుకుంటే ఇక వెనుదిరగదు"

"అందుకే అంటున్నాను. సాయంత్రం వెళ్ళిపోతుంది. ఈలోపునే మనం నిర్ణయం తీసుకోవాలి. కొంతకాలం పోయాక మనం నిర్ణయం తీసుకున్నా, తను ఇక అతణ్ణి చేసుకోవడానికి ఒప్పుకోదు" అన్నాడు.

ఆలోచనలో పడ్డ కాత్యాయని కాసేపయ్యాక "వాళ్ళింటికి వెళదాం" అంది.

గోపాలకృష్ణ ఆవిడ వంక ఆశ్చర్యంగా చూశాడు.

తల వంచుకుందావిడ. భర్త చూపుల్ని తప్పించుకుంటూ

"నీకు వాళ్ల అడ్రసు తెలుసా? ..."

"నాకు తెలియదు కాని, హరికి తెలుసు. ఒకసారి భార్గవి వాళ్ళింటికి వెళ్ళి చీకటి పడినా రాకపోతే హరిని పంపాను తీసుకురమ్మని"

"అయితే త్వరగా తెములు" అన్నాడు గోపాలకృష్ణ.

"భార్గవీ... బజారుకు వెళ్లి సరుకులు తీసుకొస్తా. నువ్వింట్లో ఉంటావుగా" అనడిగింది కాత్యాయని.

"సరేనమ్మా. అయితే నాన్నతో సరుకుల సంచీ మోయించకు. షాపులో కుర్రవాడికి ఒక అయిదు రూపాయిలిస్తే సంతోషంగా తెచ్చి కారులో పెడతాడు. నాన్నగారు మీరు కారులోంచి దిగనే దిగొద్దు. మాగజైన్ చదువుకుంటూ కూర్చోండి" అంది భార్గవి నవ్వుతూ.

"మీ అమ్మ మునుపటి అమ్మ కాదమ్మా... అసలు ఆటోలోనే వెళ్లి తనంతట తనే అన్నీ తెచ్చుకుంటోంది ఈమధ్య" అన్నాడు.

ఒక అరగంటలో రెడీ అయి హరి అపార్ట్‌మెంట్‌కు వెళ్లి అతణ్ణి, అదితిని వెంటతీసుకుని ఈశ్వర్ తల్లి దండ్రుల దగ్గరకు వెళ్లారు. వాళ్లనలా చూడగానే అందరూ తెల్లబోయారు.

ఈశ్వర్ తెప్పరిల్లి "రండి సర్..." అంటూ అందరికీ నమస్కారం చేశాడు. అతడి చెల్లెలు అందర్నీ సాదరంగా కూర్చోబెట్టింది. కాఫీల కార్యక్రమం పూర్తి కాగానే పెళ్ళి ప్రస్తావన



వచ్చింది. ఈశ్వర్ ఇంటిలో అందరికీ ఆ సంగతి ముందే తెలిసింది కనుక భార్గవి తల్లిదండ్రులకు కూడా తమ సంబంధం సమ్మతమేనని తెలిసి ఎంతో సంతోషపడ్డారు.

గోపాలకృష్ణ, కాత్యాయని, హరి, అదితి కారు ఎక్కుతుండగా "నేను పెళ్ళి ఆర్భాటంగా చేసుకోవద్దనుకుంటున్నాను. రిజిష్టర్ మారేజ్ సరిపోతుంది. దానికి ఒక నెల పైనే పడుతుంది, అన్ని నియమాలు పూర్తయ్యేటప్పటికి. భార్గవికి కూడా అదే నచ్చింది. అయితే మీరొప్పుకోకపోతే తను పెళ్ళి చేసుకోనని చెప్పింది. ఆ ఒప్పందం మీదనే మేమిక్కడకి వచ్చాం. మేం అక్కడికి వెళ్లాక మీకు తేదీ తెలియజేస్తాం. మీ కుటుంబం, వేదవల్లిగారు వస్తే ఎంతో సంతోషిస్తాం" అన్నాడు ఈశ్వర్.

"వేదవల్లి నీకూ తెలుసా ఇంతకుముందు" అన్నాడు గోపాలకృష్ణ.

"లేదు... కానీ నిన్న మీ ఇంట్లో ఆవిణ్ణి చూశాక భార్గవి నాతో ఆవిడ గురించి చెప్పినట్టుగానే వున్నారనిపించింది. తనకు ఆవిడంటే చాలా ఇష్టం" అన్నాడతను.

కారు కదిలిందే తడవుగా "అదే మంచిదేమో!" రెండో పెళ్ళికి అంత ఆర్భాటం దేనికి అని వాళ్ళూ వీళ్ళూ చెవులు కొరుక్కోవచ్చు" అంది కాత్యాయని.

"నువ్వేనా ఆ మాట అంటున్నది. నువ్వు అలాంటి పెళ్ళికి ఒప్పుకోవేమోననుకున్నాను. నీలో ఎంత మార్పు వచ్చింది, నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది" అన్నాడు గోపాలకృష్ణ.

కాత్యాయని నవ్వి ఊరుకుంది. వాళ్ళు ఇంటికి చేరుకునేలోగా ఈశ్వర్ చెల్లెలు ఫోను



చేసి జరిగిందంతా భార్గవికి చెప్పింది.

తల్లీదండ్రి ఇంటికి రాగానే "సరుకులు కొన డానికి ఇంత సేపా... ఉత్తచేతులతో వచ్చారే మిటి? సరుకులేవి? " అంది భార్గవి ఏమీ ఎరగనట్లు అటూ ఇటూ చూసి.

"నీ పెళ్ళి టైముకి వచ్చేస్తాయిలే" అంది కాత్యాయని. కూతురి నాటకం గ్రహించి.

"అమ్మా! నాన్నగారు నువ్వు మారావన్నారు కానీ, ఇంత మారావనుకోలేదు..." అంటూ తల్లి దగ్గరకు వచ్చి ఆవిడ భుజం మీద తల పెట్టుకుంది కృతజ్ఞతతో.

## 19

అనుకున్నట్టుగానే భార్గవి, ఈశ్వర్‌ల పెళ్ళి జరిగిపోయింది. కాత్యాయని రోజురోజుకూ మహిళా మండలి సేవా కార్యక్రమాలలో మునిగి తేలుతోంది.

ఒక రోజు గోపాలకృష్ణకు ఫోన్ వచ్చింది. వేదవల్లి దగ్గర నుంచి. 'ఏదో అవసరమైన పని ఉంటేనే కాని తన కలా ఫోన్ చేయదు'అనుకుంటూ వెళ్లాడు గోపాలకృష్ణ వేదవల్లి ఇంటికి.

చూడడమే తడవుగా "ఆరు గంటల తర్వాత కూడా ఆఫీసులోనే కూర్చుంటున్నావా? పాపం కాత్యాయనికి నీతోపాటు ఎక్కడికైనా వెళ్లాలని వుండదూ. నీతో కూర్చుని కబుర్లు చెప్పుకోవాలనీ ఉండొచ్చు ఇక నువ్వు ఆఫీ సే లోకంగా ఉంటే ఎలా? " అంది వేదవల్లి.

"కాత్యాయనికి వత్తాసు బాగానే పుచ్చుకున్నావు కానీ, ఇక వారం రోజుల్లో రిటైరు కాబోతున్నాను. ఆ తర్వాత కాత్యాయనికి నాతో విసుగొచ్చి మీరు ఆఫీసుకు వెళితేనే బాగుండేది అనే ప్రమాదం ఉంది" అన్నాడు నవ్వుతూ గోపాలకృష్ణ.

"ఆ సంగతి మాట్లాడదామనే పిలిచాను. రిటైరయ్యాక ఏం చేద్దామనుకుంటున్నావ్? "

"చెప్పాగా. ఇంట్లో తీరికగా కూర్చుని కాత్యాయనిని విసిగిద్దామనుకుంటున్నాను" పకపక నవ్వుతూ అన్నాడు.

"హాస్యం బాగానే ఉంది కానీ... నేను సీరియస్‌గా మాట్లాడుతున్నా. నీకేదైనా పని కల్పిస్తే చేస్తావా? "

"ఇన్నేళ్లు చేసింది చాలదా? "

"నిజమే కాని, ఇన్నేళ్లుగా ఒక జీవితానికి అలవాటుపడి ఒక్కసారిగా ఏమీ లేకుండా కూర్చోవాలంటే కష్టం. నీకింకా ఓపిక తగ్గిపోలేదు"

"అదీ నిజమే, చేయగలిగిందేముంది? కొత్త మేనేజర్‌కి సాయంగా ఉండమన్నారు మా కంపెనీ వాళ్ళు. ఎవరి గౌరవం వాళ్ళు కాపాడుకోవాలి కదా! అయినా నేనిప్పుడు పెద్దగా సంపాదించాల్సిందేముంది? పిల్లలందరూ పెళ్ళిళ్ళయి హాయిగా ఉన్నారు. కాత్యాయని కూడా ఎంతగానో మారిపోయంది. జీవితంలోని విలువల్ని గుర్తిస్తోంది. తను తృప్తిగా జీవించడం నేర్చుకుంది"

**నిజమే కాని, ఇన్నేళ్లుగా ఒక జీవితానికి అలవాటుపడి ఒక్కసారిగా ఏమీ లేకుండా కూర్చోవాలంటే కష్టం. నీకింకా ఓపిక తగ్గిపోలేదు**

"నిజమే... అయితే నువ్వు నాకొక సాయం చేయాలి" అంది వేదవల్లి.

"ఏమిటన్నట్టు" చూశాడు ఆవిడ వంక.

"భయపడకు. నాకు ఒక నెల అమెరికా వెళ్లే పని పడింది కంపెనీ విషయమై. మిత్రని, మైత్రిని చూసి కూడా చాలా రోజులయింది. రేచల్ వాళ్ళని బాగా చూసుకుంటుందనుకో"

"అయితే నేను చేయాల్సిందేమిటి? "

"నువ్వు రోజూ రెండు మూడు గంటలు వచ్చి డబ్బు విషయం లెక్కలు డొక్కలూ చూసుకోవాలి. ఇప్పటివరకూ నేనే చూసు

కుంటున్నాను. నేనిక్కడ ఉండని నెలరోజు లూ నువ్వు చూసుకోవాలి!"

"నేను చేయగలనా? " అన్నాడు. సందేహంగా!

"భలేవాడివి. నువ్వు కాకపోతే ఎవరు చేయగలరు? నిజానికి నేను అడ్మినిస్ట్రేషన్ వరకు చూసుకోగలను. ఉద్యోగులకు ట్రయినింగ్ ఇవ్వగలను. ఈమధ్య రాబడి బాగానే వస్తోంది. నాకు కాస్త కష్టం అనిపిస్తోంది ఆ లెక్కలు చూడటం. ఒకటికి రెండుసార్లు లెక్కలు వేయాల్సి వస్తోంది. ఒక నెల చూడు. నీకు నచ్చితే నీ ఇష్టం వచ్చినంత కాలం ఆ లెక్కలు నువ్వు చూస్తూ ఉండొచ్చు"

"ఇంకా ఎవరూ దొరకలేదా? ఆ మధ్య మీ కంపెనీ ప్రకటన ఒకటి చూశాను"

"దొరకలేదు. ఎవరూ నమ్మకమైన వాళ్లుగా కనపడలేదు. డబ్బుతో వ్యవహారం. అన్నీ జాగ్రత్తగా చూడాలి. వచ్చిన ప్రతి ఒక్కడూ 'మీకెందుకమ్మా! ఇనకమ్ టాక్స్ వాళ్ళంతా నాకు తెలుసు. నేను ఏ గొడవా లేకుండా, ఎక్కువ డబ్బు ఇవ్వకుండానే మేనేజ్ చేసేయగలను' అనడంతో భయపడ్డాను. అసలు కంపెనీ హేరాఫేరీలతో నడుస్తుందన్నట్టు మాట్లాడే అభిప్రాయం నచ్చలేదు. నిన్ను బలవంతపెట్టను. కనీసం నేను లేని ఈ నెలరోజులూ చూసుకున్నా చాలు."

"నువ్వు ఏ ఆలోచనా లేకుండా వెళ్ళిరా. అంతా నే చూసుకుంటాలే. కాఫీ తెప్పించు. తాగి ఇక్కడినుంచే వెళ్ళిపోతాను. నువ్వు లోపలికి వెళ్ళావంటే ఫలహారం, పళ్ళూ అంటూ మొదలుపెడతావు"

"సరేలే" అని ప్యూన్‌ని పిలిచి కాఫీ తీసుకురమ్మని చెప్పింది.

కాఫీ తాగి అతను వెళ్ళబోతుంటే "థాంక్స్ గోపాల్. నీకు జీతం ఇవ్వను" అంది వేదవల్లి చిన్నగా నవ్వుతూ.

"నేనడగలేదు కదా" అన్నాడు గోపాలకృష్ణ కూడా నవ్వుతూ.

"నువ్వు అడగవని కూడా తెలుసు. మీరున్న అపార్ట్‌మెంట్ అమ్మకానికి వచ్చిందని తెలిసింది. అది కొనడానికి నీకు అప్పు ఇస్తాను. నువ్విక జీతం భత్యం లేని 'బాండెడ్ లేబర్‌వి!' అంది పకపకా నవ్వేస్తూ.

ఆ మాటలు విని గోపాలకృష్ణ చాలా కాలం తర్వాత మనసారా నవ్వాడు.

"జీవితకాలం ఇక నేను బానిసనేనన్న మాట. ఇంతకాలం భార్యకీ, పిల్లలకు మాత్రమే బానిసని. ఇక ఇప్పుడు స్నేహితురాలికి కూడా బానిసను" అన్నాడు.

వేదవల్లికి నవ్వాగలేదు. "మీ ఇంట్లో అందరికీ నువ్వంటే ఎంత ఆపేక్షో, ప్రేమో నీకు తెలియనిది కాదు. నా విషయానికి వస్తే ఆనాటి నా కాలేజ్‌మేట్ గోపాల్‌వే. ఆ రోజుల్లో నీ నోట్సు సాయంతో ఎలా ఇంటర్మీడియట్ పాసయ్యానో అలాగే ఈనాడు కూడా నీ సాయంతో ఈ కంపెనీ నడుపుదామనుకుంటున్నానంటే, నాకు నా మీద కంటే నీ మీదనే ఎక్కువ నమ్మకం ఉందని తెలియడంలేదా నీకు? " అంది.

"నాకు నీ మీద రోజురోజుకీ గౌరవం పెరుగుతోంది. ఏ భార్యా తట్టుకోలేని తుఫానులాంటి పరిస్థితుల్లో కూడా నిలదొక్కుకుని గుంభనంగా సంసారాన్ని సాగిస్తున్నావు విచ్ఛిన్నం కాకుండా" అన్నాడు.

"నువ్వు మాత్రం! ఎన్ని అలజడులు, ఆటంకాలు వచ్చినా కుంగిపోకుండా, విరక్తి చెందకుండా గుంభనంగా సంసారాన్ని లాక్కురావడం లేదూ? నీలాంటి భర్తలెంతమంది ఉంటారు? " అంది వేదవల్లి.

"అందుకే 'సంసారం సాగరం' అంటారు పెద్దలు" అన్నాడు గోపాలకృష్ణ సాలోచనగా.

"ఎన్ని ఆటుపోటులు వచ్చినా తట్టుకుని సాగిపోయే సాగరంలా సంసారాలు కూడా సాగాలనేమో" అంది వేదవల్లి తనలో తను అనుకుంటున్నట్టుగా. ✦

## నీలాల అతడీ కన్నుల్లో...

నీలాల నీ కన్నుల్లో పాలూ పొంగాలి అని ఆ యువకుడి తల్లి అతడి పసితనాన లాలిపాటలు పాడి స్ఫూర్తి నిచ్చిందేమో తెలియదు గానీ అక్షరాలా అతడు కళ్లల్లో పాలు పొంగిస్తున్నాడిప్పుడు. ప్రవీణ్‌కుమార్ సెహ్రావత్‌ది పదహారేళ్ల నవయవ్వన ప్రాయం. ఢిల్లీ సమీపంలోని దరియాపూర్‌కలాన్ వాసి. అతడి కళ్లల్లోంచి పాలు ఎలా వస్తున్నాయని ఆశ్చర్యపోకండి. ఆ పాలు ముక్కుతో తాగినవి. అదేంటంటూ అంతలా ఎవరూ నోరెళ్లపెట్టనక్కరలేదు. ఇది పూర్తి నిజం. ప్రవీణ్‌కుమార్ నాసికాపుటాల ద్వారా పాలు పీల్చుకుని వాటిని కళ్లలో ఉండే కన్నీటి వాహికల ద్వారా బయటకు విరజిమ్ముతుంటాడు. అదీ ఎంత దూరమనుకున్నారు? ! పన్నెండు అడుగులు! అనితర సాధ్యమైన ఈ ఫీట్‌తో ఇప్పటికే అతగాడు లిమ్కా బుక్ ఆఫ్ రికార్డులకెక్కాడు. అతడికింకా ఘనచరిత్ర ఉంది. ఐదు నిమిషాల ఏడు సెకండ్లలో 170 పచ్చిమిరపకాయల్ని కసాబిసా నమిలి మింగేసిన జాతీయ రికార్డు సొంతదారు. అంతేననుకున్నారా? ఎలాంటి ఇబ్బంది లేకుండా ముక్కుకు మేకును దిగ్గొట్టుకోగలడట. తమ గ్రామంలోనే కాదు, చుట్టుపక్కల గ్రామాలలో ఎందరికో ప్రవీణ్ స్ఫూర్తిగా నిలుస్తున్నాడని అతడి అన్నగారు ఆనందంతో ఉబ్బితబ్బిబ్బవుతున్నాడు.



## ఓహో... ఓహో... శునకమా...

కుక్కనైనా కాకపోతిని కూసింత సంగీతమైన వినగా...
భౌభౌమనైనా మొరగలేకపోతిని మధురగీత రసాస్వాదమున మనము ఊగిపోగా... అని మిగిలిన జంతువులన్నీ శునక జాతిని చూసి దిగాలు పడిపోవల్సిందేనేమో... అసూయతో మగ్గిపోవల్సిందేనేమో... ఎందుకంటారా... అలాంటి కాలమొచ్చేసింది మరి. మొన్నేమో బ్రెజిల్‌లో కుక్కల వంటి పెంపుడు జంతువులకు ప్రేమమందిరాలుగా విలాసవంతమైన ప్రత్యేక హోటళ్లు వెలిశాయి. నిన్నేమో జర్మనీలో నృత్య శిక్షణాలయాలు కొలువుతీరాయి. ఇప్పుడేమో ఏకంగా వాటికోసం ప్రత్యేకంగా ఓ రేడియోస్టేషన్ వెలిసింది. మనకెంతో విశ్వాసపాత్రమైన శునకాల్ని లాలించి, బుజ్జగించి, మెప్పించకపోతే మనం మనుషులమెట్లా అవుతాం అని అనుకున్నారో ఏమో థాయిలాండ్ వాసి ఒకరు. వాటి కోసమంటూ ఆన్‌లైన్ రేడియో స్టేషన్ ప్రారంభించేశాడు. దాని పేరు డాగ్ రేడియో థాయిలాండ్ డాట్‌కామ్. ఈ రేడియో స్టేషన్ 24 గంటలూ వాద్య, గాత్ర సంగీతంతో కుక్కల్ని అలరిస్తోంది. సంగీతం వినడం శునకాల ప్రవర్తనపై ప్రభావం చూపిస్తుందని, వాటిలో సున్నితత్వాన్ని పెంపొందిస్తుందని ఈ



## ఇంటికంటే చెట్టు పదిలం

అత్తల మీద, మొగుళ్లమీద అలిగి పుట్టింటికి తుర్రుమనే కోడళ్లని, భార్యల్ని చూశాంగానీ ఆలిమీద అలిగి చెట్లుపట్టిపోయిన భర్తల్ని గురించి ఎవరూ విని ఉండరు. కని ఉండరు. కానీ, అలాంటి భర్తగారూ ఒకరున్నారండోయ్. భార్యతో కలహించిన ఆ భర్తగారు ఇంటికంటే చెట్టు పదిలమనుకున్నాడేమో- ఒకటీ... రెండూ... కాదు, గత యాభై ఏళ్లుగా ఓ చెట్టుమీద కాపురముంటున్నాడు. ఒరిస్సాలోని కుచిగామ్‌కు చెందిన గయాధర్ పరీడా అనే అతగాడి వయసు 83 ఏళ్లు. ఇంతకీ భార్యతో వచ్చిన గొడవ పెద్దదనుకుంటే తప్పులో కాలేసినట్లే. చిన్నపాటి గొడవే అయినా, అర్ధశతాబ్ది దాటినా అతడు ఇంటికొచ్చే ప్రసక్తే లేదని ఇప్పటికీ భీష్మించుకునే ఉన్నాడు. పరీడా నివాసమున్న చెట్టు ఒకసారి గాలివాన కారణంగా కూలిపోయినా ఇతర చెట్లమీదకు ఆశ్రయం మార్చుకున్నాడు. పైగా, భార్యతో గొడవొచ్చి చెట్టు పట్టిపోయిన కొన్నాళ్లకు తనలో ఆధ్యాత్మికత ఉప్పొంగడం మొదలయిందని, తన నిలువెల్లా ఆ భావనే నిండిపోయిందని పేర్కొంటున్నాడు. అతడు చెట్లమీదే విషపూరిత సర్పాల నడుమ అధిక సమ యం గడుపుతుంటాడు. దగ్గరలో ఉన్న కుంటలో నీళ్లు తాగడానికి మాత్రమే కింది కి దిగివస్తుంటాడు. కుటుంబసభ్యులు పెట్టే ఆహారాన్ని స్వీకరిస్తాడు కానీ వాళ్లు ఎంత బతిమిలాడినా ససేమిరా చెట్టు దిగిరాను పొమ్మంటాడని పరీడా 55 ఏళ్ల కొడుకు బబులా చెబుతున్నాడు.




ఎన్నోసార్లు తండ్రిని ఒప్పించడానికి ప్రయత్నించి విఫలుడనయ్యానంటూ వాపోతున్నాడతడు.

సంస్థ యజమాని అనుపన్ బూన్‌చుయెన్ సెలవిస్తున్నాడు. జాగిలాలు సంగీతానికి తరచు ప్రతిస్పందించడం నేను గమనించాను. కొన్ని సంగీతం వినగానే తోకలూపుతుంటాయి. కొన్ని పడుకుని ఉన్నా తలలు పైకెత్తి ఆలకిస్తాయి. సంగీతం వినిపించగానే వాటి మూడ్‌లో మార్పు రావడాన్ని మా శిక్షణ సంస్థలో గమనించాను. అలాంటి సందర్భాల్లో అవి సౌమ్యంగా ఉండడమే గాక బొచ్చును సులువుగా ట్రిమ్ చేయనిస్తాయనీ గొప్పగా చెబుతున్నాడతగాడు.

బూన్‌చుయెన్‌గారి సంస్థలో కుక్కల కోసం సంగీతమందించడానికి ప్రత్యేకమైన డిజెలున్నారు. వీరి ప్రత్యేకత- ఆకట్టుకునే వ్యాఖ్యానాలతో, వాక్చాతుర్యంతో అలరించడం కాదు సుమా! భౌభౌలతో జాగిల జాతిని ఆకట్టుకోవడం! వీరికి కచ్చితంగా ఉండి తీరాల్సిన ప్రధాన అర్హత మొరగడంలో నిష్ణాతులై ఉండడం. అంతే కాదు; వినిపించే సంగీతపు మూడ్‌కు తగినట్లుగా రకరకాలుగా గుర్రుమనడం, మొరగడంలో కూడ ఆరితేరినవారై ఉండితీరాలి. డిజెలు ప్రత్యక్షంగా కుక్కల్ని చూస్తూ సంగీతం వినిపించకపోయినా వాటినుద్దేశించి సంగీతం ప్రసారం చేసే రేడియో స్టేషన్ కావడం వల్ల వాటితో చక్కగా కమ్యూనికేట్ చేయగలిగిన సామర్థ్యం కలిగి ఉండడం అనివార్యమని బూన్‌చుయెన్ పేర్కొంటున్నాడు. కుక్కల పెంపకానికి సంబంధించిన పాఠశాలలో శిక్షణ పొందిన పదిమంది విద్యార్థుల్ని అతగాడు డిజెలుగా ఎంపిక చేసుకున్నాడట!




# షాక్!

చతుర కథ

విస్మయ

'ఏయ్.. సుమిత్రా... ఈ విషయం విన్నావా?' సోమవారం పొద్దున్నే ఆఫీసుకొచ్చి సీట్లో కూర్చోబోతున్న సుమిత్రను పక్కసీటు అపర్ణ అడిగింది. ఇద్దరిదీ చెరో క్యూబికల్. మనుషులు కనబడరు. గొంతులు మాత్రమే వినబడతాయి.

'ఏ విషయం?' అడిగింది సుమిత్ర.

'అదే ఆ బారుజడ లీల. అన్నంతపనీ చేసింది.'

'ఏం చేసిందో చెప్పకుండా ఈ ఉపోద్ఘాతం ఏమిటి?'

'అయ్యయ్యో నీకింకా తెలియదా? ఆఫీసంతా కోడైకూస్తోంటే...'

'కోడై కూస్తే ఏం లాభం? నాకర్థమయ్యే భాషలో చెప్పాలి కదా.' ఇంతలో పక్క సెక్షన్ లలిత వచ్చి అపర్ణ చెవిలో ఏదో కాసేపు గుసగుసలాడింది. కొంపదీసి లీల ఆ క్రిస్టియన్ అబ్బాయితో లేచిపోలేదు కదా... ఇద్దరూ కలిసి రోజూ సాయంత్రాలు తెగ షికార్లు తిరిగేస్తున్నారు. ఎప్పుడో ఇలాంటి మాట వినాల్సివస్తుందని అనుకుంటూనే ఉన్నాను... ఫోను మోగడంతో సుమిత్ర స్వగతానికి బ్రేక్ పడింది.

'హలో..'

'హలో.. మేడమ్! నేను... అకౌంటెంట్ వేణుని. ఏంటి మేడం... లీల గారు ఇలా చేశారు. మీరంతా ఆమెకు చాలా క్లోజ్ ఫ్రెండ్స్ కదా. మీరైనా చెప్పకూడదా? మంచి అమ్మాయి. బాపూ బొమ్మలా మన ఆఫీసుకే అందంగా ఉండేది....'

'హలో... వేణూ.. ఇప్పుడేమైందని మీరంతా ఇలా గగ్గోలు పెడుతున్నారు. అసలేమైంది లీలకు? ఉద్యోగం మానేస్తోందా? పెళ్లి చేసుకుందా? లవ్ మేరేజా? ... అయినా ఈరోజుల్లో ఇవన్నీ మామూలే కదా. పైగా లీల ముంబాయిలో చదువుకుంది. తనకు

కులాలు, మతాలు పట్టింపులే లేవంటుంది. ఎప్పుడూ చెప్తూనే ఉంటుంది కదా.. నేను పెళ్లంటూ చేసుకుంటే ప్రేమించే చేసుకుంటా నని... నేనైతే ఎప్పుడో ఇలాంటి వార్త వినా ల్సివస్తుందని ఊహిస్తూనే ఉన్నాను..'

'ఏంటి మేడం మీరంటున్నది... నాకు ఒక్క ముక్క అర్థం కాలేదు. లీలగారు పెళ్లి చేసుకోవడమేమిటి? మీరెవరి గురించి మాట్లాడుతున్నారు? ... ఒక్క నిమిషం.. సార్ వస్తున్నారు. నేను మీతో మళ్లీ మాట్లా డతాను...'

ఇదేమిటి ఈ వేణు.. ఇప్పటికిప్పుడే మాట మారుస్తాడు. తనే కదా లీల గురించి కొంప లంటుకున్నట్లుగా మాట్లాడాడు.. మళ్లీ ఏమీ తెలియనట్లు అలా కంగారు పడతాడేంటి? సార్ వస్తున్నారని మాట మార్చాడా? ఏమిటో ఈ లీల గొడవ. చూడటానికి ఎంతో అందంగా ఉండే లీల బాగా చదువుకుంది కూడా. తల్లిదండ్రులు ముంబాయిలో ఉంటా రు. తాను సివిల్స్‌కి ప్రిపేరవుతూ ఇక్కడ అమ్మమ్మవాళ్లింట్లో ఉంది. ఈ ఉద్యోగం కొన్నాళ్లే చేస్తానని ముందే చెప్పింది. ఆమె టాలెంట్ చూసి కొన్నాళ్లైనా చాలని ఉద్యోగ మిచ్చేశారు. తన అభిప్రాయాలన్నీ చాలా నిర్మొహమాటంగా చెప్పేస్తుంది. అది చూసి ఆ అమ్మాయి చాలా ఫాస్ట్ అని ఆఫీసులో వాళ్లంతా లోలోన ఆరాధిస్తూనే పైకి మూతి విరుస్తుంటారు. ఇంతకీ లీల ఏం చేసి ఉంటుంది. ఈ అపర్ణను అడగాల్సిందే.

లేచి నిలబడి చూస్తే అపర్ణ సీటు దగ్గర నలుగురైదుగురు ఆమె చుట్టూ నిలబడి ఉన్నారు. సరే వాళ్లు వెళ్లిపోయాక మాట్లాడ దామని కూర్చుంది సుమిత్ర. ఆలోచనలు, పక్కన అపర్ణ బృందం మాటలు సుమిత్రను పనిలో నిమగ్నం కానీయలేదు.

'ఆ క్రిస్టియన్ వాడితో స్నేహం చేయడమే కాకుండా వాళ్లింటికి వెళ్తుంది. వాడి చెల్లెలు బాబ్డ్ హెయిర్ వేసుకుని షోగ్గా తిరుగుతూ ఉంటుంది కదా...'

'టైం సరిపోకపోవడమేంటి... ఇన్నాళ్లూ సరిపోయిన టైం ఇప్పుడెందుకు సరిపోవడం లేదు...రోజును ఇరవైనాలుగ్గంటలు కాకుండా ఇరవై గంటలకే కుదించేశారా ఏమిటి'

'మొన్న కూడా నాతో అంది. ఏదో సర దాగా అంటోందిలే అనుకున్నా కానీ ఇలా నిజంగా చేసేసి వస్తుందనుకోలేదు..'

తలా ఓ మాటా అంటున్నవాళ్లంతా అక స్మాత్తుగా నిశ్శబ్దమైపోయారు. ఏం జరి గిందా అని లేచి చూసిన సుమిత్రకు ఎప్ప టిలాగే నవ్వుతూ వస్తున్న లీల కనిపిం చింది. సుమిత్ర దృష్టి వెంటనే లీల మెడ మీదికి మళ్లింది. ఎప్పుడూ వేసుకునే సన్నని గొలుసు తప్ప మరేం లేవు.

'ఏంటి సుమిత్రా... నువ్వా ఇప్పుడు నాకు క్లాసు తీసుకుంటావా? పొద్దున్నుంచి వీళ్ల గొడవ భరించలేకపోతున్నాననుకో. నువ్వే చెప్పు. నాకీ పోనీటెయిల్ ఎంత బాగుందో.' అంటూ వెనుతిరిగి నిలబడింది లీల.

మోకాళ్ల వరకూ పొడుగ్గా నల్లగా తాచు పాములా ఇంత లావున ఉండే లీల జడ మాయమై ఆ స్థానంలో యు షేప్‌లో కత్తి రించిన పోనీటెయిల్ దర్శనమిచ్చింది. అది చూడగానే సుమిత్రకూ ఒక్కక్షణం ప్రాణం ఉసూరుమంది. అంతలోనే ఇందుగురించా పొద్దున్నుంచీ అందరూ మల్లగుల్లాలు పడు తున్నదీ... ఛీ..ఛీ.. తనెంతదూరం ఆలో చించింది.. తెల్లబడిన ముఖాన నవ్వు పులి మేసి లీలను అక్కున చేర్చుకుని 'నువ్వెలా ఉన్నా అందంగానే ఉంటావు లీలా..' అంటూ కవర్‌చేసుకుంది సుమిత్ర.

మిత్రబృందమంతా చుట్టూ చేరి కాసేపు బాధపడ్డా శిరోజాల సంరక్షణ ఎక్కువ సమయం తీసుకుంటూ పరీక్షలకు ప్రిపేరవ డానికి కష్టంగా ఉందన్న లీల వాదనను అర్థం చేసుకున్నారు. పరీక్ష పాసైతే చాలు.. ఆ తర్వాత జుట్టుదేముంది.. ఇట్టే పెరుగు తుంది.. అంటూ ఎవరి సీట్లలోకి వాళ్లు వెళ్లి పోయారు. ✦

కథ వెనుక కథ

లంచం విశ్వరూపాన్ని కళ్లకుకట్టిన

# కాలం తీరిన కొలువు


తురగా జానకిరాణి

'రచన నా ప్రధాన వ్యాపకం కాదు.. చేపకు ఈతలా చాలా సహజంగా వచ్చేసింది.. ఆ పరిస్థితులలాంటివి. తలుపుతెరిస్తే ఎదురుగా గ్రంథాలయం. ఇంట్లో పెద్ద రచయితలు. చలం, శ్రీశ్రీ, శాస్త్రిగార్లతో కలిసి బీచికి షికారు వెళ్లేదాన్ని. చిన్నపిల్లగా వారితో ఆడుకుంటూ, వారి మాటలు వింటూ పెరిగాను. ఒక్క మాటలో చెప్పాలంటే ఆ వాతావరణంలో పెరిగాక రాయక చస్తానా... అనుకుంటుంటాను ఇప్పుడు' అంటారు నవ్వుతూ తురగా జానకిరాణి.

పదిహేనేళ్లకే తొలికథ రాసిన జానకిరాణి ఆ తర్వాత అదో హాబీలా కొనసాగించారు. తెలుగుస్వతంత్ర, ఆంధ్ర పత్రిక, ప్రభ, యువ తదితర పత్రికలకు ఎన్నో కథలు రాశారు. చిన్న వయసులోనే ఎక్కువగా చదవడం, అన్ని రకాల సాహిత్యాలతో పరిచయం ఏర్పడడం తనకు లభించిన అపూర్వ అవకాశాలంటారామె. మచిలీపట్నంలో పుట్టిపెరిగిన జానకిరాణి ఎం.ఎ. ఎకనమిక్స్ చదివారు. మద్రాసు స్కూల్ ఆఫ్ సోషల్ వర్క్‌లో డిప్లొమా చేశారు. దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ మాటలకు ప్రభావితులై సాంఘిక సంక్షేమ శాఖలో అధికారిగా ఉద్యోగంలో చేరారు జానకిరాణి. ఉద్యోగంలో భాగంగా రాష్ట్రమంతా పర్యటించాల్సి వచ్చేది. ఆ పన్నెండేళ్లలో ఎదురైన ఎన్నో రకాల అనుభవాలు ఆమె కథలకు ముడిసరుకునిచ్చాయి.

రేడియోలో ఉద్యోగం, సంఘసేవ, రచనా వ్యాసంగం... ఇలా ముప్పేటగా సాగిన జీవితంలో ఒక రంగం తాలూకు అనుభవాలు మరొకదాన్ని సుసంపన్నం చేశాయనవచ్చు. రచయిత్రిగా తక్కువ సంఖ్యలో రాసినా వైవిధ్యమైన రచనలు చేశారు జానకిరాణి. కథలు, నాటకాలు, నవలలు, అనువాదాలు, పిల్లల పుస్తకాలు, రేడియో నాటికలు... ఇలా ఎన్నో రాశారామె.

**పడకకుర్చీ రచయిత్రి అనేవారు...**

'మాతరం వారిని పడకకుర్చీ రచయిత్రులనేవారు కదా... కాలక్షేపం కథలు రాసే వాళ్లమని పేరు. అవును మరి.. మా తరం వాళ్లెవరూ బడుగుజీవుల కథలు రాయలేదు. నేను చదువుకున్న దాన్ని. ఉద్యోగం చేసిన దాన్ని. అందులో కష్టనష్టాల గురించి, ఆ వర్గం ఎదుర్కొనే అనుభవాల గురించి నాకు తెలుసు కానీ కట్టెల పొయ్యి మీద వంట చేయడంలో కష్టం నాకెలా తెలుస్తుంది? అందుకే నాకు తెలిసిన జీవితం గురించి రాసే దాన్ని. నాకు తెలియని జీవితం గురించి రాయడానికి భయపడేదాన్ని. నా కథల్లో ఉన్నత, మధ్య తరగతులకు చెందిన

విద్యావంతులైన వారి విషయాలే, సమస్యలే ఉండేవి. అయితే బడుగు జీవుల గురించీ రాయగలనని చెప్పడానికే.. రక్తం, స్వేదం చిందించడం, కన్నీళ్లు.. వీటిగురించీ నాకు రాయవచ్చని చెప్పడానికే ఒక కథ రాశాను. అదొక సవాలుగా తీసుకునే 'కాలం తీరిన కొలువు' రాశాను. ఇండియా టుడే పత్రికలో ప్రచురితమైంది ఆ కథ. అవినీతి, లంచగొండితనం మన సమాజంలో అప్పుడూ ఇప్పుడూ ఎప్పుడూ ఉన్న సమస్యలు. వాటినే నేపథ్యంగా తీసుకుని రాశానా కథ.' అంటూ 'కాలం తీరిన కొలువు' కథ నేపథ్యం వివరించారు తురగా జానకిరాణి.

**అసలు కథ ఇదీ!**

భర్త దేశాల వెంట పోతే కొడుకునీ కూతుర్నీ ఏదో కాస్త చదివించేటప్పటికి కొమురమ్మ శక్తి సన్నగిల్లింది. కొడుకు ఏడో క్లాసు తప్పి ఏ పనిలో పెట్టినా దొంగతనాలు చేసి అల్లరి పాలయ్యేవాడు. పది పాసైన కూతురు లక్ష్మింబాయికి ఆస్పత్రిలో ఆయా కొలువిప్పిస్తానని రెండువేలరూపాయలు లంచం అడుగుతాడు ప్రభుత్వ అధికారి. పెట్టెలో అడుగున పడేసిన బంగారు గుళ్ల రెండు అమ్మేసి జీవితంలో మొదటిసారిగా రెండువేల రూపాయలను చూస్తారు తల్లీకూతుళ్లు. ఇంటిదగ్గర చీకటితోనే అందజేయమన్నాడని కొమురమ్మ ఎంతో భద్రంగా తీసుకెళ్లి అధికారికి ఇచ్చి వస్తుంది. అది ఉద్యోగానికి కూడా కాదు. ఎంప్లాయ్‌మెంట్ కార్డుతీసి ఇంటర్వ్యూ పిలుపు రావడానికే. కార్డు నంబరు ఆస్పత్రికి పంపడానికే. నాలుగేళ్లు ఆ ఆఫీసు చుట్టూ తిరిగిన కొమురమ్మకి ఆస్పత్రిలో ఆయా కొలువుందనీ. అయ్యకి డబ్బు ఇస్తే చాలనీ ఎవరో చెప్పారు... ధైర్యంగా ఆ పని చేసింది. చేసిన మర్నాటినుంచీ తల్లీ కూతుళ్లకు రానున్న కొలువు గురించి బాగుపడనున్న బతుకుల గురించి ఆశ. సంతోషం దాచుకోలేక పనిచేస్తున్న ఇంటి యజమానురాలితో పంచుకుంటారు. 'ఈ రోజుల్లో ఉద్యోగాలన్నీ మీకే కదా... అయినా లంచమిచ్చారా? లంచమివ్వడం తప్పుకాదూ... అయినా మీకూ రాక... మాకూ రాక ఈ ఉద్యోగాలన్నీ ఏమవుతున్నట్లు?' అంటూ ఆశ్చర్యపోతుంది ఆవిడ. ఇన్నాళ్లూ తల్లి పడ్డ కష్టాలు చూసిన లక్ష్మింబాయి తనకు ఉద్యోగం వచ్చాక తల్లికి విశ్రాంతి ఇవ్వాలనుకుంటుంది. మరోపక్క పిల్లల జైలునుంచి పారిపోయివచ్చిన కొడుకు రిజర్వేషన్లకై జరుగుతున్న ఆందోళనలో పాల్గొంటాడు. మనకెందుకురా ఈ గొడవలు.. అన్న అక్కతో ఇప్పుడిక కొలువులన్నీ మనకేనే.. మనిద్దరి పేర్లూ రాయించినా.. అని గర్వంగా చెప్తాడు. పదో తరగతి చదివిన అక్కకు పెద్ద ఉద్యోగమే వస్తుందని ఆనందంగా చెప్తాడు. అక్క అన్నం వండేవరకు ఆగలేక ప్రదర్శనకు అందరూ వెళ్లిపోతున్నారని జ్వరపడిన తల్లి కోసం తెచ్చిన బ్రెడ్డుముక్క తినేసి హడావుడిగా వెళ్లిపోతాడు యాదయ్య.

అధికారి చెప్పిన గడువు పూర్తయినా లక్ష్మింబాయికి ఇంటర్వ్యూ పిలుపు రాలేదు. చూసి చూసి కొమురమ్మ ఆయన్నే అడుగుదామని ఇంటికి వెళ్తే లేడు బయటకు వెళ్లిపోయాడంటారు. ఆఫీసుకు వెళ్తుంది. అక్కడ మెరుపులా మెరిసి మాయమయ్యే పెద్దాయనని ఆమె ఎట్టా పట్టుకుంటుంది? నీరసంగా ఆఫీసరుగారి కోసం వేచి వేచి ఉన్న కొమురమ్మకి టీకొట్టు వ్యక్తి మాటలకు పైప్రాణం పైనే పోతుంది. రెండువేలతో ఏ పనీ నడవదనీ, కొలువు ఆర్డర్లు ఇరవై ముప్పై వేలలో ఉన్నాయనీ చెప్తే గుడ్లు తేలేస్తుంది. చేసేది లేక కాళ్లీడ్చుకుంటూ ఇంటికి చేరిన కొమురమ్మకి విపరీతంగా జ్వరం వస్తుంది. యాదయ్య రాత్రయినా ఇంటికి రాడు. గొడవలు జరిగాయని,

బస్తీవాళ్ల పిల్లల్ని ఆస్పత్రిలో ఉంచారని తెలిసి చూసిరావడానికి వెళ్తుంది లక్ష్మిం బాయి. హక్కుల కోసం అరచి అరచి మూగబోయింది ఆ గొంతు. కడుపు నిండా అన్నం కావాలన్న వెర్రి ఆశతో నిండిన కళ్లు మూసుకుపోయాయి. బతుకంటే ఏమిటో అర్థం కాని లక్ష్మింబాయికి ఒక్కసారిగా చావంటే ఏమిటో తెలిసిపోయింది. ఓయమ్మో యాదయ్య సచ్చిపోయిండే.. అని ఆమె పెట్టిన శోకం బస్తీలోని కొమురమ్మ గుండెలో ప్రతిధ్వనించింది.

ఇలా కథని ముగించిన రచయిత్రి చివ రలో రాసిన వాక్యాలు పాఠకులను ఆలోచిం పచేస్తాయి. అవినీతి అన్నివర్గాలవారినీ ఇబ్బంది పెడుతోందన్న అర్థం వచ్చేలా ఆమె ఇలా అంటారు..

ఆశపడ్డ వారందరికీ ఉంటాయా కొలు వులు? అసలు ఎవరికున్నాయి. కింది మని షైనా, పై మనిషైనా ఈ పరిపాలనా మార ణయంత్రానికి ఒకటే. అక్షరం రానివాడైనా సర్వశాస్త్ర పారంగతుడైనా... ఏ కులమైనా, గోత్రమైనా ఎవరికీ దొరకవు కొలువులు. రూపాయల గలగల ఒక్కటే వినబడే చెవి టివారి చేతుల్లో చిక్కుకుని పోయాయి.

ఉద్యోగాలు కిందికి దిగిరాని గాలిపటాలు. లంచం అనే రెండక్షరాల బ్రహ్మారాక్షసత్వం విశ్వరూపమై జగమంతా నిండి ఉన్నప్పుడు నీకా నాకా అని పంపకాలు ఎందుకు? పంతాలు ఎందుకు? ... అంటూ ప్రశ్నిస్తారు రచయిత్రి.

ఈ కథకు వచ్చిన స్పందనపై జానకిరాణి ఇలా చెప్పారు..

'రాసి పన్నెండేళ్లయినా ఈ కథాంశం ఇప్పటికీ వర్తిస్తుంది. మీనుంచి ఇలాంటి కథ ఊహించలేదన్నారు చాలామంది. అందరూ బాగా రాశానన్నారు. అందుకు కారణం కథాంశమే. నిజానికి అవినీతి గురించి, లంచాల గురించి వినడమే కానీ అలాంటి సంఘటనలను ప్రత్యక్షంగా చూడ లేదు. మా పనిమనిషి చెప్పేది రైల్వే స్టేష నులో పోర్టరు లైసెన్సు బిళ్ల వేలల్లో అమ్ము కుంటారని. అలా అందరూ అనుకున్నవి విని రాయడమే. శ్రీశ్రీ చెప్పినట్లు నరజాతి చరిత్ర సమస్తం పరస్పర హననోద్యోగ మేగా.. లేకపోతే పిల్లల మధ్యాహ్న భోజనా నికి పంపిన బియ్యం, పనికి ఆహార పథకం కోసం పంపిన బియ్యం లారీలకు లారీలు దారి మళ్లించడం అంటే తోటిమనిషిని పీక్కుతినడమే కాదూ..' అంటూ తన కథాంశం ఇప్పటికీ ఎలా సమయోచితమో వివరించారు జానకిరాణి.

*–సేకరణ: పద్మశ్రీ యలమంచిలి*

**చతుర సమీక్ష** | జూలై 'చతుర' నవల సంసార సాగరాలు

**సమీక్షకుని పేరు:** ____________________

**చిరునామా:** ____________________

____________________

____________________




ఎన్నాళ్ళబట్టో విదేశాల్లో ఉండిపోయిన తమ్ముని రాక కోసం మందుల కొట్ట తను ఆతృతగా ఎదురుచూస్తున్నాడు. అతను చాలా అసహనంగా ఉన్నాడు. ఇంతలో టెస్ అనే ఎనిమిదేళ్ళ పిల్ల వచ్చింది. "ఏం కావాలి?" అని ప్రశ్నించాడతను. అందుకా పిల్ల దీనంగా "మా అన్నను బతికించుకోవడా నికి కాసింత అద్భుతం కావాలి!" అంది అమా యకంగా. మందుల కొట్టతనికి చిర్రెత్తుకొ చ్చింది. కానీ చిన్నపిల్ల కదా, కోపాన్ని తమా యించుకున్నాడు, "చూడు పాపా, నీకేం కావాలో సరిగ్గా చెప్పు" అంటూ విసుక్కు

# అదొక నిశ్చల ప్రవాహం



న్నాడు. "నిజంగానే నాకు కాసింత అద్భుతం కావాలి. ఏదో ఒక అద్భుతం జరిగితే తప్ప మా అన్న ఆండ్రూ బతక డని అమ్మా, నాన్న మాట్లాడుకుంటుం డగా నేను విన్నాను. నా దగ్గర అచ్చంగా ఒకే ఒక్క డాలరుంది. అది తీసుకుని అద్భుతాన్ని వ్వండి" అంది టెస్ మొండిగా. ఆ పాపకు ఏం చెప్పి పంపాలో తెలియక మందుల కొట్టతను బుర్రగోక్కున్నాడు. అప్పుడు అక్కడికొచ్చాడు అతని తమ్ముడు. ఖరీదైన బట్టలు ధరించిన అతను చాలా హుందాగా, అందంగా ఉన్నాడు. 'అద్భుతం' కావాలంటూ పాప పట్టు బట్టడాన్ని చూశాడతను, "నీకు ఎలాంటి అద్భుతం కావాలి?" అని అతను టెస్‌ను ప్రశ్నించాడు. "మా అన్నకు ఏదో పెద్ద జబ్బు చేసింది. మేముంటున్న ఇంటిని కూడా నాన్న అమ్మేశాడు. అమ్మా, నాన్న దగ్గర ఇప్పుడు చిల్లి గవ్వ లేదు. ఏదైనా అద్భుతం జరిగితే తప్ప మా అన్న బతకడని వాళ్ళు అనుకోవడం నేను విన్నాను. మా అన్నను బతికించే అద్భుతం కావాలి. నా దగ్గరున్న డాలరును తీసుకుని అద్భుతాన్ని వ్వండి" అంది టెస్ ఆశగా. మందుల కొట్టతని తమ్ముడు టెస్ నుంచి డాలర్ తీసుకుని, "మీ ఇల్లు చూపించు, మీ అన్నను చూస్తే కానీ అతనికి ఎలాంటి అద్భుతం పని చేస్తుందో చెప్పలేను" అన్నాడు. టెస్ తూనీగలా ఎగురుకుంటూ అతణ్ణి ఇంటికి తీసుకు వెళ్ళింది. అతను ఆండ్రూను చూసి, హుటాహుటాని ఆసుపత్రికి తరలించి ఆపరే షన్ చేశాడు. నిజానికి అతనొక పెద్ద డాక్టర్. ఆండ్రూ జబ్బు నయ మైంది.

"నిజంగా ఇదో అద్భు తం, ఈ ఆపరేషన్‌కు ఎంత ఖర్చవు తుందో ఏమోనని భయపడ్డాను.' అంటూ అమ్మా, నాన్నలు సంతోషిస్తుం డగా, టెస్ ముసిముసిగా నవ్వుకుంది. తన కెంతో ఇష్టమైన అన్నను బతికించుకోవడానికి అయిన ఖర్చు ఒక్క డాలర్ మాత్రమేనని ఆ పాపకు, డాక్టర్‌కు మాత్రమే తెలుసు. ఇది ఒకా నొక పాశ్చాత దేశంలో జరిగిన యధార్థగాథ. టెస్‌కు అన్న మీదున్న ప్రేమే ఒక్క డాలర్‌తో 'అద్భుతాన్ని' కొనవచ్చునన్న నమ్మకాన్ని కలిగిం చింది. ఆ నమ్మకమే నిజమైన 'అద్భుతం'. ప్రేమ నమ్మకాన్నివ్వాలి. ఆ నమ్మకం జీవి తాన్ని వెలిగించేదై ఉండాలి. జీవితం పట్లా, సమాజం పట్లా, మన పట్లా మనకొక పాజి టివ్ దృక్పథాన్ని పెంపొందించేందుకు అది సహకరించాలి, మన వివేచనను, కాన్వాసును విస్తృత పరచాలి.

* * *

నాకు తెలిసి ప్రపంచంలో ప్రేమ అనే పదా

నికి పట్టిన దుర్గతి ఇక దేనికీ పట్టలేదు. ప్రేమ అనే రెండక్షరాలు మన టాలీవుడ్, బాలీవుడ్ లతో పాటు మరికొన్ని చవకబారు పత్రికలకు నమ్మకమైన పెట్టుబడిగా మారిన విషాదాన్ని నిస్సిగ్గుగా అంగీకరించాలి. పసి పిల్లల నుంచి యుక్తవయస్కుల దాకా లైంగికార్షణే ప్రేమ అనే తప్పుడు అవగాహనను కలిగించడానికి ఇవి అవసరానికి మించి కృషి చేశాయి. కానీ ఈ రుగ్మతకు చికిత్స జరిపించి తీరాలన్న ఆవ గింజంత ఇంగితం కూడా సమాజానికి కరువైంది. ప్రేమలో లైంగిక ఆకర్షణకు ఉన్న పాత్ర చాలా పరిమితం. ప్రేమ గురించిన ప్రస్తావన వచ్చినప్పుడల్లా దానిని ఇద్దరు వ్యక్తుల మధ్య, స్త్రీ పురుషుల మధ్య వైయక్తిక సంబంధానికే పరిమితం చేసి మాట్లాడటం సాధారణంగా మనకు కనిపించేదే. లౌకిక సంబంధాల గురించి మాట్లాడకపోతే ఆధ్యాత్మిక సిద్ధాంత చర్చల్లోకి దాన్ని దించేస్తారు. నిజానికి 'శాశ్వత' ప్రాతిపదికన తత్త్వవేత్తలు చెప్పేదంతా ఈశ్వర ప్రేమకు సంబంధించిందే! ఇవాళ ఎంతో ప్రేమించి, గౌరవించే తండ్రి ఒక్క విల్లుతో 'విలన్'గా మారిపోవచ్చు. అందుకే అంతవరకు కుటుంబభారాన్ని పంచుకొన్న కొడుకు చేతిలోనే తల్లిదండ్రులు హతమవుతున్న విషాద సంఘటనలు ఇటీవలి కాలంలో ఎక్కువగా వింటున్నాం. స్త్రీ పురుషుల మధ్య ప్రేమకు కూడా సాధారణ జనజీవితంలో 'చట్ట పరమైన భద్రత' తప్పనిసరవుతోంది. భద్రత, అభద్రతల ప్రస్తావన వచ్చిన తరువాత ఆ సంబంధంలో అనురాగం ఇగిరిపోయి, బోలుగా మిగులుతుంది. ఈ కరి మింగిన వెలగపండు సంబంధాల నేపథ్యంలో ప్రేమ సాంద్రతను గుణించి, గుణించబూనుకోవడమంటే కొండను తవ్వి ఎలుకను పట్టడం లాంటిదే. ఇలాంటి సందర్భాలను దృష్టిలో ఉంచుకునే కాబోలు ఓషో లాంటి తత్త్వవేత్త కూడా 'ప్రేమకు కొలమానంగా శాశ్వతత్వాన్ని' ఆపాదించారు. 'ప్రేమ అశాశ్వతమైందని మనకు తెలుసు. దాని ఉనికి క్షణికమైంది. ఇవాళ అది ఒక చోట ఉంటే మరునాటికి అది అక్కడ ఉండకుండా పోవచ్చు. దీన్నిబట్టే ప్రేమ ఎంత అశాశ్వతమైందో మనకు తెలుస్తుంది. నిజానికి ఈ క్షణికమైన ప్రేమంతా ఆకర్షణే తప్ప వేరొకటి కాదు. శారీరక తృష్ణ, కామం లేదా ఒకానొక మానసిక అవసరం, లేదా ఒంటరితనమంటే భయం, లేదా ఏదో ఒక నిరంతర వ్యాపకాన్ని కలిగి ఉండడం లేదా మనలోపలి ఖాళీని దేనితోనో ఒక దానితో నింపే ప్రయత్నమే ఇదంతా! ఇలాంటివి ఎన్ని చేరినా అది ప్రేమ కాలేదు. అదే నిజమైన ప్రేమైతే అది శాశ్వతం కావాలి' అని ఓషో అన్నారు. ఇక్కడాయన క్షణికమైనవంటూ చెప్పిన విషయాలన్నీ ప్రాపంచిక, దైహిక ప్రయోజనాలతో కూడిన అంశాలేనన్నది మనం గ్రహించాలి. 'సాధారణ ప్రజలంటేనే భగవంతునికి చాలా ఇష్టం, అందుకే వారినే ఎక్కువగా సృష్టించాడు' అనే మాట ఎక్కడో చదివాను. అహంకారాలు, అపోహలు, బూటకపు డాంబికాల నుంచి మనిషి బయట పడినప్పుడే అతను సంపూర్ణ ఈశ్వర ప్రేమకు పాత్రుడవుతాడని ఓషో చెబుతారు. 'నేను మాట్లాడే ప్రేమ వ్యక్తిగత సంబంధాలకు సంబంధించినది కాదు, మన సంబంధాలన్నీ సంకుచితమైనవే. శాశ్వతమైన ప్రేమ ఇలాంటి సంబంధాలను సృష్టించదు. చెట్లతో, ఎండతో, కొండలతో, గాలితో, వెన్నెలతో, మట్టితో, ప్రాణులతో ఆ ప్రేమ సంబంధాన్ని కల్పిస్తుంది. ఈ సంబంధం ఇరవై నాలుగ్గంటలతో, ప్రతిరోజుతో బాంధవ్యాన్ని కలిగి ఉంటుంది. అనుబంధమనేది ఒక నది లాంటిది. అది ప్రవహిస్తూ ఉండాలి, సంబంధం అనేది రొచ్చు గుంటలాంటిది. అది కదలదు. అందులో జీవం ఉండదంటారు ఓషో.

* * *

మనసు మయసభలో దుర్యోధనుడి లాంటిది. అహమనే బూతద్దం వెనుక నుంచి చూసే మనసు ప్రతిదానినీ తన కోణం నుంచే స్వీకరిస్తుంది. ప్రతిదీ తనకోసమేననుకుం

టుంది. అందుకే వ్యక్తిగత సంబంధాల్లో అడుగడుగునా హద్దులు, ఆంక్షలు పడగవిప్పుతుంటాయి. దీంతో సహజీవనాన్ని సజీవంగా ఉంచే 'స్వేచ్ఛ' హరించుకు పోయి, సంకుచిత పరిధిలో మనిషి ఇరుక్కుపోతాడు. ఈ ముళ్ళ కంచెల మనసు మీద సమాజం, వ్యవస్థ తమ ప్రభావాన్ని చూపుతాయి. మనిషంటే ఖేదం మోదం, మనిషంటే అందం, అనాకారితనం, మనిషంటే మంచీ చెడూ, మనిషంటే వలపు వెగటు, మనిషంటే రాజు, మనిషంటే పేద, మనిషంటే ఆరోగ్యం, మనిషంటే అనారోగ్యం వెరసి మనిషంటే మానవత్వం. వీటిలో ఒకటి లేకుండా ఇంకొకటి లేదు. జీవితపు ప్రవాహ గుణాన్ని అర్థం చేసుకున్నవాడు బలాన్ని భుజం తట్టి ప్రోత్సహించినట్లే, బలహీనతకూ ఓదార్పవుతాడు. మిట్టపల్లాలను సమంగా స్వీకరించే మానసిక పరిపక్వతను ఈ సమాజం ఎంతమేరకు అందిస్తోందన్నది ఎవరికి వారు వేసుకోవలసిన ప్రశ్న. సాధారణ సంబంధాలు, సంభాషణల్లో ఎంత వ్యంగ్యంగా (అవసరం ఉండనీ, ఉండకపోనీ ఎదుటివారిని కించపరిచేలా) మాట్లాడగలగడం ఇవాల్టి మేధోలక్షణంగా పరిఢవిల్లుతోంది. సాధారణంగా, అనునయంగా వినిపించే మాటలే కరువయ్యాయి. కాసింత వ్యంగ్యం చిలకరించకపోతే మనం మూర్ఖులం, అవివేకులం అవుతాము. పండు పక్వానికొచ్చే కొద్దీ దాని రంగు పేలవంగా మారుతుంది. బయటి రంగును చూసి దాని మాధుర్యాన్ని కాదనగలమా? ఎలాంటి భేషజాలు లేకుండా సాదాసీదాగా వ్యవహరించగలిగిన వ్యక్తి మనసు ప్రేమ మాధుర్యంతో పండిన ఫలంలాంటిదే. కానీ ఇప్పుడీ మాధుర్యం రుచి ఎంతమందికి తెలుసు?

ఈర్ష్య, మాత్సర్యం, సంకుచితత్వం వంటి బాలారిష్టాలను దాటని మనిషి 'ప్రేమ' అనే పారమ్యాన్ని ఏనాటికి తాకాలి? నిజంగా మనం ప్రేమించగలమా? మనకు ప్రేమించడం చేతనవుతుందా? మానవ, వ్యక్తిగత సంబంధాల్లో 'భద్రత' ఒక తోసిపుచ్చలేని అవసరమై కూర్చుంటుంది. ఇది విషాదానికి, బాధకు తొలిపాదుగా మారుతుంది. నిజమైన ప్రేమకు తెరలు పొరలు అవసరంలేదని అర్థం. ప్రేమ గురించి నిజమైన అవగాహన లేకపోవడం వల్లే ఇటీవలి కాలంలో అనేక ప్రేమ కథలకు మనోహర్‌లు హీరోలవుతున్నారు. ఎన్నో దాంపత్య జీవితాలు హింసాత్మకం అవుతున్నాయి.

ప్రేమ సకల మనవాళి బాధను మాన్పే భిషక్కు. మనకు ఆనందాన్నిచ్చే ఇష్టాలన్నీ ప్రేమే అయితే ఈ ప్రపంచంలో బాధన్న మాటే ఉండకూడదు కదా? ! అలాంటిదేదీ జరగడం లేదు కాబట్టి జిడ్డు కృష్ణమూర్తి మాటలతో ఏకీభవించాలి. కృష్ణమూర్తి మరో ఆసక్తికరమైన ప్రశ్నే వేస్తారు. అదేమిటంటే ప్రేమలో అపవిత్ర ప్రేమ, పవిత్ర ప్రేమ అంటూ ఉంటాయా? (ఈ ప్రశ్నకు సినిమా వాళ్ళే జవాబు చెప్పాలి) లైంగిత్వాన్ని అవసరాన్ని తోసిరాజని ముక్కు మూసుకుని జపతపాలతో చేసే భగవదారాధన పవిత్ర ప్రేమకు చిహ్నమని విజ్ఞులు అనాదిగా ఘోషించడం మనకు తెలుసు. లైంగిక వాంఛ ప్రేమను మలిన పరుస్తుందా, అమలిన శృంగారంలో సారమెంత అనే ప్రశ్నలన్నీ ప్రేమపై మనకున్న అభిప్రాయాల్లోని సందిగ్ధాల సారాంశమేనన్నది ఆయన అభిప్రాయం. నిజానికి ప్రేమ రెండక్షరాలకు పరిమితమైన విషయమా, లేదా ఏక వాక్య అర్థంతో నిర్వచించగలిగిన విషయమా? ప్రేమను నిర్వచించగల మనో నిఘంటువు ఏదైనా ఉందా? ప్రేమ అంచెలంచెలుగా, ఎవరికి వారు కంచెలకతీతంగా తెలుసుకోదగిన అనుభవ సారమనుకుంటున్నాను. నామటుకు నాకు అదొక తురీయావస్థ. కలలు, కలతలు దాటి మనసు నిశ్చలంగా ప్రవహించే తురీయావస్థ. అందుకనేమో ఆందోళన, భయం, అసూయ, అపరాధ భావనకు అతీతమైన మానసిక స్థితిలోనే ప్రేమ సాధ్యమంటారు జిడ్డు కృష్ణమూర్తి.

- పసుపులేటి గీత

నాటి చతుర




నాటి నవల

ఫ్లాష్‌బ్యాక్

# కుక్కలు

కమలాదాస్

జూలై 1979, సంపుటి: 2 సంచిక: 6

ఇది కాలాన్ని నెమరు వేసుకునే శీర్షిక. పాఠకుల కోసం చతుర తొలినాళ్ళను పరిచయం చేసే శీర్షిక. కాలగమనంలో మొన్న నిన్నటి పొరల్లో ఒదిగిపోయిన నవలాహారాల్ని ఒక్కటొక్కటిగా ఇతివృత్తం, కథనం వగైరా అంశాలతో రేఖా మాత్రంగా పరిచయం చేయడం ఈ శీర్షిక లక్ష్యం. గతంలో ఏ నెలలో ప్రచురించిన నవలను అదే నెలలో పరిచయం చేయడం జరుగుతుంది. 1979వ సంవత్సరం జూలై నెల **చతురలో** ప్రచురించిన కమలాదాస్ నవల **'కుక్కలు'** పరిచయాన్ని ఈ సంచికలో ఇస్తున్నాం.

రాజకీయాలలో ఉన్నంత అవినీతి మరే రంగంలోనూ ఉండదని అందరికీ తెలుసు. తమ స్వార్థాలకోసం, పలుకుబడికోసం, ఆస్తిని ఇబ్బడిముబ్బడిగా పెంచుకోవటం కోసం ఎన్ని దారుణాలకైనా నాయకులు దిగజారుతుంటారు. ఓట్ల కోసం నోట్లు విరజిమ్ముతారు. మద్యం ఏరులు ప్రవహింప చేస్తారు. ఎలాగైతేనేం ఎన్నికలలో నెగ్గి ఎత్తులకు పైఎత్తులు వేసి ప్రత్యర్థులను చిత్తు చేస్తుంటారు. మద్యం, మగువలపై వ్యామోహాలు పదవీదాహాలు ముసలి మంత్రులను సైతం వదలకపోవటం ఈ రంగంలోని ప్రత్యేకత. రాజకీయాల రొచ్చులోకి రచయితలు, రచయిత్రులు దిగితే ఎలా ఉంటుంది? వారుసైతం విలువలకు తిలోదకాలిస్తారా? నీతిగా ఉంటారా? అంటే సంశయమే!

ఓ సుప్రసిద్ధ రచయిత్రికి పెళ్ళీడు కూతురున్నా ఆమెలో అందం, ఆకర్షణ సడలదు. చీకూచింతా లేని జీవితం గడుపుతుండగా పాత మిత్రుడు ప్రవేశించి ఆమె జీవిత గమనాన్ని మరోవైపు తిప్పుతాడు. ఆమె ఆకర్షణకు లోనై ఉన్నత పదవులు సునాయాసంగా వరిస్తాయి. ఆ నవజీవనంలో ఆమెకు ఎదురైన వ్యక్తులు మహోన్నత స్థానాలలోని మహామహులు కుక్కల వలె ప్రవర్తించటం ఈ నవలలో చూస్తాం.

**ఇతివృత్తం:** ఈ నవలలోని నాయిక మానసి. ఆమె భర్త అమోల్ మిత్రా ఆమె కంటే వయసులో చాలా పెద్దవాడు. ఆమె కాలేజీ రోజుల్లో ఓ యువకుడితో ప్రేమ వ్యవహారం నడిపి గర్భవతవుతుంది. పెళ్ళి చేసుకుందామనుకునేసరికి ఆ యువకుడు విమాన ప్రమాదంలో చనిపోతాడు. ఆ ప్రేమ అంతటితో ముగుస్తుంది. కానీ ఆ యువకుని తమ్ముడు విజయ్ సైతం మానసి వైపు ఆకర్షితుడవుతాడు. అమోల్ మిత్రాకు ఆమె సంగతి తెలిసినా పెళ్ళాడతాడు. ఆమెకు పుట్టిన సుపర్ణకు ఈ జన్మరహస్యం తెలియనివ్వరు. మిత్రా

తన భార్యా బిడల్ని ఎంతో ప్రేమగా చూసుకుంటున్నా, ఆమెను ఏదో అసంతృప్తి వెన్నాడుతుంటుంది. అయినా ఆమె నీతి తప్పదు. న్యాయంగా భర్త సంపాదించిన దానితోనే గుట్టుగా కాపురం చేస్తుంటుంది. అలాంటి సమయంలో ఓ సారి విజయ్ ఆమె ఇంటికి వస్తాడు. అప్పటికి అతడికి ముప్పై నాలుగేండ్లుండగా మానసికి నలభై ఏళ్ళుంటాయి. మానసి కూతురు సుపర్ణకు పంథొమ్మిదేళ్ళు. ఆమె భర్తను వదిలివస్తే తను పువ్వుల్లో పెట్టి పూజించుకుంటానను కుంటాడు. ఆమె నిప్పుకణిక. దుర్మార్గులను దగ్ధం చేయగలదు. ఆమె రాసిన పుస్తకాన్ని చదివిన విజయ్‌ను ఆమె నిర్మలత్వం ముగ్ధుణ్ణి చేస్తుంది. తన అధికార వ్యామోహాన్ని బాధ్యతా రాహిత్యాన్ని, వేలెత్తి చూపినట్లనిపిస్తుంది. మంత్రి పదవికోసం తన ప్రయత్నాలు గుర్తొస్తాయి.

అతని కోసం మానసి టీ తెస్తుంది. ఆమె చేయి పట్టుకోబోతాడు. ఆమె విడిపించుకుని వంటింట్లోకి వెళ్ళి పోతుంది. అతడు నిష్క్రమిస్తాడు.

"మన పెళ్ళైన ఇరవయ్యేళ్ళలో ఏం ఒరగబెట్టారు? తిండి, గుడ్డ తప్ప ఓ నగో నట్రో చేయిద్దామనే ఆలోచన ఉందా? మీకు స్త్రీ మనస్తత్వం అర్థం కాదు" అంటుంది భర్తతో.

"నీవు ఇన్నేళ్ళూ ఆదర్శవాదివి, నీకు ఆడంబరాలు గిట్టవు. నా జీతం డబ్బు జీవితావసరాలకే సరిపోవటం లేదు. నీకు తెలుసు" అంటాడు మిత్రా.

మర్నాటి ఉదయం పేపర్‌లో విజయ్‌కు కేంద్రమంత్రి వర్గంలో ఇనుము, ఉక్కు మంత్రిత్వ శాఖ అప్పగించారన్న వార్త వస్తుంది.

"నీ బాల్య స్నేహితుడు ఓ పెద్ద మంత్రి అయ్యాడు. చూడు" అంటాడతడు. "అంటే నేను ఢిల్లీ వెళ్ళి వాళ్ళనీ, వీళ్ళనీ ప్రాధేయపడి పనులు చేసుకువచ్చే మనిషిననా మీ అభిప్రా యం? " అని అతనివైపు కోపంగా చూస్తుందామె.

'విజయ్ పట్ల నేనేం ఆకర్షితురాలవటం లేదు' అనుకుంటుంది మానసి స్వగతంగా. అతను అవినీతి పరుడని, నయవంచకుడని అందరికీ తెలుసు. అలాంటి మనుషులంటే మానసికి పరమ అసహ్యం. ఇటీవలే బెంగాలీ భాషలో వెలువడిన ఆమె కవితా సంకలనానికి ఉత్తమ సాహితీ అవార్డు రావటంతో తత్సంబంధిత సభలో పాల్గొనడానికి ఢిల్లీకి రమ్మని ఆహ్వానం అందుతుందామెకు. అమెరికా రాయబారాల గురించి, మానసి గురించి, ఆమె రాసే విప్లవ కవిత్వం గురించి, బెంగాల్ విద్యార్థులు ఆమెను ఆరాధించిన వైనం గురించి ప్రధాని విజయ్‌తో చర్చిస్తాడు.

మానసి దగ్గరికి కృష్ణన్ అనే వ్యక్తి వస్తాడు. ఓ వారం రోజుల పాటు ఆమె విజయ్‌తో సిమ్లాలో గడిపితే ప్రతిఫలంగా ఆమెకు అతడు వజ్రాలు పొదిగిన చెవి రింగుల జత ఇస్తానని విజయ్ అతనితో కబురంపుతాడు. కృష్ణన్‌ను బయటకు విసిరెయ్యాలన్నంత కోపం వస్తుంది మానసికి. "వీడో తార్పుడుగాడిలా ఉన్నాడే" అనుకుంటుంది. కానీ తన చిరకాల వాంఛ, కల వజ్రాలు పొదిగిన వేలాడే రింగులు గుర్తొస్తాయి. ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోకుంటే ఆ కోరిక తీరకుండానే చనిపోతుందేమోననిపిస్తుంది. చాలా సేపు ఆలోచించి తను వస్తాననీ, ఢిల్లీకి సాహిత్య అవార్డు తీసుకోవడానికి వచ్చినప్పుడు సిమ్లాకు వచ్చి అతనితో వారం రోజులు గడుపుతాననీ చెప్పమని" కృష్ణన్‌ను పంపిస్తుంది. అన్నప్రకారమే ఢిల్లీ సభ ముగిశాక విమానంలో సిమ్లాకు వెళ్ళి విజయ్‌తో హోటల్ గదిలో గడుపుతుంది. "నా మీద అధికారం చలాయించాలని కలలో కూడా అనుకోకు. నాచిరకాల వాంఛితం నెరవేర్చుకోవడానికి వచ్చాను. నా ఆశే నీకు లోబడేలా చేసింది. అంత మాత్రాన నేను నీకు దాసానుదాసురాలినైపోతానని భ్రమపడకు. నా పాతివ్రత్యాన్ని నీకు అమ్మేశాను. చెడిపోయాను. అంతే కానీ నా ప్రవర్తనపై నీకేం అధికారం లేదు" అంటుంది. ఆ తరువాత అమె, "నేనింత వరకు ఏ మగాణ్ణీ కామించనంత ఎక్కువగా నువ్వు కావాలని కోరుకుంటున్నాను. మన ఈ వ్యాపా

రంలో నీ కంటే ఎక్కువ ఆనందం, తృప్తి నేనే సొంతం చేసుకుంటున్నాను" అంటుంది.

ఢిల్లీలోని ఓ స్నేహితుడికి ఫోన్ చేసిన విజయ్ ఉల్లాసం ఎగిరిపోతుంది. ప్రధాన మంత్రి మానసిని తన ఇంటికి తీసుకురమ్మని చెప్పారని అతడు చెబుతాడు. సమాచార పౌర సంబంధాల శాఖ మంత్రి ఇచ్చిన విందులో మానసిని చూశాక ప్రధాని మనసులో ఏదో పురుగు ప్రవేశించిందని విజయ్ రూఢి పరచుకుంటాడు. మానసికి ఓ పదవి ఇచ్చి ఆమెను ఢిల్లీలోనే ఉండిపోయేలా చూడమని కూడా ప్రధాని అతనితో చెబుతాడు. "మానసి పదవు




లకోసం పాకులాడదు. ఈ కబురు చెబితే ఎలా గంతులు వేస్తుందో" అని విజయ్ కంగారు పడతాడు. కానీ మానసి "విజయ్! ప్రధాని నన్ను ఏం చేయమన్నా చేస్తాను. ఇప్పుడె లాగూ నేను పతివ్రతను కాను. ఓ జత వజ్రాల రింగులకోసం వారం రోజులపాటు ఈ శరీరాన్ని నీకు అద్దెకిచ్చాను. ఇక నుంచి పదవి కోసం పలుకుబడిగల వారికి మాత్రమే మానసి దేహం దొరుకుతుంది" అని నవ్వుతుంది.

"మానసీ! నన్ను పెళ్ళి చేసుకో! ఆ రకంగా నా పాపాలు ప్రక్షాళనమవుతాయి. ఎవరికీ తెలియని చోటికి పోదాం. ఇక రాజకీయాలలోకి వెళ్ళను" అంటాడు విజయ్.

"నేను వివాహితను. నా భర్త అమోల్ మిత్రా" అంటుంది మానసి.

తనని ప్రధానమంత్రి మంత్రిగా నియమించ నిశ్చయించారని మానసి భర్తతో చెబుతుంది. అతడు స్తబ్ధుగా ఉండిపోతాడు. వేసవి సెలవులలో వాళ్ళ కూతురు సుపర్ణ వస్తుంది. తల్లీ, తండ్రీ ఎవరి పనులలో వాళ్ళుంటే పొరుగింట్లో ఉండే చిన్ననాటి స్నేహితుడు సైరస్‌తో కబుర్లు చెబుతూ కాలక్షేపం చేస్తుంది సుపర్ణ. సుపర్ణను వేరే ఊళ్ళో హాస్టల్‌లో ఉంచి చదివిస్తుంటారు. కూతురి పుట్టిన రోజును పురస్కరించుకుని బహుమతిగా చీర పంపిస్తుంది మానసి విజయ్‌తో. అలా సుపర్ణను చూసిన విజయ్ ఆమెను మోహిస్తాడు. సుపర్ణ మానసి కూతురనీ, తనకూ కూతురిలాంటిదేనని తెలిసినా సుపర్ణను ఆకర్షించి ఆమెను అనుభవిస్తాడు. ప్రధానికి అత్యంత ఇష్టురాలిగా, అంతరంగికురాలిగా ఉండటం మొదలు పెడుతుంది మానసి.

ప్రధాని ప్రతి చిన్నపనికి విజయ్‌పై ఆధారపడుతుంటాడు. "ఎన్నికలు దగ్గర్లోనే ఉన్నాయి. విజయం మళ్లీ మననే వరించాలి" అంటాడు. ప్రభుత్వ వైఫల్యాల మీంచి ప్రజల దృష్టి మళ్ళించాలంటే దేశంలో ఏదైనా ప్రళయం సంభవించాలి. కనీసం యుద్ధం వచ్చినా చాలు అనుకుంటారు.

సుపర్ణ వస్తోందని సైరస్ స్టేషన్‌కు వెళ్తాడు. ఆమె రైలు దిగకుండా సీట్లోనే ఏడుస్తూ కూర్చుంటుంది. ఆమె శరీరంపై పంటిగాట్లు చూసి జరిగింది ఊహిస్తాడు సైరస్. "విజయ్ కదూ" అని అడుగుతాడు. "అవును" అని ఏడుస్తుంది సుపర్ణ. "అయితే ఈ విషయం మీ అమ్మకు చెప్పాలి. మీ అమ్మకూ, అతనికీ మధ్య సంబంధం ఉందని అందరూ అంటారు" అన్నాడు సైరస్. తల్లి విజయ్‌తో ప్రేమలో పడిందనీ, అతడూ ఆమెను తలమునకలుగా ప్రేమించాడనీ సుపర్ణకు తెలుసు.

సుపర్ణను ఇంటి వద్ద దిగబెట్టి సైరస్ వెళ్ళిపోతాడు. ఆనాటి మధ్యాహ్నం విజయ్ వస్తాడు. "నేను చేసిన వెధవపని గురించి మీ

అమ్మ, నాన్నలతో చెప్పాలని వచ్చావేమోనని కంగారుపడి వెంటనే వచ్చేశాను" అంటాడు.

"ఇంకా చెప్పలేదు. మమ్మీ ఢిల్లీలో మెక్సికో వెళ్ళే ప్రయత్నాల్లో ఉంది. డాడీ ఇంకా ఆఫీసు నుండి రాలేదు" అంటుంది సుపర్ణ. "మై డార్లింగ్! నువ్వు లేకుండా బతకలేను. ఈక్షణం లోనే నువ్వు నాతో వచ్చెయ్యి. పెళ్ళి చేసుకుందా"మంటాడు విజయ్. తల్లి ప్రియుడే అయినా సుపర్ణకు ఆ పట్టింపేమీ ఉండదు. పతనమైపోవడానికి సిద్ధ పడుతుంది. సిమ్లాకు అతనితో వెళ్తుంది. మూడు రోజుల తరువాత విజయ్ ఢిల్లీకి వస్తాడు. ప్రధానిని కలుసుకుంటాడు. వాదోపవాదాలు జరుగుతాయి.

"మానసికి హోం శాఖ ఇవ్వొచ్చేమో" అంటాడు ప్రధాని చివరగా.

"అది మీ ఇష్టం" అంటాడు విజయ్ అసహనంగా.

"మానసికి మీ పెళ్ళి గురించి తెలుసా" అడుగుతాడు ప్రధాని.

"మానసి మెక్సికో నుంచి వచ్చాక చెబుతాం. నేను అల్లుడిని కావటం మానసికి ఇష్టం ఉండదేమో" అంటాడు విజయ్.

"నేను ఒప్పిస్తాలే" అని భరోసా ఇస్తాడు ప్రధాని.

"మానసి విజయ్‌తో మాట్లాడే అవకాశాన్ని సృష్టించుకుంటుంది. "నువ్వు నా కూతుర్ని పెళ్ళి చేసుకోలేవు. ప్రధాని కోసం పన్నాగాలు పన్నావు. మేమిద్దరం నీ చేతిలో కీలుబొమ్మల మయ్యాం. నీ లక్ష్యంకోసం నన్నుఎరగా ఉపయోగించుకున్నావు. ప్రధానికి నన్ను తార్చావు. విజయ్! నన్ను పతనం చేసింది నువ్వు కాదూ" అని ఉద్వేగంతో అడుగుతుంది మానసి.

"నువ్వెక్కడ పతనమయ్యావు? ఈ దేశానికి కొత్త హోం మంత్రివి. అతి భయంకరమైన ఆడదానివి. ప్రధానిని ఆట బొమ్మను చేశావు. నువ్వు కళ్లెం వేయని గుర్రానివి" అంటాడు విజయ్.

"సుపర్ణ మీ అన్నయ్య కూతురు. దానిని చెరచడానికి నీకు మనసెలా ఒప్పింది? నువ్వు పెళ్ళి చేసుకోకూడదు" అంటుంది మానసి.

"ఈ విషయం ముందే ఎందుకు చెప్పలేదు? మేం ప్రేమించుకున్నాం. మాకు ఓ వారసుడు పుట్టబోతున్నాడు" అంటాడు విజయ్.

"వీల్లేదు. అబార్షన్ చేయిస్తా"నని బయల్దేరుతుంది మానసి. అందుకు విజయ్ అంగీకరిస్తాడు.

సుపర్ణని హాస్టల్ నుంచి రప్పిస్తుంది.

"విజయ్ వారసుడికి జన్మనిస్తా. అతడు నాకు పినతండ్రయినా సరే! ఆఖరికి నా సొంత తండ్రి అయినా పట్టింపు లేదు" అని వాదిస్తుంది సుపర్ణ.

"విజయ్ కూడా అలాగే చెప్పాడు బచ్చా" అంటాడు అమోల్ మిత్రా.

ఆ మాటవిని "ఛీ అలా అన్నాడా? ఇకనేను అతని ఊసే ఎత్తను"అంటుంది సుపర్ణ.

ఆ తరువాత సుపర్ణ, సైరస్‌ను పెళ్ళి చేసుకుంటుంది. సుపర్ణ సంగతి తెలిసినా ఆ బిడ్డకు తనే తండ్రినవుతానని ధైర్యం చెబుతాడు సైరస్. సుపర్ణకు అండగా నిలబడతాడు.

ప్రధానికి పక్షవాతం వచ్చి మాటపడిపోగా ఆస్పత్రిలో చేరుస్తారు. మానసికి మాత్రమే ప్రధాని కావలసిన అర్హతలున్నాయని పార్టీ ప్రముఖులు ఉమ్మడిగా ఆమెపేరు ప్రతిపాదిస్తారు. తను ప్రధాని కావటం మానసి చిరకాల స్వప్నం. అది నిజం కాబోతోందని తెలిసి తను ప్రధాని అయ్యాక తమ ఇంటి కిటికీ తెరలకు బెల్జియం నుంచి పట్టు జలతారు తెరలు తెప్పించాలి అని ఆలోచిస్తుంది. మానసి.

రాజకీయాల్లో రాణించటం కోసం పదవుల కోసం, డబ్బు కోసం నాయకులు కుక్కల కంటే అధ్వాన్నంగా ప్రవర్తిస్తుంటారనే వాస్తవం చెబుతూ తుచ్ఛ రాజకీయాలకు దర్పణం పడుతుందీ నవల. ఇర్వై ఏడేళ్ళ కిందటైనా పాతికేళ్ళ క్రితమైనా, పదేళ్ళ క్రితమైనా, ఈ నాటికైనా నూటికి తొంభైమంది పై నవలలోలాంటి వ్యక్తులే దేశవ్యాప్తంగా కనిపిస్తుంటారనేది వాస్తవం. ✦




## ఆ తారకే అసలైన విజేత!

(మొదటి బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)

సాహితీ వినీలాకాశంలో ప్రభవించిన కొద్ది కాలంలోనే దేదీప్యమానంగా వెలుగొందుతూ 'ఎవరీ తారక' అని పాఠకలోకం సంభ్రమంగా చూస్తుండగా అల్లంతలోనే కనిపించని తీరాలకు కదలిపోయిన రచయిత్రి పద్మసుందరిగారికి ఇదే మా కన్నీటి నివాళి. నిజానికి చతుర పాఠకుల మానసాన్ని చూరగొన్న పద్మసుందరి గారే అసలైన విజేత.

స్త్రీ పూవులాంటి సౌకుమార్యం మాటునే వజ్రంలాంటి సంకల్పమూ దాగుంటుందని దాక్షిణ్య పాత్ర ద్వారా నిరూపించారు. కథ ఎప్పుడో చూసిన సినిమాలా అనిపించినా కథనంలో బిగి, పాత్రోచితమైన సంభాషణలు, పాత్ర చిత్రణా 'విజేత'ను మంచి నవలగా నిలబెట్టాయి. భీమేష్, తనను పెళ్లికి ఒప్పించే ప్రయత్నం చేస్తున్న సందర్భంలో చిన్ననాడే తన మెడలో గుదిబండలా పడ్డ తాళిని చూపిస్తూ దానికి కట్టుబడినట్లు దాక్షిణ్య చెప్పడం పాత్రోచితంగా లేదు. వివాహ బంధం పరమార్థాన్నే విస్మరించి, అందినంత దోచుకొని తన కుటుంబాన్ని అధోగతిపాలు చేసిన సదరు పెళ్ళి తాలూకు తాళికి విలువనాపాదించడం అంటే అభ్యుదయానికి, సాంప్రదాయానికి మధ్య నలిగిపోతున్న నేటి మహిళ అంతరంగాన్ని ఆవిష్కరించటమే. చిన్ననాడు తాళికట్టిన భీమేశ్వరరావే నేడు ప్రేమించిన భీమేష్ కావటం కూడా సాంప్రదాయపు సర్దుబాటే. వైదేహి మొదటి పెళ్ళి ద్వారా పుట్టిన బాబు విషయాన్ని ఎక్కువగా ప్రస్తావించకుండా వైదేహిని భాస్కరంతో సులభంగా ముడిపెట్టేశారు రచయిత్రి. అంతటి అభ్యుదయానికి మరో పార్శ్వంగా తాళి అనే తాడు కట్టించుకున్న పాపానికి ఆ కట్టినవాడు కనబడేంతవరకు మోడులా మిగిలిపోవటానికి సిద్ధపడిన దాక్షిణ్య పాఠకుల్లో కొంత అయోమయాన్నే సృష్టించింది.

ఇంటిలిజెన్స్ వ్యవస్థ పనితీరును ప్రస్తుతిస్తూ దాని ఔన్నత్యాన్ని నిరూపించే ప్రయత్నం చేయడం బాగుంది. స్నేహానికి ప్రతీకలుగా గీత, శ్రీకాంత్ పాత్రలను చక్కగా మలచారు.

– ఎన్.యాదవ్, నరసారావు పేట.

## వివాహ చట్రం (రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)

విరిసీవిరియని లేతవయసులో ఆడపిల్లని వివాహ చట్రంలో బిగిస్తే ఆనక ఎన్ని సమస్యలు ఎదుర్కోవలసి వస్తుందో తెలియచెప్పాలన్న తాపత్రయమే ఈ కథ ముఖ్యోద్దేశం.

చదువుసంధ్యావున్న ఆడపిల్ల కావడంతో ఎన్ని ఒడిదుడుకులెదురైనా అధిగమించి ఆత్మస్థైర్యంతో ముందుకు దూసుకుపోయింది. సమాజంలో తనకంటూ ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకుంది. బాధ్యతలు మోయాల్సిన మగదిక్కు మూలనపడ్డా బెదిరిపోక, తనను తాను ప్రోత్సహించుకుంటూ, కష్టాలలో ఊరడించుకుంటూ కుటుంబాన్ని ఒక కొలిక్కి తీసుకొచ్చిన సమర్థనీయురాలు దాక్షిణ్య. తనతో పాటు మరో నలుగురికి బతుకుదారి చూపి, వ్యాపారాన్ని అంచెలంచెలుగా ఎదిగేలా చేసింది. ఆడపిల్ల ఒంటరిగానైనా బతగ్గలదని

నిరూపించింది. చదువుగాని, మరేయితర ఆధారం లేని వైదేహి జీవితం బాల్యవివాహంతో చాలా నష్టపోయింది. పెళ్ళయిన వారానికే భర్తపోవటం, తర్వాత ఓ బిడ్డకు తల్లి కావటం, కోరికల్ని చంపుకోవటానికి చప్పిడి కూడు తినటం, ఇవన్నీ బాల్యవివాహం వల్ల వచ్చిన అనర్థాలే. అదే చదువుకుని వుంటే దాక్షిణ్యలా తనూ ధైర్యంగా బ్రతగ్గలిగేది.

బాల్యంలో దంపతులైన భీమేష్, దాక్షిణ్యలను తిరిగి కలపటంలో రచయిత్రి కృతకృత్యులయ్యారు. మత సామరస్య విషయంలోనూ రచయిత్రి విశాలహృదయం కనబరిచారు. ఆమె ఏ లోకంలో వున్నా ఆమె ఆశయాలను, సందేశాలను మనం గౌరవించాలి. ఎంతో మంచి భవిష్యత్తు ఉన్న ఆమె చిన్నవయసులోనే అకాలమరణం చెందటం దురదృష్టకరం. ఉన్నత శిఖరాలకు అతి సమీపంగా వచ్చి అంతలోనే అదృశ్యమైన రచయిత్రి 'వక్కలంక పద్మసుందరి' పేరు చిరకాలం నిలచిపోవాలని కాంక్షిస్తున్నాను. ఆమె ఆత్మకు శాంతి కలగాలని కోరుతూ నివాళులర్పిస్తున్నాను.

– విజయలక్ష్మి, మిర్యాలగూడ.

## ఆదర్శవంతం (మూడవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)

తన నిష్క్రమణతో పాఠక లోకాన్ని శోకసంద్రాన ముంచి, తన విశేషరచనలతో ఎంతో ప్రభావితం చేసిన అమర రచయిత్రి పద్మసుందరిగారి నవల 'విజేత' ఈ నెల 'చతుర'లో చదివి ఆమె మరణానికి బాధ, చక్కటి నవల నందించారనే ఆనందం ఏకకాలంలో పొందాము. వారి నవలలను 'చతుర' ఎంతగానో ప్రోత్సహించింది. పద్మసుందరిగారు 'ఇకలేరు' అని తల్చుకుంటే చాలాచాలా బాధ కలుగుతోంది. వారికిదే మా శ్రద్ధాంజలి.

పువ్వుల అలంకరణలతో పువ్వులాంటి సున్నిత మనసున్న 'దాక్షిణ్య' పరిస్థితుల తాకిడిని ఒంటరిగా ఎదుర్కొని తన జీవితాన్ని 'నందనవనం'గా మార్చుకున్న వైనం అద్భుతంగా మన ముందుంచారు రచయిత్రి. 'దాక్షిణ్య' పాత్ర నేటి యువతులకు ఎంతో ఆదర్శకరం. పరిస్థితులు ఎలా ఉన్నా, తన కాళ్ళపై తాను నిలబడి ధైర్యంగా మనుగడ సాగించటం నేడు ప్రతి యువతీ ఆచరించదగ్గ విషయం. కేవలం పాత్రలను ప్రవేశపెట్టి, వారిచుట్టూ అనవసర విషయాలలో కథ అల్లి విసుగు కలిగించే పరిస్థితి నేడు రచనల్లో ఎక్కువ కనపడుతోంది. అలా కాకుండా, ప్రతిపాత్ర కథకు అవసరపడుతూ, కథాగమనాన్ని ఉత్తేజకరంగా ఆసక్తికలిగేలా చదివిస్తూ, సాగిపోతూ తన రచనల్లో ఎన్నో వ్యాపార మెలుకువలు, ఎన్నో రంగాల్లోని మంచిచెడ్డలు చదువరులు తెలుసుకునేలాగ పాఠకులను ఆలోచింపచేసి, ఏదో ఒక సందేశాన్ని అందించటం ఈ రచయిత్రికి వెన్నతో పెట్టిన విద్య. ఈ నవల కూడా ఇందుకు మినహాయింపు కాదు. భీమేష్, శ్రీకాంత్‌లు స్నేహానికి నిర్వచనం చెప్తూ, సరియైన సమయంలో, సరియైన నిర్ణయం తీసుకుంటూ యువకులకు ఆదర్శవంతంగా నిలిచారు.

– ఉష, సిరిపూర్ కాగజ్‌నగర్.

## కన్నీటి నివాళి (నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)

వక్కలంక లక్ష్మి పద్మసుందరి గారి రచన 'విజేత' నవల ఆత్మీయ సంబంధాలు, మానవీయ విలువలను విశదపరచింది. కథ మొత్తం ప్రధాన పాత్ర అయిన దాక్షిణ్య చుట్టూనే తిరిగినప్పటికినీ మిగిలిన పాత్రలను మలచిన తీరు బాగుంది. విసుగు పుట్టకుండా చదివింపజేసిన కథ ఇది. "విజేత"లో దాక్షిణ్య సహా ప్రతి పాత్రా కూడా ఎవరికి వారు విజేతలే.

చిన్న వయస్సుల్లోనే పెళ్ళిళ్ళయిపోయిన వైదేహి, దాక్షిణ్యలు ఒకరి భర్త మరణించడం, మరొకరి భర్త అడ్రస్ లేకుండా పోవడం కారణంగా ఎంతో మనోనిబ్బరంతో కాలాన్ని వెళ్ళ

దీయడం శ్లాఘనీయం. భాస్కర్ పాత్ర నిడివి చిన్నదయినా, వైదేహికి జీవితాన్ని ప్రసాదించడం ద్వారా ఉన్నతమైన వ్యక్తిత్వాన్ని చాటింది. దాక్షిణ్య పాత్ర అంతా తానై నడిచింది. పట్టుదల, ముక్కుసూటిదనం, రోషం, ప్రేమ, కరుణ అన్నీ కలబోసిన రూపం దాక్షిణ్య. ఏనాటికైనా తాళికట్టిన భర్త తిరిగి వస్తాడనే ఆశతో తన కాళ్ళపై తాను నిలబడి, తన వారికే కాక మరికొందరికి కూడా జీవనోపాధిని కల్పించిన తీరు ప్రశంసనీయం.

శ్రీకాంత్, భీమేష్‌లు మంచి స్నేహానికి, నమ్మకానికి ప్రతిరూపాలు. న్యూవే కన్‌స్ట్రక్షన్స్ చెప్పబడినంత బాగా 'ఎలివేట్' కాలేదు. దాక్షిణ్యకు దీటుగా భీమేష్ పాత్ర సమానస్థాయిలో నడిచింది. గీత సపోర్టింగ్ కూడా కాదనలేం.

అంగవైకల్యాన్ని ఏమాత్రం లెక్కచేయకుండా కొండంత ఆత్మవిశ్వాసాన్ని అక్షరాలలో నింపి శారీరక బాధను పంటి బిగువున భరించి, భగవంతుని కాఠిన్యానికి బలయిపోయిన రచయిత్రి, పాఠకుల మనస్సులలో నిలిచిపోయి "విజేత" అయినారు. ఆమెకు నివాళి అర్పిస్తూ, వారి కుటుంబసభ్యులకు ప్రగాఢ సానుభూతిని తెలియజేసుకుంటున్నాము.

**– సిహెచ్.వి.యస్.వి.ప్రసాద్,** రాజమండ్రి.

## మరో ఆణిముత్యం (ఐదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)

ప్రతికూల పరిస్థితుల్లోనూ మొక్కవోని పట్టుదల, ఆత్మవిశ్వాసం, దీక్షాదక్షతలతో... లక్ష్యాన్ని సాధించి 'విజయాన్ని' చేకూర్చిపెట్టే మార్గదర్శిలాంటిది చతుర నవల 'విజేత'.

పూలమాలలో దారంలా ఫ్లోరిస్ట్ దాక్షిణ్యగాథను, పూల జీవనోపాధితో నడిపిస్తూ 'స్త్రీ మూర్తి పుష్పాలు ప్రియబాంధవులు' అన్న వ్యాఖ్యను నిరూపిస్తూ గంభీరంగా, శాంతంగా వాస్తవిక దృక్పథంతో ఆద్యంతం నవలను ఆసక్తికరంగా నడిపించగలిగారు రచయిత్రి. యిక స్నేహశీలి గీత గాథ సమాజంలోని అరుదైన తల్లిదండ్రుల వింత పోకడల పర్యవసానపు "అందరుండీ అనాథ" చందం లాంటిది. 'ఎవరికివారే యమునాతీరే' అన్నట్లు గీత బాల్యదశలోనే విడిపోయి. పరస్పరం మారుపెళ్లిళ్లు చేసుకుని 'ఎంచక్కా' ఎంజాయ్‌లు చేస్తూ బ్యాంకు బ్యాలెన్స్‌లనిచ్చినా ఆప్యాయతానురాగాలను పంచలేని ప్రబుద్ధులు ఆ 'విధివంచిత తల్లిదండ్రులు. గీత, దాక్షిణ్య పాత్రలు నైతికత, వ్యక్తిత్వం, సిన్సియారిటీ, వ్యథాభరిత జీవనాలను నందనవనాలు చేసుకోవటంలో 'నువ్వా - నేనా? ' అన్నట్లుగా పోటాపోటీగా నిలిచినట్లు గోచరిస్తుంది.

బాల్యంలో తాళికట్టిన భార్య ఆగమనానికి నిరీక్షిస్తూ మారుపెళ్లి చేసుకోని భీమేష్, హైందవ సాంప్రదాయానికి విలువిచ్చి భర్తకై వేచిచూసిన దాక్షిణ్యల పరిణయ, కలయికలతో కథ సుఖాంతమైంది. పాఠకులను హాయిగా ఊపిరిపీల్చుకోనిచ్చింది. పోతే, మంచి సందేశాత్మక నవలను, 'చతుర'లో మరో మారు చూసుకోకుండానే 'మనమధ్య నుండి నిష్క్రమించిన' లక్ష్మీపద్మసుందరి గారికి పాఠకలోకం అక్షరభాష్పాంజలి ఘటించటం మినహా ఏం చేయగలుగుతుంది?

**– ఎం.లక్ష్మీ రమేశ్ యాదవ్,** కరంజి.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2476685; Tirupati: 275757; Anantapur: 273444; Karimnagar: 223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 277438; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 22819557; Chennai: 28232390; Bangalore: 25583804. & www.eenadu.net



పాలరాతి పర్వత ప్రాకారంలా కన్పిస్తున్నా నిజానికవి ఘనీభవించిన సున్నపురాయి, ఇతర ఖనిజాల మిశ్రమంతో కూడిన పొరలు. వేడినీటి జలాశయాల అంచున ఘనీభవించిన జల తరంగాల రూపంలో, వేలాది సంవత్సరాలుగా ఒకదాని మీద ఒకటి పేరుకుపోయి ఇలా కన్పిస్తున్నాయి. టర్కీలోని పముక్కేల్ ప్రాంతంలో ఇవి ఒకటిన్నర మైళ్ల మేర వ్యాపించి పర్యాటకుల్ని ఆకర్షిస్తున్నాయి.

CHATURA Telugu Monthly Hyderabad-500 082 Regd No. H/HD/965/2006-2008 RN1/32186/78

# ప్రియ రైస్‌రిచ్‌తో

అవధులు లేని

## ఉల్లాసం, ఉత్సాహం...






**priya**
**RICE RICH**
*Healthy Cooking Oil*

Also Available

రైస్‌బ్రాన్ ఆయిల్ • గ్రౌండ్‌నట్ ఆయిల్

సన్‌ఫ్లవర్ ఆయిల్ • పామోలిన్ ఆయిల్

నువ్వుల నూనె • ప్రీతం కొబ్బరి నూనె



www.priyafoods.com

**USHODAYA ENTERPRISES LIMITED** (Priya Foods Division) D.No: 3-9-907/2, 1st Floor, Mahaveerlok Complex, Himayathnagar, Hyd- 29 Tel No : + 91 40 23220446, 23220421 Fax: 91 40 23220487